# మణి మంజీరాలు

## (కణ్ణగి జీవిత చరిత్ర)







- రచయిత -

కొండవేటి రామకృష్ణయ్య
ముదివర్తి పోస్టు, నెల్లూరు జిల్లా

1989 మూల్యం : రు. 30-00

# అంకితం

తల్లినెరుంగనేను. భువితండ్రి నెరింగినవాడ. వారికిన్
ఉల్లముసంత సింపగను, నుత్తమపౌత్రము వారిపాదముల్
మెల్లగజేర్చి నేఋణము, మేదిని దీర్పతలంచినాడ। నే
కొల్లలుగాగ దండములు గూరిచి భక్తిని నేనునిచ్చితిన్

ఇట్లు
కొం. రామకృష్ణయ్య

This Book is Published with the Financial Assistance of Tirumala Tirupati Devasthanams under their Scheme aid to Publish Religious Book.

ముద్రణ :- సింహపురి ప్రెస్, ట్రంకురోడ్డు - నెల్లూరు.

# పీఠిక

భారతదేశము వేదకాలము నాటినుండి పతివ్రతా తిలకము లకు పేరుగాంచినట్టిది. పురాణ కాలములలో సీత, సావిత్రి, అనసూయ, చంద్రమతి, సుకన్య, మొదలగు మహాపతివ్రతలకు జన్మనిచ్చి స్థిరకీర్తి నార్జించినది. నేటి మన కథానాయకురాలగు 'కణ్ణగి' కూడా పతిచర్యా భాగ్యంబుచే, సచ్ఛీలగుణాదులచేత, మేటి పతివ్రతాతిలకమై సకల మహిళాలోకంబునకు వన్నెతెచ్చి, తనవుభయ కుటుంబులను, స్థిరకీర్తితోనింపి, సకలమహీతలంబున చిరయశస్వయై నిలచినది. భర్త తన ధన,ధాన్య, భోగభాగ్యంబుల, మణిమాణిక్యాది రత్నచయంబుల, స్వర్ణ గృహాదుల నన్నింటిని వేశ్యాపరంబు గావించినను పతిని పల్లెత్తుమాట యనక, తన సహనశీలంబులే పెట్టని కోటగా నిలచినది.

భర్త వేశ్యాగృహ బహిష్కృతుడై యచేతనావస్థలో నున్నప్పుడు తానే తనభర్తనుచేరి, శుశ్రూషలచే, యారోగ్యవంతుని చేశినది. అట్టి 'కణ్ణగి' సతి చరిత్రమునే క్రొత్తరీతిలో పద్యనవలా ప్రబంధకముగా భగవత్కటాక్షముచే రచించితిని. దానికి కావలసిన ముద్రణా వ్యయంబును శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానములవారు ద్రవ్య సహాయమొనర్చిరి. వారికి యెంతయో కృతజ్ఞతాభివందన శతంబులర్పించుచున్నవాడ. ముద్రణలో యాలస్యమైనందులకు క్షంతవ్యుడను.

ఇట్లు

మీ సహకారమును సర్వదాకోరు

మీ విధేయుడు, గ్రంధకర్త

కొండవేటి రామకృష్ణయ్య

ముదివర్తి (మకాం), నెల్లూరుజిల్లా.

ఉ॥ కన్నగి దివ్యగాథ భువిగాయుత నిత్యము వైశ్యలోకపుం
పున్నమ వెన్నలోయనగఁ పూర్తిగభానుడు తారకాతతుల్
కన్నులపండువై నిలచు కాలము భూమిని వాసవీసతీ
పున్నెము పంటకాలమును పూర్తితలంపున నిల్పునట్లుగా 1

చం॥ హయములు సైన్యపంక్తులును, నబ్బురమందెడునట్లుపల్లకీల్
హొయలునుజారు, సుందరులు,నున్నతవంశులునుండ నెందరో
పయనముజేయుచుండె, విశీటాయగనుండెడివేళ, యెన్నియో
భయమును బాపు, దివ్వెలను, పట్టుకభృత్యులు వెంటనంటగా
2

కం॥ కావేరీ నౌకాశ్రయ
మావేళను లెక్కలేని యటులను, జనముల్
పోవగ మిత్రులు నిద్దరు
నీవిధి మాట్లాడుకొనుచు నేగిరి త్వరగా 3

గీ॥ అగు, నెవరది, యక్కజమనుగు మిత్ర
పాపనాశన, నీవును వచ్చినావె?
నీవు రావని యెంచుచు, నేనునుంటి
యనుచుబల్కెడి మిత్రుతో, యనియెనిట్లు 4

కం॥ సోదరుడు వచ్చుచుండెడి
నేదరియగ రాకయున్న నెఱియుమదినిన్
వేదన నొందెడి తండ్రియు
కాదనకను వచ్చినాడ। కారణమిదియే 5

చం॥ అనియెడిమిత్రుడగ్గరగ యాతనియశ్వముద్రోలి।లింగమున్
గనుముయదృష్టమన్న। గనగానగు నిందునకోవలున్మహా
ఘనుడట।కాంచనంబుగొని। గాంచకతృప్తిని। కీర్తికాంతనున్
గొనియునువచ్చుచుండె। వెలగూర్పగలేనటు। వెల్గుచుండగా
6

గీ॥ ఓమహాలింగమా? నీకు నున్నవారి
లోనశ్రేష్ఠుడు శ్రేష్ఠియు। తాను కూతు
నిత్తునంచును। వినియుంటి యేమియిపుడు
కోవలునకిత్తు నంచును। గూడవింటి 7

వ॥ అను పాపనాశనునిఁగని మహాలింగమిట్లనియె 8

క॥ పరనారిని। గంటితొగన
సరిగాదని యాంక్షవెట్టె జామాతయుతా
సరిపడునే యదినాకును
వరమిత్రమయంచు బల్కె। వాడునుననియెన్ 9

ఉ। కన్నగివంటి సుందరిని। గానగరాదెట, యట్టిదానినిన్
మున్నుగ జాయగాబడిసి। మోహవశుండవునౌచు నీవునున్
కన్నెలవేరెవారిగన। గానెటు। బుద్ధినిగోరుదీవు, నా
కన్నియు విస్మయంబునయె। కట్టుకథల్విడవోయిమిత్రుడా
10

వ॥ అనియన మహాలింగమిట్లనియె 11

చ॥ అతివలయౌవనంబు మఱియందములన్నియుదూరముండగా
అతిగనుగోరుచుండు। నదియంతికమందునజేరి వశ్యమై
కుతుకముదీర్చగాయపుడె। కోరికలన్నియుతీరి। యంతతో
కుతుకముచచ్చిపోవుగద। కోరికపర్వులుదీయు మిత్రమా
12

వ॥ అనినవిని పాపనాశనుండిట్లనియె 13

చం॥ చిరునగవంకురింపగను। చిక్కనిచక్కనిచుక్క కన్నగిన్
దరసియుపొందినంత। మరిదాపులజేరగవేరె సుందరిన్
అరయగవచ్చునొక్క। యదియంత। యసాధ్యముగాదెయేరికేన్
మరువగరాని శోభగౌను। మానినిగాంచిన యంతభూమిలో
14

కం। అని యెవరనిరిటు। సుందరి
గౌనుయందము। పురుషు। వశముగౌనుపరకల్లే
అనుభవమూనిన తదుపరి
గౌనునేయాకర్షణంబు। కొంచెముమదిలో 15

వ॥ మణియు వేశ్యలయందము యెప్పుడు మోహావశీకృతంతుం
జేయుగదాయన 16

కం॥ వెలయాలియంద మెపుడును
తులలేనిది యౌచునుండు, తుదివరకనగా
గలగలనవ్వియు, వేశ్యయు
నిలువదుయధికారమందు, నిశ్చయమదియే 17

వ॥ అంత పాపనాశనుడు మహాలింగముం జూచియిట్లనియె 18

కం॥ ఎవరెటులాడిన లింగమ
భువిలో రసికాగ్రమణివి, పూర్తిగనీవే
ఎవరేనియుగలరేవురి
యవితథ రసవర్తకుడవు, నన్నిటమిన్నే 19

గీ॥ రూపవిపణిలో సాటియే, యేపుమీరి
యనుచు నవ్వుచుపాపనాశనుడునంత
లలితనృత్యోత్సవంబున లలితగూడ
పాల్గొనునెయన, యౌనని పలికెనతడు 20

మ॥ పెరియన్నాయకి దత్తపుత్రియగుచు, న్విభ్రాంతినిన్గొల్పు తా
నెరజాణౌనని, వింటినిక్కువమె, నిన్నేమాధవీ పేరిటన్
వరలున్నామెయు, రాజమాలికకునై వచ్చున్ననవ్వింటి,పి
పరకున్వచ్చెనెయంచనంగ, నతడున్పల్కెన్నటవ్వేగమే 21

గీ॥ రాజమాలిక యెపుడు। విరాజమగుచు
నలకు లీనపువార కాంతలకుతప్ప
వేరపెరవారికినివొంద। వీలులేదు
"మాధవి" లలిత గోటికి। మాలదెపుడు 22

చం॥ అనవినినాదుబుద్ధి యిదియంతయుగాదు। సునందమాటలన్
వినియును బల్కె తిట్టులను। వీడెనునెప్పుడో యాకులీనత్
చనిమె కులీనవేశ్యయని। చక్కగచేలమకిచ్చి గౌరవం
బణచెనురాజునంచు। మరియందలిమాటయుజెప్పియుండగా
23

సీ॥ ముసలితనంబున- పసచెడిరాజును
తప్పుద్రోవనుబట్టె- నప్పుడట్లు
చేలమ్మ నారీతి- జేరగనారీతి
నిల్పుగొనగలేదు- నిశ్చయముగ
శంకర మొదలియు- చక్కని పతకము
వంజికన్యలె పొందవలెనటంచు
నిశ్చయించియునుండె। యిరువదియేండ్ల దొ
నాటిమాటయుతప్ప నేటివరకు

గీ॥ వంజికన్యలె పతకము। ల్బడసియుండె
కులగణికెలేను- పొందంగగలుగు వారు
ఇంకపెరవారలేయిందు। నెన్నటికిని
జేరరంచన। మాధవి జేరునెట్లు 24

వ॥ అనిమహాలింగమన పాపనాశమండిట్లనియె- కులీనవేశ్యాగణం
బులుతప్ప। వేరేయెవ్వారలు పాల్గొనలేకుంటంజేసి। యిట్లంటివి.
యిన్నివత్సరంబుల తరువాత। మాధవినృత్యోత్సవంబున పాల్గొన
బోవుచున్నయది। మాయరుంధతిగూడ పతకము మాధవిదేనని
బలుకుచున్నయది 25

గీ॥ ముసలిరాజును। మతితప్పి. మసలుకొనుట
వలన। చేలమ్మ। కులవేశ్యభావమేమి
లేకపోవుట। గౌరవ। మింకిపోవ
చేసికొనియెను। మఱియింత వాసిలేక 26

కం॥ శంకరమొదలియు పతకము
బింకంబదియేల। వంజివెలదియె। పొందున్
శంకయులేదని జెప్పెను
నింకసుగడచియునుపోయె। నేలను తడవన్ 27

గీ॥ కులగణికలేగాని। మణియే। వెలదియైన
యందునృత్యోత్సవంబున। పాల్గొనకను
నుండె। గెలుపన్న। ప్రశ్నయే। యుండదుగద
నేడు పాల్గొను మాధవి గూడనిజము 28

చం॥ పలుకుల వించులింగమది. పట్టపలేకను కోపమెంతయో
గలగలనవ్వి క్రోధమున। కన్నులనెర్రని జీరగ్రమ్మగా
నిలచియుబిచ్చమెత్తుకొను। నీచపుచేలమ శిష్యరాలకో
లలితనుగెల్చునేర్పునమెలంగుట। కోకిలకాకిసామ్యమా 29

గీ॥ సరితథాస్తని। తురగము। త్వరగత్రోలి
కొంతదూరంబునేగియు। నంతనతడు
స్వర్ణముద్రి కలెన్నియో। చల్లుచుంటి
వంట। లలితకు దోసిళ్ళ వింటినేను 30

వ॥ అననతండు 31

కం॥ తెలివిగల వైశ్యుడెప్పుడు
మెలగడు తనమార్గమీడి। మేలిమిస్వర్ణం
బులగని। ధర పెట్టెడునని
తెలియుము నాతపముపండు। తీరునుకోర్కెల్ 32

గీ॥ మదనపతకంబు। లలితయు వదలకుండ
గెలుచు। నేనుసులలితను। గెలుచుటద్ది
నిశ్చయంబగు రేపట నిన్నుబోలు
వారు[క్రు]ళ్ళియేడ్చుట। నిక్కవంబుజూడ 33

గీ॥ ఓమహాలింగమా। నేను। నున్నవారు
[క్రు]ళ్ళుటెందుకు। గృహమున కోరినట్టి
భార్యయున్నది। వాడలో। భామయుండె
యదియె। యమరావతీయన। ననియెనతడు 34

ఆ।వె॥ ముసలితనమువచ్చి। ముడుచుక పోయిన
పలుకునీవు। నిందుపలికితిగద
ఇట్టివానికెట్లు। నెరుగకు రసికత
రసవిహీనుడనగ। పొసగునిన్ను 35

కం॥ ఎవరేమనియనసుంతయు
చెవిజేర్చక। మోహియగుచు। జేరియువేశ్యన్
భువిలో లక్ష్మని తన్నుట
యవివేకమటంచునేను। ననియెదయెపుడున్ 36

చం॥ సరిసరియంచులింగమట, చాలగహేళనజేసి నవ్వుచున్
సిరిసిరియంచువచ్చునదు, ఛీయని, మూర్ఖుడటంచు నేనునున్
దరియగలేను, లక్ష్మియది, తానుస్వయంబుగ వెంటనంటియే
పరుగులుదీయగావలెను, బాగయదృష్టముపట్టినట్లయేన్ 37

గీ॥ నన్ను జూడుము, చింతయేనాడులేదు
తల్లిదండ్రులకిద్దియు, నుల్లమునను
నుంతనచ్చదు మూర్ఖులు, వంతపాడు
ధనమటంచని॥ యేవేళధనపుచింత 38

కం॥ కాలముకలసియు వచ్చిన
యేలనుచేకురదు లక్ష్మి, యెచటను మరియున్
చాలగకుంటికి, గంగయు
మేలనతాదరసితీరు, మేల్గొనతానున్ 39

వ॥ మహాలింగంబీరీతిపలుక పాపనాశనుండు 40

గీ॥ అట్టికలిమియురాకుండ, నట్టెనిలువ
యేమియౌనన, నామీద యీసుబూని
కీడుగోరుచునుంటివి, నేడులలిత
మిమ్ముకాదని నన్ను తానమ్మి కొనుట 41

ఆ।వె॥ ఈసుతోడనేద్వ। నేడ్వుడంచుసునేను
నిశ్చయంబుబూని। నిలుచువాడ
నాయదృష్టమింత। బాయదునంచని
హయమదిల్చెవేగ। యద్దిబోవ 42

కం॥ నౌకాశ్రయంబు నందున
చేకొనుదివిటీలు। వెలుగుజిమ్ముచునుండన్
నాకముదాకెడుస్తంభము
లేకొనియుండె। ధ్వజములును। నెన్నియొనుండన్ 43

వ॥ వ్యాపార సంబంధంబైన యనేకవస్తుసమూహంబులు। గుట్ట
లుగా పేర్చబడియుండె। నందుతన్మధ్యంబున మణిగణభూ
షితంబులై స్వర్ణలతాపరివేష్ఠితంబై। నానావిధపరిమళద్రవ్య
విరాజమానంబై నగరవైశ్య చక్రవర్తులనదగు। మహా
శ్రేష్ఠులైన। మహాశ్రేష్ఠులనగు మాసాయి శ్రేష్ఠియును।
కాబోవు వియ్యంకుడును మహాశ్రేష్ఠియునైన మాసాత్తు
శ్రేష్ఠియును। రత్నకంబళంబళంబుల। సుఖాసనాశీనులై
యుండ। వారికి కొంచెము దూరంబున। యితరనగరవర్తక
సమూహంబులు పరివారసహితులై గూర్చుండియుండిరి 44

గీ॥ సార్థవాహులు కోవలు। జాడకొఱకు
నౌకలనుచూచుచుండి। రనేకులచట
బ్రాహ్మసుముహూర్తమందున। పట్టణంపు
తీరదేశంబుజేరుట। దివ్యమనుచు 45

గీ॥ ఎంచి రప్పించుకోరిక। మించియుండ
యాముహూర్తమునందున। యచటజేర
పంచె। సుతునకు కన్నగి। భామతోడ
వరప్రధానంబు జరుగంగ వలసియుండె 46

ఆ।వె।। అమసాత్తుశ్రేష్ఠి। యాదక్షిణాపథ
మంత పేరు మోసినట్టివాడు
మధుర। యింద్రప్రస్థ మహనీయ పురముల
వర్తకస్థలములు వరుసనుండె 47

ఉ।। నౌకలనేకదేశముల. నాణ్యతమించెడి వస్తుజాలముల్
ఏకముగాగ। కొంచుజని। యెప్పుడునుత్తరభారతంబునన్
ఆకమనీయమై। వరలునట్టివి। సింహళ రోము దేశమం
దాకమనీయవస్తుతతి। తానును వానిని విక్రయించుచున్ 48

గీ॥ ఎన్నొ ద్వీపంబు లందునమిన్న లౌచు
వెలుగువాణిజ్య కేంద్రము ల్ద్వీపములను
వెలయుచుండెడి, కడువృద్ధిగలిగియవ్వి
రోము, సింహాళం బుల, 'యవ' భూములందు 49

గీ॥ వేల్లినాధుని సుతు, పరిరక్షణంబు
నందునుంచియు, కోవలు సార్థవాహు
జేసియుద్వివత్సరంబులు జేరబోయె
యతడు దీచ్యాతిదేశము, లన్నితిరిగి 50

ఉ॥ ఆతనివెంటనంటి, మరివైశ్యసుతుల్తనతో సమానులున్
భ్రాతనువోలె, తామనుభవంబును పొంధగవైశ్యశ్రేష్ఠులున్
ఆతతవస్తుసంతతిని, యంతయుగూర్చియు పంపవారలున్
ఆతరిపోవకుండనట, యాదునెలల్గ డువంగయప్పుడే 51

కం॥ తమతమ నైపుణ్యంబుల
తమవారలు మెచ్చునట్లు, తగినధనంబుల్
అమరిచిరి, వేల్లినాధుని
సమరస భావంబుతోడ, చక్కగదళముల్ 52

గీ॥ కోవలుండును। ప్రతిచోట। గూడెనిజము
లక్ష్మి। వ్యవహారకుశలతలలమిమించ
తండ్రికన్నసుమిన్నయౌ। తనయుడనుచు
నెల్లవారలుఁబొగడంగ। నెల్లయెడల 53

మ॥ ప్రియపుత్రిన్సుగుణాలవాల తనయన్ప్రేయస్స్వరూపాకృతిన్
నియమారాధను। పుణ్యశీల।గుణినిన్నిష్టాత్మసంశోభితన్
ప్రియసున్నాయనివాని। శీలయుతుని।న్విశ్వంబునన్కీర్తినిన్
వ్యయమున్చేయవివాని, యల్లునిగ।భావంబందునన్గోరియున్
54

ఆ॥వె॥ కుప్పుస్వామిపుత్రు। కోరిమహాలింగ
మనెడిపేరివాని। గొనగనెంచి
అతనివర్తనంబు। నవివేకమీక్షించి
పుత్రినీయుతల। పూర్తివీడె 55

ఉ॥ కోవలనామువైశ్యకుల। కోటి। మణిప్రభవిభ్రమాంచితున్
భూవలయంబునన్ప్రతిభబూనినవారిలో। శ్రేష్ఠు। శ్రేష్ఠియున్
తావినికన్నగిన్నొసగి। తానునునిల్లరికంబుగోరగా
తావినడంచునెంచి। మదిదానినివీడియువెంటవెంటనే 56

కం॥ తనకు సమానపువియ్యము
ననిమాసాయి యుతలంచి, నాకన్నగియున్
గొనియెడు సంతానంబది
గొనువిశ్వఖ్యాతియంచు, గూడియుముదమున్ 57

వ॥ ఉండుమాసాత్త్రశ్రేష్ఠితనయుంగాంచి యాలోచనాధీనుండగు
వియ్యంకుంగాంచి తనకొమారుండగు కోవలురాకయెరిగించ 58

గీ॥ అచటహర్షాశ్రువుల వ్రేలనవలద్రోచి,
పూజ్యుడైనట్టి మీమామ, పుణ్యవరుడు
శ్రమయనక యింతదూరంబు, చక్కవచ్చె
దండమర్పింపుమనగను, తనయుడంత 59

కం॥ కూతునునిచ్చెదునంచును
నాతడువినియుంట, సిగ్గునందియునచటన్
ఆతనికి నమస్కారము
చేతులుసాచియునుజేసె, శ్రేష్ఠికివేగన్ 60

గీ॥ హర్షపులకితగాత్రుడై, యల్లునిగని
కౌగలించియు, దీవించి, కోర్కెదీర
పంచరత్నాళిదిష్టిగా, పట్టిత్రిప్పి
పారవైచెనుశుభమును బడయునట్లు 61

కం॥ స్వాగతమిచ్చిన ముఖ్యుల
వేగమతాకలసి కొనియు। వివరములడిగెన్
తాగొనె భూసురబొద్దుల
యాగమ మంత్రాశిషముల। యతిముదమొప్పన్ 62

గీ॥ తీరమంతయు। ముదము। నపారముగను
పొంది। స్వాగతమివ్వగ। నందునున్న
అలపురోహితుడతివేగ యందువచ్చి
యందునున్నట్టివారిని। యపుడుగాంచి 63

కం॥ కావేరినదిని పూజల
వే వేగమ తనిపి యంత. విధులనువిడకన్
సీవునుపురినటు జొచ్చుట
యీవిధిశ్రేష్ఠంబటంచు। నెనయగబల్కెన్ 64

గీ॥ మిత్రమండతితోగూడి। పాత్రుడతడు
తండ్రి మామయుపురికిని। తరలిపోవ
స్నానఘట్టంబుజేర। స్వజాతివారు
వెంటనంట కోవలుడంత వేగముగను 65

సీ॥ స్నానఘట్టంబున- జనములులేకను
నిర్మలంబుగనుండె- నిశ్చలముగ
బిచ్చగాడొకడును- సచ్చటగూర్చుండి
కన్నులుమూయుచు- గాంచుచుండె
విరుగ బూసి నతరు- ల్విస్తృతంబుగనుండె
యిరుప్రక్క- లందున- యెన్నోతరులు
కోవలుండునువేగ- గూడియుమిత్రుల
స్నానఘట్టంబును- సరగజేర

గీ॥ అమిత సౌందర్యరాశియై। యచ్చరలను
బోలు। మాధవీనామయౌ। పొలతి మిన్న
పూజజేసియువచ్చుచు। పుణ్యవరుడు
కోవలునకెదురయ్యెను- కోవలుండు 66

గీ॥ శకునమెంతయో। యద్భుతజనితమయ్యె
యంచునఋవంగ। వెంటనే యంటియుండు
కన్ననాముంతుశ్రేష్ఠియు- కడుముదమున
పలికెనీరీతి మాధవీవర్తనంబు 67

గీ॥ నేడు నింద్రోత్సవంబున, నెలతమిన్న
రాజమాలిక పొందంగ రాపు తలచి
యున్న నర్తకీమణి నాగ, మున్ను నీవు
మెరుగు మంచని, మాధవినిట్టె గాంచి 68

కం॥ ఎవరను కొంటివొ యీతడు
నవిరళ లక్ష్మీనివాసు డాఢ్యుడు నితడున్
భువికోవళ నామాజ్యుడు
నువిదా? వినియుంటి వెపుడు, నుత్తమువీనిన్ 69

వ॥ అనేక విదేశంబుల వ్యాపారంబు గావించి, యఖండ ధన
రాసులనార్జించి, యనతికాలంబున, కీర్తిపతాకల నల్దిక్కుల
నెగురవేసి, నేడే మన పురంబున కుంతిరిగివచ్చి యున్న
వాడు. యనిపరిచయ వాక్యంబులు కన్నపశ్రేష్ఠిజేసె- 70

చం॥ పరిచయమిట్లుజేసినను, భామిని మాధవి బుద్ధి నింతయున్
దొరలగనీక, నిశ్చలముతో నిలుచుండెను తల్లియంతటన్
వరలనమస్కృతుల్, వడిగవంగియు, దండములట్టిపెట్టుచున్
తరణియుచంద్రుడు న్నెపుడు, తథ్యము వేరెవరింత తెల్పగా
71

గీ॥ పీడు కుద్భాధతీర్చను, నీకు నివ్వి
యేల, మాకుపవిత్రంబు నెంతొమంగ
ళంబు, నైనహారంబును, నందికొనెద
యనియు, పెరియనాయకిగొని, యరిగెనంత 81

గీ॥ అమెసాగినదిక్కునే, యతడు గనియు
నతిసమర్థత గల్గిన, యతివయనుచు
అయిదుముద్రల నిచ్చియు, నద్దిబిచ్చ
గాని, లక్ష్మినెల్లనుగొనె గాదెయనియె 82

కం॥ ఈమెయునంత తొసాగెను
నామెయునేమివ్వకుండ, హారియించెమడిన్
ఈమెను మించినదామెయు
సీమహియనె కన్ననవ్వి, యెంతయులేద్కా 83

ఉ॥ చేతులపీధిమారుచును, చేరిన యౌవనద్రవ్యమెవ్వడేన్
పాతదియంచు త్రోయుగని, పండితుడెన్నడు బుద్ధిహీనుడై
చేతముపారవేసికొని, చేరడుమిత్రమ, బుద్ధిమంతుడు
ఏతరిపీడకుండు, సిరినేగొని తావరించు స్థైర్యుడై 84

కం॥ ఈవృత్తాంతము పురిలో
తావలమై వార్తలకును, తానును వెలసెన్
కోవలు తండ్రియు, మామయు
తావడసిరి తృప్తి యెంతో తమమదియందున్ 85

కం॥ వెలయాలి వాడలన్నియు
చిలువలు, పలువలును జేసి, చెప్పుకొనంగా
గలుగు నదృష్టము, మాధవి
తొలగగజేసుకొనెయామె, తూర్ణముగాగన్ 86

గీ॥ తెలివిలేమిని చేకొని, వెలితివడియె
శ్రేష్ఠివర్యులయవమానచె యిదములచె
వచ్చునుత్సవ కార్యంబు పడయకుండ
నడ్డుపడునంచు నందరు, ననిరియందు 87

వ॥ మాధవినిపసితనంబున, పెరియనాయకి వెలయిడి, ఖరీదించె
పెరియన్నాయకి తల్లిగూడా యామెను నావిధంబుననె,
విలుచుకొనియె యావేశ్యాకులంబుల, వంజివర్గంబు,
యిలంగాయి, నలంగాయ యని మూడు వర్గంబులుగా
విభజింపబడియె, యాచారభేదంబులు, వాటియందు
కోకొల్లలుగా నున్నయవి. యవియట్లుండ- 88

గీ॥ నర్తకీమణులెల్ల। రనంతముగను
నృత్యమందున పాల్గొన్న। నిక్కముగను
మాధవీలలితలమధ్య- వాదమెంతొ
తీవ్రమగునంచుననుకొనిరా ప్రజలును. 89

గీ॥ వంజివంశాన। పేర్గాంచె। ప్రబలమగును
నందు। రాజమ్మయనునామె। యతివలలిత
తల్లి। వేశ్యవాటికకెల్ల। తానెపేరు
గాంచినవనితగాయట। మించిపోయె 90

సీ॥ వైశ్యశ్రేష్ఠులకెల్ల। వర్తిల్లుపేరును
వేశ్యరాజమ్మయు- వేగపొందె
పెరియనాయకియన్న। పెంపుడుకూతురు
మాధవియన్నను। మాటపడదు
ఆపురేశ్వరుమంది- రంబునతానుప్ర
ధానవేశ్యగనుండె। ధనముజిమ్మి
వంజికులమ్మంత। పట్టియునుండెను
సామంతులెందరో। నామెవెంట

గీ॥ నలరు, మాధవీ, పెరియనాయకలయందు
యెన్నియో మాటలను జేర్చి, యెన్నొ విధము
లంతటప్రచారమున్చేసె యమితముగను
లలిత తల్లియు, రాజమ్మ కలుషితముగ 91

మ॥ పెరియన్నాయకిగాయకీమణిగ, నవ్వీటన్మహాగౌరవం
బరిసెన్నింటికివచ్చు నాయవనవ్యాపారిన్ధనాఢ్యున్నటన్
ధరబన్నాయను పేరుతో బరగు, నాతండేధనందివ్వగా
పెరియన్నాయకి లెక్కలేనియటులన్పొందజెసెన్స్వరన్ 92

వ॥ అట్లు, రాజమ్మ పెరియ, నాయకిల మధ్య వైరంబు పెరుగ 93

గీ॥ నృత్యగురువును, రాకుండ, నిశ్చలముగ
ధనముయెరవేసి, నిలిపిన, తగుదుననుచు
మాధవికి విద్యగరుపగ, మానకుండ
వచ్చె చేలమ్మ ముందుకు, భయములేక 94

ఆ॥వె॥ ముందురాజపితకు మందులగొనియును
నంతులేని సిరిని, యనుభవించి
ధనమునంతబోవ, ధరణిలో చేలమ్మ
ముష్టియెత్తుకొనుచు పోవుచుండె 95

గీ॥ విద్య గరుపంగ రాకున్న। వేరెవండు
తానె విద్యను గరిపియు। తగువిధమున
రాజపతకము గెలిపించి। రాజగౌర
వంబునందంగ జేతును। నంచుబలికె 96

వ॥ ప్రతినయొనర్చి యాచేలమ్మ నిట్లని ప్రకటించె 97

కం॥ మరియును శంకరగురువుల
కరుఁదౌగడ్డంబు పెరికి। యాగడ్డంబున్
ధరియించెద నేననియట
కరుగకువాక్యంబులామె। కరమటు బల్కెన్ 98

కం॥ అదిమొదలు నామెమాటలు
మదిమెదలగనవ్వుకొనుట। మానరుజనముల్
కదిలెడి చర్చలవినియును
నదిరెనునావేశ్యయందు నామాటలకున్ 99

కం॥ అరయూరునుండి రాజును
తరలియు ప్రతివత్సరంబు। తానునుసభకున్
వరుసగ వచ్చుటజరిగెడి
మరినృత్యంబదియు జరుగ। మానకరేడున్ 100

గీ॥ శ్రేష్ఠివర్యులు। నిద్దరు। చిరతరంబు
ప్రభువునరసన గూర్చుండి। వరలుచంద్రు
కోవలునకల్లె రాజును గూర్చెనపుడు
నట్టిమర్యాద వీడక। యనవరతము 101

సీ॥ నృత్యోత్సవంబున, నిరతంబునగరంబు
నెన్నటులేనట్లు, నెన్నడిగిన
దీపమాలికలెన్నో। దీపించునట్లుగ
వెలయంగ జేసిరి వీధులందు
కస్తూరికలయంపి। కలయంగజల్లరి
ముగ్గులెన్నియొవేసి। ముచ్చటగను
అలపతాకలునింగి। నంటియునెగురంగ
శోభనెంతయు గూర్చె। శోభనముగ

గీ॥ సంప్రదాయంబు మేరకు। చక్కగాను
సభను నడుపంగవలశినయట్టి వారు
దేవదాసియు। నాట్యంపుదేశికుండు
నందువచ్చియుజేరిరి। యందరచట 102

శా॥ కావేరీపురినుండు కాంతలును, చక్కన్భూషణాలంకృతిన్
కావేరీపురివైభవోన్నతికి, తార్కాణంబుగా వారలున్
ఆవేళన్నటజేర, చేలమయు, తానందన్కరూపంబు, కాం
తావారంబులజేరకుండ నిలచెన్తావెల్పులనూచుచున్ 103

గీ॥ లలిత, మాధవి, నృత్యంబు, లలవిమించ
పతకమును బొందుకోర్కెయునతిగనుండ
అందరందునమెచ్చుగ, యందమొప్ప
నెవరు నెవరంచు, చర్చలు జేయుచుండ 104

కం॥ వెలయాలి సముదయంబున
గలసియుతామందునుండి, గనుచునునుండెన్
అలఘుని కోవలునచ్చుట
లలనయునా మాధవియును, లాలిత్యముగాన్ 105

కం॥ మనసుమ, వశముననుంచగ
యనయముయత్నంబుజేసి, యటవిఫలుండై
గనుచును కోవలుడుండెను
వనితను మాధవినియుందు, బాయనిమమతన్ 106

వ॥ అట్లు మాధవి లలితల నృత్యంబు ముగించినంత. 107

గీ॥ లలితయాయాసమెంతయో। యలముగొనగ
వుచ్ఛనిశ్వాసములతోడ। వుండెనందు
మాధవినిగాంచి। యీర్ష్యయు మదినినింధ
తల్లిప్రక్కగ నిలబడె యుల్లమందర 108

గీ॥ న్యాయనిర్ణేతలందరు. న్యాయమందు
నిర్ణయింపగలేకను। నిశ్చయించి
నారు। పతకమెవ్వరికిని। యందబోదు
స్వర్ణనాణెము। లిచ్చుట- జాలుననుచు. 109

చం॥ అదివిని। మాధవీలలన। యామహారాజును। గాంచలేచియున్
ముదమును వొందరాజు। కరముల్మొ కళించియు. నిట్లుబల్కెతా
విదితులు। మీరు తీర్పునకు వేరొకమాటను బల్కనెట్లనౌ
అదియటులుంచి।విన్నపము నందగజేసెద చిత్తగింపుడీ 110

సీ॥ ఏనాడు సభలోన। యీరీతి న్యాయంబు
నిలుపుట జరిగెనే। నిపుణులార
నృత్యోత్సవంబున। నేడిట జరుపుట
ప్రభువుల నిర్ణయ- పాటవంబు
శంకించునంచును। సంశయంబున నేను
వినతిజేయుచునుంటి వినుడుమీరు
నృత్యంబుమరలంగ। నియమింపజేతుము
నలసట లేకుండ- యనుమతించ

గీ॥ న్యాయనిర్ణయమును- జేయునంతవరకు
సాగుచుండెడు। నృత్యంబు। సత్యమిదియ
శారదా రూపులైనట్టి వారుగురువు
లిందుగలరంచు మాధవి యందువలుక 111

ఉ॥ బాలికనిర్ణయంబు। మరిబాగనిమెచ్చియు। ధర్మసమ్మతం
బేలను। నిల్పుటంచునట। యెంతయు నిశ్చయమూనజేసియా
బాలల। నృత్యమున్మరల। బాగుగజేయుడటంచు రాజునున్
మేలననెల్లవారునట। మించగరానిది యాజ్ఞజేసినన్ 112

ఉ॥ భూపతియాజ్ఞమీరగను। పొందకధైర్యము। వారుయిద్దరున్
ఆపయి। వాద్యగానముల। నందరుమెచ్చగ। నృత్యమందునన్
చేపడు రాజమాలికని। శీఘ్రమజేసిరి। శాస్త్రరీతులున్
ప్రాపుగనుండ।యాలలిత। ప్రాభవమీడియు-మూర్ఛవోయినన్
113

గీ॥ మాధవి విజేత యంచను మాటలంత
మారుమ్రోగంగ। రాజును జేరవచ్చి
విజయహారంబు। మాధవివేగగొనగ
వేసెమెడలోన। యందంబు। వెలిగిపోవ 114

కం॥ హారముతోడుత కోపలు
నారమ్యంబైన హృదయ, హారముగెల్చెన్
మీరగరాని ప్రతిజ్ఞను
జేరిచినెరవేర్చుకొనియె, జేడియయందున్ 115

గీ॥ విజయయైనట్టి మాధవి, వేడ్క మీర
విజయ రథమున గూర్చుండి వినుతమైన
రీతులను వెల్గ, వెంబడి, నాతితోడ
యెన్నొరథములు, పోయెను, నెంతోవేగ 116

గీ॥ ధనికులెందరో, మాధవి దరినిజేర
కోరికలతెల్ప, వారిని జేరనీక
ఎవరు లక్షవనిమిదియై, యొసయునట్టి
యలకలంజుల హారంబు, నందుకొనిన 117

వ॥ వారినే నేను చేపట్టుదునని వివరించిపంచె 118

చం॥ చతురతమించు వేశ్యయది, చాలగకూతు మనోగతంబునన్
మతినిడి నమ్మకంబున, సమంబగువానినిజేరి, యిట్లనెన్
అతిగను, నిన్నుబుద్ధినిడి, యన్నమమానియు నీదుకోసమై
సతతముమన్మధార్తివడి, జాగరమున్నిటజేయుచుండెగా 119

కం॥ వరలక్ష్మి ప్రేమికున్నట
యరసియు హారంబు నేడునాశ్రయమంతన్
అరయగనిచ్చియు గొనునట
ధరలో రత్నాలశ్రేష్ఠి। తనయుడుననుమా। 120

కం॥ హారము మీవరికంపితి
నేరను నీకమీదనేను నేమియుజేయన్
హారముకొనెదవొ। కాదని
కోరికలీడేర్చుకొనెదొ। కోవల చెపుమా 121

గీ॥ కోవలుండును దానినే। గోరుచుంట
యట్టి సందేశమును తెచ్చునట్టివాని
కంతధనమిచ్చి। రత్నముల్। యమితముగను
నిచ్చిపంపెను। నామెయు మెచ్చగాను 122

వ॥ అట్లుండునెట మాసాత్తుశ్రేష్ఠియు తనకాబోవు కోడలికి
కాన్కగా నిచ్చుటకై - 123

మ॥ మణిమంజీరములన్మసాత్తు। మణులన్మాణిక్యముల్లోపలన్
గొని, విందించియు, పాండ్యరాణికచటన్గూర్పంగనౌ।యట్టివే
గొనితెచ్చెన్ధరలోన। నాస్నుషకు। నింకోచోటలేవంచు। తా
ననిపించెన్ప్రజలందు। కీర్తిగొనగా। యవ్వానిశ్రేష్ఠియున్
124

కం॥ ఈళ్లో మాధవి పంపిన
యాలోచననుండుజాబు॥ నాతడుగనియున్
బేలయి "పన్యా.. నిర్మిత
లీలోద్యానంబుజేర- లేఖయుతోదై 125

వ॥ ఉండ॥ యతిరహస్యంబున॥ గ్రీకునిర్మాణ పరిశోభితంబై.
సకలకళానిలయంబై, యొప్పు॥ నాయుద్యానవనంబున॥ చతు
ర్ద్వారంబులుండు యేద్వారంబున॥ నరుగుదెంచునోయని॥
నాల్గుద్వారంబుల రహస్యంబుగా పరిచారికల నియమించి
కోవలునిరాక తెలియునట్లుగా యేర్పరిచె- 126

ఉ॥ మాతులుబుద్ధినిన్నెఱిగి॥ మాధవిప్రేమయుమించియుండగా
ఆతలపుల్నిరంతరము॥ నందుననిద్దురలేకజేయగా
ఆతడునొక్కరోజు॥యుగమంచును॥నెంచుచునుండునప్పుడే
భ్రాతనువోలు॥వేల్లియును॥ వాడును॥ వేశ్యలపొందుమానగా
127

గీ॥ మంచిదంచును॥ నతడు॥ బోధించియుండె
తండ్రికెప్పుడు॥ నివియేమి దగులువడవు
జీవితంబున యెరుగడు॥ చివుకజేయు
వేశ్యసంపర్కభారంబు॥ వినుతకీర్తి 128

గీ॥ వెండిబంగారురేకుల। వినుతికెక్క
పెక్కుశిల్పాలు నెక్కించి। నిక్కువముగ
నుండునంచును। నిల్చెను। మెండుగాను
రత్నకంబళములెన్నొ ప్రణుతికెక్కి 129

కం॥ ఫలపుష్పంబుల తరువులు
నలకృత్రిమపు సరసులెన్నొ। నలరుచునుండన్
మిలమిలలాడెడి పక్షులు
కొలువై యుండంగనిల్చె। కూరిమిమీరన్ 130

ఉ॥ మానకవచ్చునంచెటిగి। మాధవియాశతొ। నాసముద్రముఃజా
గానగవచ్చునట్లు। నటకట్టియుః నుండెడి। ద్వారదేశమున్
అనవసుందరాంగియు। ననంతమునై నటువంటియాశయున్
మానసమందునిల్పికొని। మానకకోవలఃజాడ జూచుచున్
131

చం॥ అవసరమైన। కార్యముల నన్నియు జేసియునక్కడక్కడన్
అవిగనరానియట్లు। నటనావనచారుల। నిల్పికోవలుం
డవనిని చేరగానె। యదియంతయు తెల్పగ। యందువారలన్
జవమునజేరునట్లుగను। చయ్యనజేసెను నామెతల్లియున్
132

ఆ.వె.॥ తండ్రి బాధమదిని, తెదవగయోర్వంగ
లేనివాడు, తానుగాని మదిని
వృద్ధిజెందుచుండు, వేళనునిదియంత
జరుగభయముజెంది, వరలుచుండె 133

శా.॥ ఎన్నోనిన్మది చిక్కువెట్టగను, వానిన్లెక్కయేచేయకన్
మున్నెన్నడునుజూడరాని సుఖమున్బొందంగ, దాదానినిన్
మూన్నాళ్లేయు, జేరకుండగను, సంపూర్తిన్జేయగాలేక, తా
నెన్నండున్మదివీడలేని, వ్యధతో, యెంతేని కామార్తుడై -
134

గీ.॥ అతివమాధవి సౌందర్య, మందుదవిలి
యామెచాతుర్యవాక్పాణ, మామెనట్టె
వదలలేకుండె, మరియింక, వర్ధిలంగ
చేయదగినట్టి, కులకీర్తి, చేవచెడుప 135

మ.॥ మదిలోనొప్పక కోవలుందు, నటయేమార్గంబునున్వీడగా
తుదిదాకన్మది విల్పలేక, తనలో, తూర్ణంబుగా కీర్తినిన్
వదలన్లేకను, పెంపునొంద ధరలో వాణిజ్యసంపాదనల్
మదిజామాత కుబేరుడై తనరుట న్మాన్యుండునై యొప్పటన్
136

వ॥ తనవిషయంబంతయు మాతులుండగు మాసాయిశ్రేష్ఠి దృష్టింజేరుటయు, మనస్తాపంబు గలిగించుచుండె మఱియు యద్భుతసౌందర్యరాశియు, లక్ష్మీసంపన్నయు, సుగుణాల వాలయు, పతిచరణ, సంసక్తమానసయునైన కన్నగిం భార్యగాపొందుట తనప్రవర్తన కారణంబున బాధాకరంబుగా దోచుచుండె- 137

చం॥ అయినను నాల్గురోజులయె, యామెనుగాంచియు నవ్వియప్పుడే
అయనము లందునాల్గునయె, నంచును బుద్దినితోచుండెగా
పయినము జేయుచుండెమది, వారణజేసినగాని, రాత్రులన్
వ్యయమును జేయకష్టమయె,భావములొక్కటినిల్వకుండెగా
138

కం॥ కావేరీనదితటిని
న్నావెలదుకగాంచి పల్కినట్టివిమాటల్
కోవలు మది మెదలగనవి
కోవలుతల తిరిగిబోవ, గూర్చెనుక్షోభల్ 139

చం॥ మనసదినిల్కడన్గోనక, మానుటచేతను, కొవలుండునున్
తనమది నేదదీరగను, తానునునశ్వమునెక్కి, సంద్రమున్
గనితటమంతజూచియును, గ్రక్కునవచ్చుచునుండ దారిలో
గనెనొకనాతి దుఃఖమున, గాంచగలేనటు లేడ్చుచుండగా
140

కం॥ దరసియు నామెనుకోవలు
దరసియు, నడుగంగ, నామెయాచరితంబున్
వరలెడు జాబును నిచ్చెను
మరణమునొందెదునటంచు, మాధవియనియె 141

చం॥ గనుగొనిలేఖశంకతొలగంగను, నందుననుండునట్లుగా
మునుగొను, మార్గమంతయును, పూర్తిగజాబునుజూచియందునన్
గనుపడుచుండు నాయవను, గాదిలితోటను నుండునంచునున్
మనమునతోషముఙ్గొనియు, మార్గముతో చెనటంచునాతడున్
142

గీ॥ మామభయమది మదిలోన, మదనపెట్ట
మధురసంభాషణంబుల, మాధవియును
గలుగజేసెడి మత్తులో గానకేమి
నాగరత్నభాషణములు, బాగ్రతోయ 143

గీ॥ పెరటిత్రోవను, సూర్యుండు, వేగవచ్చి
మాద్రిచేరంగ, కోవలుడశ్వమెక్కి
మిత్రులిద్దరు వెంటరా, మేటిపైన
కబురులాడుచు తిరిగెను, సుబుసుపోక- 144

వ॥ ఇట్లు తిరిగితిరిగి యంత- 14

ఆ॥వె॥ ఝాము ప్రొద్దుబోవ, యేమార్గమూహించె
దానిబట్టిపోయి తప్పకుండ
పరుగులెత్తి జేర బన్నావనంబును
కళ్లెమందెనొకడు, కరమునుండి- 14

కం॥ కళ్లెము సేవకుడటు గొని
చల్లనిదండంబు లొసగ, చక్కగనొకడున్
మెల్లగ త్రోవయు జూపగ
యల్లననుద్యానవనివి నతడటు జేరన్ 147

కం॥ వనమున పన్నా శ్రేష్ఠితో
మనమూరగ పాచికలను, మాధవితానున్
గొనియును నాడుచునుండెను
గనుచును తల్లియును, మాల, గట్టుచునుండెన్ 148

గీ॥ పెరియనాయకి, దండలు వరుసగట్టు
చుండి, మద్యంబుపాత్రయు, నిండినంత
ఇచ్చెపన్నాకు మధ్యలో, యిచ్చుచుండె
యామె తాంబూల మెంతయో నమితప్రీతి 149

కం॥ ఎన్నియు జేయుచు నున్నను
కన్నులు కోవలు నిరాక, గాంచుచునుండెన్
సన్నగ నవ్వుచు నుండియు
నెన్నియొ మాటలను బల్కె, యెంతయు వేడ్కన్ 150

ఉ॥ కోవలు రాక చారుదట, గూడగ వేగము వచ్చి చెప్పినన్
ఆ వివరంబు నంతయును, నచ్చట వించును పన్నాముడున్
భావికథా విధానమును, బాగుగ యోజనజేసి, వేగమే
పోవగ లేచి, పాచికల, ముట్టక పైచియు బోయె నాతడున్ 151

మ॥ పెరియన్నాయకి, మాధవిగ్గని యుతే వేయంచు, చేపట్టియున్
త్వరగా నామెను, మంచమందు బవళింపన్జేయ బోవంగనా
పరసీలోచన తల్లి గాంచి, నిటులన్ చక్కంగ, తా బల్కెగా
వరవ్యాపారము, ప్రేమనామమున, చేపట్టంగనే బూనితే
152

కం॥ మాటలు వించును పెరియయు
నేటికి యీలాటి మాట, యీగతి వలుకన్
బోటీ వేగమ వచ్చెదు
బోటీకు విముఖత కను, చూపుము ప్రేమన్ 153

చం॥ అనియనునంతలోన। త్వరితంబున। కోవలఁ డందువచ్చియున్
గనియును నందునామెను। వికాసముగూడగ। దండమంచుమున్
అనియును। నందుమాధవిని। యార్తినిబొందుచునుండ। గాంచియున్
గొనెనొకొదుఃఖమున్నిటుల। గూడగవచ్చుటకయ్యె జాప్యమున్ 154

కం॥ అనియన పెరియన్నాయకి
యనె వినుగనకుండనిందు। నామెయు విల్వన్
గొనె దుఃఖము। పోగొట్టుట
కనిశముకష్టంబునయ్యె। గానకనిన్నున్ 155

ఆ। వె। ఎపుడు వచ్చునమ్మ। యేగతిప్రాణము
ల్నిలువుకొందు నిచట। నేను చెపుమ
అన్నమింతతినక। యెన్నెన్నొ చెప్పిన
వినక యేడ్చుచుండె। వినుమునీవు. 156

ఆ వె। పెండ్లి యాడినంత। విడుచునెనిన్నును
యట్టివాడుకాదు ననుచునేను
చెప్పుచుంటిగాని। చెప్పిన వినకను
యేడ్చుచుండె। నేను నేమిచెపుదు 157

గీ॥ అన్ని చెప్పంగనీరీతి। యన్నివినియు
నతడు మాధవిప్రక్కఁగ। వెతలఁగుడుచు
పట్లు ముఖమును చేతులహత్తుకొనియు
నుండ। మృదువుగ। నిమురుచునాడెనిట్లు 158

కం॥ నావైపు జూడు మంచును
కోవలుడాహస్తములను। కూరిమినిమురన్
అవలద్రోచియు హస్తము
నావైపున తిరిగిపండె। యామెయువేగన్ 159

వ॥ అదిగని పెదియనాయకి। యిట్లనివ్రాక్రుచ్చె 160

గీ॥ అందివచ్చెయదృష్టంబు। నందుకొమ్మ
యెన్ని జన్మాల తపము। నేమున్నుజేసి
యుంట దేవసమానుడు। నుండెయదుగొ
నీదు పూజలు ఫలియించె। నిక్కువమఁగ 161

మ॥ అనగామాధవి। రాతిబొమ్మకును। పుష్పాలంకృతిజ్జేసినన్
గొనునే।రాయియు।నేగతిన్నమములుస్గూర్పంగనవ్వాసనల్
గనగా। శక్యమె దేవుడేయయిన। నేగావించుపూజావిధిన్
గొనకుండన్నిటుజేయునొక్కొయవియుస్తోపంబునన్నల్లైతా
162

గీ॥ చేతులూపుచు పెరియయు చెప్పెనిటుల
మూడుకాలంబులందున। నాడునిట్లు
జేసి యెఱుగము। చోద్యంబు చేరరాగ
పలుకకుండ వచ్చినగూడ। యఱుకగొనుట 163

వ॥ చోద్యంబుగా నున్నయది। నేనుబ్రోపుచున్నదాన. నీయిష్ట
ప్రకారంబున ప్రవర్తించుమని. పెరియనాయకి। ప్రక్కకుం
తప్పుకొని రహస్యంబున నేమిజరుగునోయని। నిరీక్షించు
చుండెను 164

కం॥ కౌగిలి జేర్చియు మాధవి
యాగగలేనట్లునతడు। నామెతోననియెన్
వేగమ యీశిలతనునీ
వేగద ప్రాణమిచ్చి। వెలయించుటయున్ 165

ఆ.వె. అట్టినీవుదీని। గట్టిగనమ్మంగ
లేకపోతివింక। యేగతినిట
నమ్మగలరు చెప్పు। నామాట నమ్ముమీ
నిన్నువిడచి బ్రతుక। నెన్నదేవి 166

వ॥ అననామాధవి। క్రీగంట గనుంగొనుచు 167

కం॥ వచ్చెదు నీహృదయేశ్వరి
యిచ్చకములు నేలగాని। యింకెటునీవున్
పుచ్చుకొనెదు పూజావిధి
యిచ్చట నీకేల। నాతో। యీవిధినుండఙా 168

చం॥ అనియెడుమాటకున్నగియు। వైశ్యకులప్రవరుండు। మాధవిన్
గొనియును। కౌగలిన్నదుట। గూర్చియుముద్దును। లోకరీతివిన్
మనుచుటకే వివాహమని। మానినినమ్ముము। నీవులక్ష్మితో
గొనియెడుయజ్ఞమంచుమది। గుర్తునునుంచుము। శ్రేష్ఠిలక్ష్మినిన్
169

వ॥ గైకొనిహవిస్సుగా సమర్పించి ప్రకాశంబుగా వెలుఁగ
వలశినది 170

సీ॥ దానితో మాసొత్తు। ధరణిలో। లక్ష్మితో
సాటిలేనట్టుల। సాగుచుండు
అదియె నాదగు। మదియందున నిలచెడి
యలరహాస్యంబుగా- లలననెరుగు

అనగను మాధవి యతివేగ కౌగలి
విడివడి, కోవలు వేగగాంచి
ఆవెల్గు వెలుగంగ- మావెల్గు నార్పుట
ధన దాహమని- నేను తలచుచుంటి

గీ॥ ధనమె కావలెననగ, నాధనమె గొనుము
ననగ కోవలు కామాట, యశనివోలె
హృదయమందున నాటంగ నతడు నమిత
కోపమందియు యభిమాన భావమంత 171

వ॥ పెరుగ మేడయంతయు మార్రోమ్రగునట్లు, మాధవీయని
కేకవైచి- 172

గీ॥ చేత ఖడ్గంబులాగంగ చేడెతాను
మదిని నూహింపలేని, యాపదయురాగ
బెదరి, గజ గజ లాడుచు, వేగముగను
ప్రక్కకుంతప్పుకొనెనామె, భయముతోడ 173

కం॥ గడగడ వణకెడు మాధవి
గడువడి, గనుగొనుచునుండ, గాంచెనునతడున్
వడితన కోపము తరుగగ
నుడివెను ప్రేమించుటన్న, నూహాయె నుండన్ 174

ఉ॥ దేవికి, లొంగనట్టిది, దిట్టతనంబును గల్గి, నేనునున్
మానిని, ప్రేమయున్న, పరమార్థము నామదినిండియుండెగా
కానిచో, నీదుజీవితము, గొంతుననంతము నంచునాడుచున్
బూనియుదర్పమున్నతడు, పొందియునెమ్మదినిట్లునాడెతాన్
175

వ॥ నగరహార, మధుర, శూర్పరఖ. బార్బరిక ద్వీపంబులే
యెల్లలై నిలుచునట్లు. పేర్గాంచిన కుబేర సమానులైనకోటీ
శ్వరుల పాదాక్రాంతులజేసుకొన్న మాసాత్తు, వంశాంకురం
బును, యేవారకాంతయైన, యిట్టిమాటలాడి, ప్రాణంబులతో
నిలచియుండుట యసాధ్యంబుగదా 176

ఆ॥ వె॥ క్రోధమెంతయున్న, గూడిన ప్రేమయు
నదియెమించు, నంచు, ననుచునతడు
కరమునందు నుండు, ఖడ్గంబు విడిచియు
గూరుచుచుండె నందు కోవలుండు 177

కం॥ ఎప్పుడు జూడని కోపము
నెప్పుడు నూహించలేని, దిట్టిదిగనియున్
అప్పుడతి గర్వమంతయు
నప్పుడెహరియించ, భోగకాంతయునంమెన్ 178

గీ॥ కోవలుని ప్రేమతోఁగొల్చు। కోమలాంగి
మేలుకొని వేగపరువెత్తి। మేదినినట
కోవలుని పాదముల్పట్టి। గూరుచుండె
కరములనుచుట్టి స్పర్శచే। కరము కలఁగి 179

కం॥ కన్నుల నీరును నిండగ
యన్నెలతయు। నెంతప్రేమ యందిన వేశ్యన్
ఎన్నడు నమ్మదులోకము
నెన్నగకులటనెడుపేరు। నిలనొందుకతన్ 180

గీ॥ ఓమహాశ్రేష్ఠి యూబ్రతుకుండియేమి
పోవదేమగునంచును। పోయివేగ
చత్తునంచును బరువెత్తి చానఖడ్గ
మందునున్నట్టి దానినిత్యుందుకొనగ 181

సీ॥ వేగమే యేగియు। వేశ్యహస్తంబున
నున్న ఖడ్గంబును- నూడబెరికి
కౌగలిజేర్చియు- కుటిల కుంతలనేను
నీదుప్రేమనునిందు- నిక్కముగను

నమ్మచుంటిని। ప్రేమయిమ్మ హిస్థిరముగ
నుండునంచసుమాట- మింటిసాక్షి
ఇచ్చుచుంటిని నీకు- నిలలోన వంశపు
కీర్తికిమచ్చయు- గూర్చలేను

గీ.। అదియు మాత్రము నొప్పను। ననగయామె
నద్దినేను సుసహియింప స్వామియనుచు
నాకళంక బు బాపెడి। యర్కనెట్లు
మలినపరుతును నంచును। మాధవి యని 182

సీ.।। చేతులు కంఠాన- జేర్చియు కౌగలి
బిగియించి మాధవి- వేగపల్కె
మాసాయివ్రశ్రేష్ఠి- మహనీయ పుత్రిక
యామెను పెండ్లాడి- యమితమైన
అతనిమైశ్వర్యమంతయు గూడంగ
మాసొత్తు సుతునకే- మహనీతగును
మీదువంశపు కీర్తి- మిన్నంటియుండుట
కంటెగోరెడిదేమి- కలదుగావి

ఆ।వె। నేనుపతితనంచు। నిక్కంపు ప్రీతితో
ప్రేమదానమింత- పీడకుండ
గైకొనుడనిబల్కి- కాంతయుజాలితో
గూడుజూపు జూచె- కోవలునట 183

శా॥ ఆచూపున్గని। జాలమత్తు। గొనియు। న్నాతండు జేసాచియున్
ఆచాన్భగియూర కౌగిలినిజేర్చన్నామె యాకౌగలిన్
తాచేతన్మెలమెల్లగా పెదవులందన్ముద్దుల న్నింపుచున్
ఆచెంతన్గనుపించు మద్యమును।తానందనోవ్వుచున్నెచ్చెలిన్
184

ఆ।వె॥ పిలువనతడు నామె- పిలవకుండగజేసి
నీదుప్రేమదాన మిందుగొనగ
భిక్షకుండనౌచు- పీడకనిత్యంబు
నీదుముందు నిలుతు- నేనునెపుడు 185

ఆ।వె। మద్యపాత్రనింపు- మాధవి పలుకగ
బదులుపలుక తలనుపైకినెత్త
అంతలోన నటకు। నామెకు నెచ్చెలి
నాగరత్నవచ్చి నాతికోర్కె 186

గీ॥ తెలిసి వివిధంపు రుచ్యంపులలమి కొనిన
మధుర భక్ష్యంబులెన్నియో వదలకుండ
అందునుంచియు। నొకక్షణ మందునిలచి
వెడలిపోయెను। నెచ్చెలి వీడియామె 187

వ॥ అంతనాగరత్న వెడలిపోవ। పేడిసిట్టూర్పునిగుడించుచు
మెల్లన కోవలుని వైపునకు తిరిగి. మద్యపాత్రంజరిపి.
యింకెన్ని రోజులు నాసముఖంబున నిలచియుందువు భిక్షూ
యని ప్రశ్నించె 188

సీ॥ సప్తమీతిథినాడు। సంఘంబు ధర్మంబు
నన్నియునేకమై। నాదు దేవు
నాదుగుండెలనుండి। వాదుగవె। కలించి
వేరొకహృదయాన। విడకనుండు
నట్లుగగూర్తురు। నసహాయ నొచును
ప్రేమించినందుకు। ప్రేమమయుని
నావాడటంచని। నేభయంబున బిక్క
లేకుండపోదును। నాకుహక్కు

గీ॥ ఏలలేకుండ బోయెనో। యేను స్త్రీని
కానొకో వేశ్యనై యుండ। కాంతకున్న
గుణమునొందంగ రాదొకో। కోరినట్టి
రూపమందియు, విధిచేత। నీపగిదిని 188

వ॥ వంచింప బడితినని పల్కుచుండ కన్నులశ్రుసిక్తంబు
లయ్యెనంత 189

ఉ॥ ఏలభయంబు నీకు। మది యీభయమంత నిరర్థకంబునౌ
ఏలపరిత్యజింతునిను। నెప్పుడు నీకనుకూలవర్తినై
బేలచరింతునన్న విని। వీడకనుందువు దొంగ సొత్తునాన్
చాలగ కన్నగీపతి। నిజాయితి మాధవి దోచెనంచనన్ 191

మ॥ అలవైవాహిక బంధనంబునను। ధర్మంబింతయు స్వీదకన్
మెలగన్పూజును పట్టిదట్టమగుచు న్మేలున్ధర్మపాశంబుతో
చెలగున్కన్నగి సర్వజీవితసిధిన్చేబూనె తాటల్మితో
కలనెన్నంఘుమధర్మమున్ననుచు। వక్కాణింపరే లోకులున్
192

ఆ॥వె॥ ఆమెహక్కుతాను- నవలీలగైకొని
పోయెనంచు బలుకు- పుడమియందు
అనగకోవలుందు- వినియును। నియ్యది
స్వీకరించమేలు- నీకునాథ 193

కం॥ ఇది నీనాయిష్టంటని
పదరగ. మనతోడకాదు, వరలెడు సంఘం
బదియేర్పరిచిన నియమము
వదలగ వీలెట్లునౌను- బాగుగవినుమా- 194

వ॥ అననామాధవి దేనివలన సమంజసంబు కాదన 195

కం॥ సంతానము కొఱకేగద
యింతీయన నాదువలన, యేర్పడు సుతుడున్
అంతేగదయన, నీసుతు
కాంతాకులకాంత పతిగగనునెటు చెపుమా? 196

గీ॥ కఠిన సత్యంబునిదియంచు, కరమువణుక
వెల్లబోయెను ముఖమంత- వేగముగను
సాంత్వనంబంధి, నవ్వియు- సాటివారి
వోలెపుట్టి, యంగముల్- పున్నవల్లె 197

కం॥ కులసతి కుండెడియధికము
తొలగించిరి ప్రేమకిచ్చు- తోరపుఫలమున్
అలఘుడ కామంబనిధర
పిలతురనిది కాదె ఫలము ప్రేమంబునకున్ 198

కం॥ అది యన్యాయంబనగా
యది తొలగింపంగనాకు, నగునే చెపుమా?
మది వెలిగెడి నీజ్యోతిని
వదిలింపగ నేరితరము, పల్లవపాణీ 199

కం॥ కోవలు నావేశంబును
నావనితయు జూచుచుండ నాతడు నామెన్
వే వేగమ తానెత్తగ
కోవలుడటు జూడ, యామెగూడక దానిన్ 200

ఆ॥వె॥ మీమిమాటనేను- కాదనకుండగ
విశ్వసింపదగునె- పీడకుండ
అనగమద్యపాన- ఘనమత్తుడాతడు
నామె కౌగలించి, యనియెనిట్లు 201

ఉ॥ నాదగు ప్రేమకున్నిచట, నమ్మకమూనెడునట్లు నేను, నీ
కేదగురీతి చేయదగు, నిట్టిదికార్యము, నీవుపంచినన్
కాదనకుండ జేతునిక, కామినిపన్నుము, సాహసంబునన్
నీదరి నేనుగూర్చిమది, నీకునుసంతసమంత గూర్చెదన్
202

కం॥ అనవిని దూరము జరిగియు
కనులను మెరుపదియు వెల్గ। కామినితానున్
కనుచునుకోవలు క్షణమటు
యనెనీ సాహసముజేయ। నగునేనీకున్ 203

కం॥ ఎందుకు నీకాలస్యము
పొందకు సంశయమునీవు। పూర్తిగనన్నున్
పొందిన లక్ష్మికి లోబడి
యందినదేదైనకాని। యడిగిననిత్తున్ 204

గీ॥ కోరుచున్నాను। తప్పకు। కోర్కెనాది
గలదు। తీర్చుము। తొలినాడు గలుగురేయి
నాకు వలయును। కన్నగి। నీకునాకు
తగినపరిచర్య జేసెదు। తథ్యమయిన 205

గీ॥ నిదురవోయెడి. వానిదౌనెదను పదను
బాకుగ్రుమ్మంగ బెదరియు। వేగమెటుల
అదిరిపడునట్లు। నతడును। నదటిపడియు
ద్రిమ్మెరంబోయి జూచెను। నమ్మకుండ 206

గీ॥ కొంతవడిదేరి కోపంబు। గూడుబాధ
యతని మనసది। విలవిలలాడిపోయె
ఏమిపల్కితి। కన్నగి। యిందునిచట
నీదుదరినుండుటా। యనె। నిలువలేక 207

చం॥ అనవిని। కన్నమంచునట। నావిడలేచియు। నేమిశ్రేష్ఠి। నా
మనమున।ప్రేమజ్యోతినిట।మాయకవెల్గునటంచు।పల్కితే
గనబడె। చిన్న లికిట। గ్రక్కునయారెనె। వెళ్ళవచ్చు। నీ
వును। నిక ప్రేమగీమయని। వూదరపెట్టకు నెందువేనియన్ 208

కం॥ అనియని। విసురుగలేచిన
గనిమాధవి యెంత। విసుకు। గలుగగతానుజా
గొనెబాహుల కౌగలిలో
వినునాప్రాణమవునీవు। వీడకజేతున్ 209

శా॥ కామాగ్నిన్నపుడిగాలగా। కనుటు। నక్రోమంబునన్నెగ్రనై
ఏమాటన్నటనాడగూడదొ। నదేయీరీతి వ్రాక్రుచ్చె। నే
నీమాటన్తొలినాటిరేయి। వినుమా। నేతెత్తుమావంశపుం
నామాలక్ష్మిని। కన్నగీసతిని। నీపాదాలనేజూడగా 210

కం॥ అనవినియా నందంబున
వినగానిది, గర్వమెంతొ, వేగమెగొనగా
నని, యెనలేనానందము
గొననట, నాలేమజేసె, కోవలునకటన్ 211

సీ॥ కన్నగీపై వాహ- కారణంబుననట
నృత్యోత్సవంబును- నెనయజేయ
మాధవిగలదంచు- మాసాయి శ్రేష్ఠియు
మన్నించి పిలిపించె- మాధవినట
తాంబూలమంపించి- తగునని ముత్యాల
హారంబునిచ్చియు- నంపెనందు
పెరియయునడిగొని- వేగంబ మాధవి
యున్నచోటుకుజని, యన్నెలతుక

గీ॥ గాంచి ప్రశ్నంబుచేయంగ, మించినిన్ను
పిలువనంపెను శ్రేష్ఠియు, చెలువపొమ్మ
అన్నమాధవి యొప్పక యున్ననందు
నామె చేలమ్మ మాటతో, నందుజనియె 212

కం॥ దక్షిణ భారతమందున
యాక్షేపణలేనివాడు। వైశ్యులలోనన్
లక్షాధికారులెందరో
యాక్షణమున। దేశదేశమందలి వారల్ 213

వ॥ మహాశ్రేష్ఠులైన వారనేకులు వివాహంబున। కరుదెంచ
మహాజన వాటికల నామహాశ్రేష్ఠులకు। విడుదులు
విందులు। నత్యంత ఘనంబుగా యేర్పాటు గావించె 214

ఉ॥ ఆదినమందెమాధవియు।నందుననృత్యము।జేయునంచు।నిం
పాదిగనెల్లవారునట। వాడగ మాధవి కాదుపొమ్మనన్
వాదిడిచేలమాఖ్య। తనభావన। నాగురుదక్షిణంచు। సం
పాదనజేసెసమ్మతిని భావమునందున తృప్తిబూనగా 215

సీ.। సప్తమీతిధివేగ- సామీప్యమౌచుండ
కావేరి నగరంపు- ఘనచరిత్ర
స్వర్ణాక్షరంబుల- చక్కగలిఖియింప
తగునట్లు- మస్తాబు నగుచుండె

ఆమహాశ్రేష్ఠుల - యత్యంతవిభవంబు
వెలయుగ వీడ్కోలు - వెలయజేసి
దేశదేశంబుల - దివ్యంపు సంపన్న
వర్తకశ్రేష్ఠులు - వచ్చియుండ

ఆ॥వె॥ పట్టణంబునందు - వర్థిల్లువర్తకుల్
వాడవాడ - విపణి - వాడలంత
వస్తుజాలమెంతో - నిస్తులమౌచుండ
నిలిపిరందు - లెక్ఖకలవిగాక 216

కం॥ ముత్యపు చిప్పలతోడను
నత్యంతము, వందమొప్ప - నందలివారల్
నిత్యము వస్తువులెన్నియొ
స్తుత్యము నౌనట్లు, జేసెశోభిలుచుండన్ 217

వ॥ నానావిధ పరిమళద్రవ్యంబులతోడ, విపణివీధుల విక్ర
యించుచుండిరి 218

కం॥ కన్నగి కోవలు జంటయు
నెన్నగదగి నట్టిదనుచు - నెందరొ నందున్
వన్నెలుచిన్నెలు, గలుగగ
యన్నెలవునచెప్పుగొనిరి - యధికముగాగన్ 219

గీ॥ ఆలవివాహంబునందు। నత్యంతసుంద
రాంగిమాధవి నృత్యంబు। బాగజేయు
దాని। గాంచంగ నగువాకో। తప్పకుండ
గాంచవలె నంచు నెంచిరి। కాంక్షతోట 220

మ॥ ఘనవైవాహిక।లగ్నమందునను। చక్కన్మంత్రపూతంబునై
మనుచున్నుండగ। నగ్నిసాక్షిగా। భామారత్నమున్కోవలన్
మనుదంచున్మడివేసి రిద్దరికి। యామంత్రంపుసుధ్వానముల్
వినిపించెన్నలుదిక్కులందునను। సంప్రీతిన్గానన్నందరున్ 221

గీ॥ దేశదేశాలనుండియు। నాశతోడ
వచ్చియుండిరి। యతిథులు। నచ్చటకును
నృత్యసంరంభమందున నిపుణమతులు
వెంతయో యలంకృతి జేసిరందమొప్ప 222

వ॥ ఆమాధవి నృత్యోత్సవంబునకు ప్రత్యేకాహ్వానితయై వచ్చి
చేలమతనయా సనంబున। యధివసించె। మాధవి నృత్యం
బుగొనసాగదాని। గని- 223

సీ॥ నృత్యంబు జేయంగ- నత్యంతముదమును
నందియువారలు- మాధవియును
కావేరి నగరంబు- గర్వింప తగినట్టి
యందాలరాశిగ- యలరుచుండె
నృత్యంబె రూపుగా- సత్యంబుగానందె
యంచునునందరు- నందువాగడె
దంపతులిద్దరు- తగినట్టియాసన
ములయందు గూర్చుండె- యలఘుమతుల

గీ॥ కన్నగి కోమలచరణ- కాంతులంత
యవియు లోకోత్తరంబులై। యలరునట్టి
దివ్యకళ్యాణమంజీర। దీప్తులంత
యిబ్బడిగజేసె నంచును। నబ్బురపడె 224

మ॥ పదహారేండ్లు గతించిపోయెగద। నాభార్యారత్నమే పోయియున్
అదిగానేటికి। సౌధరాజికళతో। నందబులు న్వెల్గగా
తుదిదాకన్మణిమంజిర ధ్వనులు। నెంతో మోదముస్గూర్పగా
వదలన్లేకను। నుండుగాకయని। యెన్మాసాత్తువాన్శ్రేష్ఠియున్
225

మ॥ మణిమంజీరఝుణంఝుణధ్వనులతో। మార్మ్రోగె మాసాత్తుదా
ఘనసౌధంబు దిగంతరంబులను। వెల్గద్దివ్య మాణిక్య। సం
జనితాబంధుర। కాంతిపుంజములతో। సత్పీలయా కన్నగి
వనితారత్న చరిత్ర ధాత్రిస్థిరమై వర్థిల్లగానందునన్ 226

గీ॥ ఏడుతరముల నుండియు। నింతవరకు
గడపదాటి యెరుంగదు। పుడమియందు
వృద్ధిచెందుచునుండెను। విడువకుండ
కోశమంమెన సంపద। కోరినట్లు 227

ఆ।వె। కష్టకాలమందు- కలగిన వ్యాపార
భారమందు నవుడు భార్యయొప్ప
ఋణముగాను నందు- గొనుటయు నొప్పగు
నదియె మనకు తగినయట్టి విధము 228

ఆ।వె। అప్పగించియన్ని। యధికారముల। మాదు
గృహమునెపుడు విడక। గూడియుండి
నిలచియుండునట్లు। నీవును చేయంగ
వలయునంచు బలికె। యలఘుడపుడు 229

కం॥ అని యాశీస్సులనిచ్చియు
చనియెను మాసాత్త్రశ్రేష్ఠి। చక్కగ క్రతువుల్
ఘనదానంబులు పూజలు
ననవరతంబందు- నిచ్చిరందరు వొగడన్ 230

సీ॥ తొలినాటిరేయిని- తోయజాక్షిని చెలుల్
సరససల్లాపము లాడుచుండ
పన్నీటస్నానంబు- బాగుగజేయించి
యగరుధూపంబుల నందువేసి
కురులంత యందంబు- గూడంగచెలులటు
దీర్చిదిద్దియు వారునేర్పుగాను
శృంగారరీతులు- పొంగారనెజ్జను
ప్రియసఖి దేవంతి- ప్రీతితోడ

గీ॥ పట్టుపరుపుల బాలీసు। పట్టుదిండ్లు
తోడసిద్ధంబు జేసెను- నాడెమొప్ప
కన్నగీసతి తోడ్కొని। కన్నెలంత
ద్వారదేశంబునందున। వచ్చినిలచి 231

కం॥ గుసగుసలాడుచు చెవులను
పసగలిగిన మాటలాడు; పడుచులలోనన్
వెసదేవతిగని కన్నగి
యసమానము నొచు, నిట్లుననియెను తానున్ 232

గీ॥ నాదుకుడికన్ను యదిరెను నాకునేడు
నంచు భ్రాంతపు చిత్తంబు; నందివలుక
కౌగలించియు కన్నగి; గూడుహితవు
క్రొత్తగావున యదటిది; గూడియుండె 233

వం॥ తలుపులు తీసిమెల్లగను; తన్వివి కన్నగిలోన నెట్టియున్
తలుపులుమూయదేవతియు, తానును బూనుయపూర్వశోభలన్
వెలెగెడు; రత్నభూషలను; పీఠనికాంతియు వేగపర్వియున్
వెలుపలజేరెమున్నగను; వేగమువందన మాచరింపగా 224

గీ॥ సిగ్గుభయమును మదిలోన; జేరుగొనగ
మొగ్గవోలెను ముడుచుక; ముదితయందు
నిలువబడియున్న యామెను; నీటుగాను
వేగవచ్చియు లేచియు- భీతహరిణి 235

గీ॥ వోలెయున్నట్టియా మెను। జాలిలేక
జేరరాగను। కుడికమ్న। జేరుకీడ
టంచునదిరెను। కోవలుడంతమీద
హస్తమునుబట్టి యెవరునీవంచు నడిగె 236

చం॥ పరుషపుమాటలాడు। తనభర్తను కన్నగిగాంచి। యెన్నడున్
ఎరుగని యట్టిమాటలను। యీగతిబల్కగ, భ్రాంతచిత్తయై
సురిగిన రీతినిల్చె। తనశోభన మందిర ద్వారదేశమం
దరవిడినట్టి। మొగ్గగతి। నామెనుగాంచియు నిష్ఠురంబుగా237

గీ॥ మఱలియీరీతి బల్కెను। మఱచివావె
యెవరునీవంచు నడుగగ। యేమినాకు
బదులు చెప్పపటుంచును। భయముగదుర
బల్కెకోవలుండనునట। భార్యమంచు 238

ఉ॥ ఏమనిబల్కుదాన। యిదియేమిటి యీగతిపృచ్ఛజేసెడిన్
ఏమును ప్రీతినే। మదిని। యెంతొయెరుంగుదు। లక్ష్మిగూడినే
నామదిమాయమర్మములు। నంటవు। నేమనిజెప్పనౌను। నం
బామహికన్నగీసతియు నాదగమాటలు రాకయున్నచో239

గీ॥ బదులువలుకవు। యెవరవో। పలుకుమీవు
యనుచుగర్జింప। గదియంతనలము కొనియె
ఇక తప్పదటంచును నింతితాను
నిశ్చయించియు। నీరీతి- నిజమువల్కె 240

కం॥ వణకెడు కరములతోడను
జనిపతిపాదములపట్టి। సతియిటులనియెన్
అనఘా నీపదదాసిని
యన। నౌ। వినదలచుమాట యదియేయనియెన్ 241

చం॥ పురుషుడు। భార్యరూపమున।పొందెడునాతిని।దాసిగాగనున్
అరసిననెచ్చటైన। వెలయాలిని। ద్రవ్యమునిచ్చివీధినిన్
వరలెడు దానినిన్గొనెడు।భార్యనుసీగతి దాసిరీతిగా
ధరలొలికించి। తెచ్చుటది। దాపరికంబునులేని మాటయే 242

కం॥ ఎఱిగితి వేయనియనియును
మఱిపలుకవదేమియన్న। మాటయులేకన్
వరలగకుడి కన్నుటులను
వరుసగ నదురుచునునుండె। బాయకనామెన్ 243

కం॥ పుట్టుకనుండి యునామెను
పట్టుకయున్నట్టి గౌరవంబును, మఱియున్
గట్టిది యభిమానంబును
నెట్టుకగొట్టు కొనిపోయె, నింతయులేకన్ 244

కం॥ మాసాయిశ్రేష్ఠి పుత్రిని
యీసమయము నందుకాదు, నిప్పుడునేనున్
ఈసరికోవలు దాసిని
గాసరిబోల్చుకొనుచు సతి, కరమటులపల్కెన్ 245

ఆ, వె, తలయువంచియామె- తనపరిస్థితికంత
సహజశాంత స్వరము- సమకురంగ
ఔనుతెలుసుకొంటి- యంచునుపల్కెను
నదరుచుండె- కన్నువదలకుండ 246

గీ॥ తనయహంకారపూరిత దర్పమునను
కన్నగిసతియవమాన- కలితగాగ
చేయ, రూపసినంచును, చిత్తమందు
తలచుచుండె నటంచును, తలచిపలికె 247

కం॥ నీదగు నందమునామది
కాదగు విలువదియు, గ్రుడ్డిగవ్వకు సరియౌ
కాదనకుండగ యెఱుగుము
నీదరియునిబల్కె-తాను, నిక్క-పు పలుకుల్ 248

గీ॥ ఔనునెఱిగితి ననిబల్కె-, నువిదతోడ
నాదువెనునంటి నీవును, నాదువెంట
రమ్మనితరులకెవ్వరి, కిమ్మహినిట
యెరుగరాదంచు, నానతియిచ్చివేగ 249

ఆ,వె, ఆమెయనుసరించ- యాకోవలసిమార్గ
మతడుగోపనంపు- మార్గమూని
చిత్రశాలదాటి- జేరెప్రకోష్ఠంబు
కన్నగిసతిచేయి మున్నెనట్టి 250

కం॥ బలమున యీడ్చుచుబోవగా
చెలియటు, బరువెత్తెవిడక, శీఘ్రమతానున్
గలుగగ శూన్యమనంబది
తొలగకజనె ధర్మ్మ మార్గతోయము వెంటన్ 251

ఆ. వె. ఝాముప్రొద్దుపోయె- జవ్వనిమాధవి
కోవలుండువచ్చు- త్రోవకొరకు
తల్లితోడగూడి- తానునుజూచుచు
నుండె వనమునందు- నువిదవిడక 252

ఆ. వె. తానుజూచుపథము- గానుపించెను, శూన్య
మగుచు, ఝాము, ఝాము- నట్లెగడిచె
ఆకుగదలయామె- యటుజూచుచుండెను
తనదుకోర్కెదీరు- ననుచునందు 253

ఉ॥ సేవకుడందు ఘంటలను, చేతితొరెండునుగొట్టి, నవ్వియున్
భావమునందు మాధవికి, పట్టునగుండెల కొట్టినట్లుగా
కోవలుడందు, మాటనటగూడగ రానటుతోచి, మద్యమున్
అవనియందు త్రాగియును, నామెయునీడిచిగొట్టె, గిన్నెనున్
254

కం॥ తనచెలిపాటను జూచియు
గొనివీణను, దానిమీద, గూరిచిపాటన్
వినుమని పాడినగనియటు
గొనికోపము నాపుమంచు, కోవలుడియరచెన్ 255

గీ॥ ఆపువీణెను। విరచియు। నవలవేయు
దిక్కుమాలిన యందెల। నిక్కువముగ
పాఱవేయుము। కావేరిపట్టణమున
యలఘు మంజీరములకీర్తి। యట్లకొనియె 256

కం॥ చిరబురలాడుచు మాధవి
కరముల బాలీసుదిండ్లు। కరుకుగ విసరెన్
పెరిన్నాయకి వచ్చిన
యరసియు భయమదియులేక ననియెను నిటులన్ 257

కం॥ వెలయాంధ్రుడు నందరొక్కట
నిలిచియు స్తోత్రములుజేయ। నిక్కముగాగన్
గలుగవె సతులకు మహిమలు
నిలకోవలుడును। మగటిమి। యేద్చినవాడే 258

కం॥ అనియని యేడ్చుచునుండగ
గని। చెలులను సైగజేసె। గనపడకుండన్
జనుదని మాధవి జేరియు
తనకరముల। నిముడుచుండె। తల్లియునామెన్ 259

గీ. నన్నుపార్థంబు గైకొంటి, మున్ను నేను
యాశలన్నియు పెంపొందవలదటంచు
ఇన్నిబాధలు, నెత్తిన, యిట్టికొనుట
వద్దటంచును చెప్పితి, సద్దెత్రోచి 260

గీ॥ అలకులీనుడు రసికుడు నైనగాని
యతనిభార్య కురూపియై, యలరుచున్న
జారతనమున, యిటువంటి, సంకటముల
భార్యగౌరవమందగ, వర్తిలుగద 261

ఆ।వె। ఆమెమాటవినియు- నామాధవియు పండ్లు
పటపటయనునట్లు- నటనుకొరికి
అట్టివిలువ నేను- యిట్టినాశంబును
నొందజేతునంచు- నందుబలికె 262

గీ॥ పిచ్చిదానివినీవును, వేశ్యయనుచు
సతియటంగని లోకాన, జరుగుచుండె
ఎట్లువుట్టితి మాయల్లె, యిలను నడువ
వలెను, గోడలందునచావ, వలెనువారు 263

కం॥ కులసతియే కాంతంబున
నిలచియు కాలుచునుండు, నిక్కము మనముచ్
నిలచియు సభలో గాలగ
వలయును, విధిసత్యమమ్మ, వలదిక నలతల్ 264

గీ॥ అనుచు మాధవి తల్లియు ననునయింప
నాయహంకృతి, చల్లారకంత కంత
పెరుగచుండగ, నింతలో, పరుగుతోడ
వచ్చెచెలికత్తె, రొప్పుచు వైనమంత 265

వ॥ ఈరీతి వివరించె- 266

కం॥ కోవలు రథమటు వచ్చియు
యావని, సంకేతపథము, నంటియు నుండెన్
ఆవెలది కన్నగిసతి
కోవలు ప్రక్కగనె, యుండె, గూర్చొనియనియెన్ 267

కం॥ జలజలరాలెను, కనులను
గలిగిన యునందజలము, కట్టలు ద్రెంచెన్
మెలెగెడి యుల్లాసంబది
గలిగియు ముల్లోకములను, కరమటు గెలువన్ 268

వ॥ గలిగిన మానసోల్లాసంబునందె, స్వాగతంబిచ్చుటకై పోవు మాధవిని పెరియనాయకి చేయిఁపట్టినాపి యీరీతిఖలికె 269

కం॥ తప్పులుజేయుట సహజము
తప్పులుసరిజేసి కొఁసిన, దానవెగొప్పొ
అప్పుడతి కన్నగీసతి
గొప్పది, యవమానమీవు, గూర్చకునిందున్ 270

గీ॥ తల్లిమాటలు చెవిదాక, దాకలేదు
వారిమార్గంబు, జూచుచు, వనితయుండె
ఆఁ ప్రవోష్ఠంబునందున, నాగరత్న
పల్కుతిటులను- విన్పించె- బాగుగాను 271

వ॥ నాకు ముత్యాలహారంబు, కొన్కగా రావలె, యనుపల్కు, నాగరత్న ను, నవ్వుచు, నీకు నాలాగే, శంఖరత్నమాలనొ నంగెదననిపల్కె- 272

కం॥ నవ్వుచు కోవలుడప్పుడు
నవ్వనితయు, తోడునుండ, మాధవియెదుటన్
నవ్వనిలచిన పెరియయు
చివ్వననట, రత్నగాంచి, శీఘ్రమవలికెన్ 273

గీ.వె. నిలువు గ్రుడ్లతోడ - నిలుచుంటి వేమిటి
గిరిజశర్వుగూడి - వరుస నిలచె
అనుచు వచ్చి పెరియ యాకన్నగీసతి
పాదములనుతాకి - బలికెనిట్లు 274

కం॥ నీవును సాక్షాత్సతివిట
నీవేదను, నిట్టిగృహము - లేవటనుతల్లీ
నీవిటనిలచియునుంటివి
నీవిటురానేలయనుచు, నెన్నియొవల్కెన్ 275

గీ॥ స్పృహాయుపీడియు, మాధవిజేరినట్టి
కోవలుని నేత్రములవంక గూర్మిమీర
జూచుచుండెను, నిల్చుండి, చోద్యముగను
మాటరాకయు నొక్కింత మాధవియును, 276

వ॥ ఆమెకన్నుల మత్తునత్యధికంబయి. యొప్పుచుండె 277

కం॥ పున్నమినాడును, జలనిధి
యెన్నలవున. పొంగి, వారు, నెలతకు కనులన్
వన్నెలు కాంతులు జిమ్మచు
వున్నను, కోవలుడుగూడ, జూచుచుండెన్ 278

శా॥ ఎన్నోసార్లటు। మాధవిన్గనిన। తానేవిస్మయావిష్టుడై
మున్నెన్నండును। గానరాని। రసరూపు। న్వైభవంబామెలో
కన్నారంగని। బాహ్యదేశమున। వేగన్తానుగా మర్చియుఁ
తన్నేప్రాణసమంబుగా. తలచుకొంతన్తానగా తల్చుచున్ 279

గీ కొంతసేపటు నిల్చియు। నంతలోన
తెలివినొందియు। నిద్దరు। వెలుగునిండు
కోవలునికండ్లు। విజయంబు। గూడెనంచు
మాధవిని గాంచి। నీరీతి మాటలాడె 280

కం॥ నీకొరకిటు దాసిని। నే
నేకొనితెచ్చినాడ। గాంచుమీవును ననినన్
ఆకన్నగి సహానముగొని
తాకదలక నిశ్చలంబు। దాల్చియునుండెన్ 281

గీ॥ పెరియనాయకి। కోవలు। వరుసజూచి
తప్పు తప్పటు। మాట్లాడతగదటంచు
నవ్వులాటకునైనను। నవ్వయిట్లు
నామహాశ్రేష్ఠి కోడలు। నాదిలక్ష్మి 282

కం॥ ఆమెతో మేమెటు। సరియగు
నామాటలు తగదటంచు। నామెయు వేగన్
నేమంబని నాణెంబుల
యామహి। దిష్టియును। తీసి। యంతట దాసిన్ 283

గీ॥ వేగమేపిల్చి। బంగారువిలువపీట
గొనియురమ్మంచు జెప్పంగ। గొనకనద్ది
మాధవియు। నాగరత్నను। కాదటంచు
నిలిపియిట్లని బల్కెను। వెలదితోడ 284

చం॥ నిలువుము। కాలికిగజ్జలదు।నీవును తెమ్మిటు!శీఘ్రమేయనన్
చెలియట తెచ్చియివ్వగను। చేడియకన్నగి జేరి। నీవునున్
గలుగువివాహకాలమునగాంచితినాప్రియుప్రక్కగూర్చొనన్
చెలగెడి నాదునృత్యమటు। జేరగసంతసమంత జూచితే 285

చం॥ ఇలనిటగజ్జకట్టియును। నిప్పుడునృత్యము నేయగావలెన్
కులుకుచు నేనునాప్రియుడు।గూర్చొని ప్రక్కలజూచుచుండగా
చెలియిటులాడ।తల్లియగు।చేడియ.మానసమందునెద్దియున్
మెలగుచునుండె। నద్దియటు। పేర్కొనజూచి భయంబుజెందియున్
286

గీ॥ కోవలుని జూచిభయమున త్రోవమార్చి
మాధవినిగాంచి చేయెత్తి। మానినియట
నంగనాచివి। వేషాలనంగయిన్ని
నేర్చినావీవు। యంచనెయింతియామె 287

ఆ।వె। చేయివట్టిలాగి। శ్రేష్ఠిమహాస్నుష
హాస్యమాటనేల యనుచువలుక
హాస్యమేలనమ్మ। బాడెదనేనును
నిజము వలుకుచుంటి। నేనునిప్పుడు 288

గీ॥ బూజువట్టిన నియమంపు। పోకదలను
లోకమంతయు చాటంగ। నేకమగుచు
నుండ। నాప్రియుతానును। గూడియన్ని
గొనగ యత్నించుచుసిమెకు। గనగయిందు 289

కం॥ నాకంటె మిన్నయేమిట
యీకులనాతులకు। నున్న। పీఠితిలోనన్
ఈకన్నుల జూడంగను
నేకోరితినంచువలుక। యీమాటలతో 290

గీ॥ పెరియనాయకి గుండెయే. విఱిగిపోయె
యే,మిపని। ముదనష్టపు; యిట్టిపనిని
చేయరాదన। చాలింక. చేయకున్న
చేతగానట్టి దానవు. చేతగాని 291

గీ॥ యట్లపడియుండు। నా వేళమంతయుడుగ
యేమి తెలియును। నీకును నేమి తెలియు
నంచువల్కెయు. మాధవి। ననియె మరల
నాగరత్నను గాంచియు! నాతివేగ. 292

కం॥ తత్తరలాడెద వేమిట
నిత్తరియన నాగరత్న। యేమియు పలుకన్
చిత్తము నొప్పక యున్నను
బిత్తర గజ్జలనునాడె- భీతితొవణకన్ 293

గీ॥ పెరియనాయకి, మాన్పరిది। తిరుగలేక
నాల్కపిడుచయు గట్టంగ। నాతియుండె
కోపలుండును, మౌనంబు। గూడిప్రక్క
బవ్వళింబియు నుండెను। బాగవించు 294

గీ॥ గజ్జలూనియు రత్నయు- కన్నగికిని
మాధవికి మధ్య నిల్చియు- మాటరాక
నిలువబడి యుండ। మాధవి నిలువలేక
గజ్జెలన్లాగి కొనియును కఠినమాగను. 295

సీ॥ క్రొత్త కోడలవీవు- కోరిక నాయది
తీరంగ గజ్జలు- తీర్చికట్టు
మంచును నాడెడు- మాధవి మాటలు
కోవలుండును వించు- గూడియుండు
మద్యంబు త్రావంగ- మదినింపు కోర్కెయు
నాగరత్ననుజూచి నాజ్ఞజేసె
కన్నగిమౌనంబు- గాంచగ మాధవి
కదలు పతివ్రత। గజ్జగట్ట

గీ। వేమి। కదలక మెదలక। యుట్టియుండి
మదిని సందేహమూనియు। వదలకిట్లు
ఉటింవేయని। పలుకంగ। యువిదమాట
వినియు కన్నగీసతియిట్లు। యనియెనందు 296

కం॥ తలయెత్తి మాధవిన్గనె
మెలగెడి సౌజన్యమంత- మిన్నగనుండన్
తలయును వంచెను గాంచియు
యిలసందేహమును నేమి। యెంచనుచెల్లీ 297

ఉ॥ శాంతసురూప మోయనగ। చల్లగనాడిన। కన్నగిసతీ
భ్రాంతవికార దూరమయి। వ్రాలినమాటలు। మందునిప్పునన్
శాంతజలంబుచల్లినటు। జాణమనంబున వచ్చిపడ్డ। నా
కాంతయు। సందియంబు గొనగా। నిటయేమియులేకయున్ననున్ 298

ఆ।వె। సందియంబునీవు- నందకయున్నను
జాగునేల్ల! నీకనంగనెంత
కన్నగిసతియట- కంఠంబు విప్పియు
పలికే దృఢముగాగ పలుకులంత 299

సీ॥ సోదరీ కళ్యాణ- శోభితమై యొప్పు
మంజీరములు నాకు మంగళమని
పతిదేవులిందున- పాదంబులనుజేర్చె
నీపాదముల కంధమే విధంబు

నందంగజేయును- నంచని కన్నగి
సతియును, శాంతంబు- చక్కదనరు
కళ్యాణమంజీర- కమనీయశబ్దంబు
మాధవిగుండెపై- మాటుపెట్టి

గీ॥ కొట్టువిలుకాని బాణంపు, పట్టువోలె
తాక, గర్వంబు కన్నుల తాకుచుండ
కోవలుని వైపుజూచియు, గూఢహాస్య
మిట్లు, మాధవి మాట్లాడె- యిట్టిగొనక 300

సీ॥ కమనీయ మంజీర- కళ్యాణమందంగ
నిటనుండు కులనాతు, లెంతోమంది
నీపట్ల యీర్ష్యయు- నెలకొనెనంచును
వినియుంటి, నిందున, వేగవినుము
నీదగుభర్తను- నీవానిగను జేయు
మంజీరములు- శక్తిమహిని లేదు
నాదగునందెలే, నాదరిజేర్చెడి
యంచని, మాధవి యనగవినియు

గీ॥ శాంతసహనంబు। అంతయు జారకుండ
కడుదృఢంబున। కన్నగీకాంత యిట్లు
పల్కె। నీదుయందెలపైన। చుల్కనైన
ద్వేషమింతయు। సోదరీ తెచ్చుకోను 301

కం॥ కన్నగిశాంత స్వరమట
మిన్నగు దృఢ మూనియుండె। మించగతానున్
ఎన్నడు చేయగలేనని
యన్నెల తమరింతగ్రుంగె। యాశ్చర్యమునన్ 302

వ॥ అంతమాధవి విసురుగ లేచి। కన్నగిసతి సమీపంబుగా
బోవుచు- 303

కం॥ ఉన్నత కులమని గర్వము
కొన్నావిట। హీనులమని। కొంచెపుబుద్ధిన్
ఎన్నగకాంచితి మమ్మను
నన్నను కన్నగియు నట్లు। నాడెనునందున్ 304

గీ॥ సోదరీ! హీనురాలని చూడలేదు
నీదుదోషంబు। నిందునయేమియుండె
ఈపరిస్థితులిట్టుల। యెలమిజేసె
శాంతగంభీర స్వరమున- చక్కవలుక 305

చం॥ అనియన, వేశ్యకాంతయట యంతయు వించునునోడిపోతినే
ననిు మనమందు బాధపడి నామెకునేగతి నన్నుజూపగా
గొను నధికారమెక్కడిది గూడెనదేమిటి వారికీవిధుల్
అనుకొని కన్నగీసతిని కంఠమువట్టియు పిండిజంపగా 306

గీ॥ కసియుపుట్టంగ పెద్దగాయబచియద్ది
కోపలునిగాంచి పల్కెను క్రోధమంత
పొంగ వింటివే ముద్దుల పొలతిమాట
నన్నునిందించు రీతిని॥ యన్ననతడు 307

గీ॥ మద్యపానంబు చేతనుమత్తుసగము
సగము స్పృహయును గలుగంగ సరిగనతడు
మద్యపాత్రను లాగుచు మాధవిగని
చూచుచున్నాడ చక్కగాచూచుచుంటి 308

కం॥ మణిసన్యాసము గొన రా
తిరి నిటులముహూర్తమిందు తెలగనిపుడున్
దరికిని వచ్చెనటంచని
పరికించుచునుంటి నేను భామిని యనగా 309

ఆ॥వె॥ అట్టి మాటవినియు। నా పెరియయునిట్లు
నననగరాదు రాదు- ననుచునామె
ముందుజరుగజూచి- ముదుసలిదానిని
గూరుచుండు మనుచు గోరిజూపె 3

కం॥ నీవును భయమది జెందకు
నీవనితలజూచుచుంటి। యిందుననేనున్
ఈవిధి శోభన రాత్రిని
నేవీక్షించుచునుంటి- యెవ్వరుగనెదిన్ 311

గీ॥ అలలునలలుగా నిండించి। యతడునవ్వి
చేతనుండిన మద్యంబు చేయిజారి
వస్త్రములమీద। వలుకంగ, వనితరత్న
యతనివస్త్రంబు పిండుచు నతివయున్న 312

ఆ॥వె॥ ఆమెమోముజూచు। నాతనిగనుగొని
మండిపడుచు నందు। మాధవియును
తల్లిమీదజూపె। తనదగు కోపంబు
నీవులేచివెళ్ళు। నిందునుండి 313

సీ॥ అని యన కోవలుం- డని యెనునీరీతి
మాధవి నిజమైన మాటవల్కె-
కోరికలెన్నియో- కొనసాగనీ రీతి
యౌవనబిగువులు- నుండుచోట
యౌవనంబది ఎంకి- యుండెడునీవిట
రసభంగమంతయు కొసకుజార్చ
తగునేయటంచును- తగుముందు జనునీవు
వని, నాగరత్నని గనియురమ్మ

గీ॥ నాదుప్రక్కను గూర్చుండి నాకు మద్య
మిచ్చుచుండుము. నేనును పుచ్చుకొనెద
దానకంతెను మద్యమే చాలమేలు
త్రాగియూగుటయే నాకు, తగినరీతి 314

కం॥ రా, నాగరత్న యొడికిన్
రానీ, మధుపాత్ర, నీవురమ్మిక యనుచున్
మానిని కౌగలి జేర్పగ
గానలేకద్ది వేశ్యగని కోపంబున్ 315

ఆ॥వె॥ ముద్దుగొనగదాసి- మూర్ఛిల్లినట్లయి
ప్రక్కపీటమీద- వరలుచున్న
ప్రమిదనెత్తి విసరె పడిచావు మంచును
శ్రేష్ఠినీవు యేమి చేయుచుంటి 316

ఆ॥వె॥ దాసిదానితోడ- తగువయ్యె నీరీతి
సరసమాడ నంచు- త్వరగబలుగ
అంతకోపమందు- ననియెనునీరీతి
నాదుమనసువచ్చు నటులనేను 317

గీ॥ చేయువాడను నీవును- చెంతజేరు
దాసివేగద. యిచ్చట॥ తగుదుననుచు
నన్నునాపని॥ యంతస్తు. మిన్నయంచు
యెత్తిపొడుచుట- తగునటే॥ యింతయైన 318

ఆ॥వె॥ నాగరత్న నేను- నాజ్ఞనునిచ్చితి
మాధవినిటతన్ని- మరలరాక
యుండునట్లు॥ గెంటు॥ యుండెదు వెలుపల
నంచు గర్జనంబు॥ నతడుజేయ 319

వం॥ వినుచున్ శ్రేష్ఠిమాటలను। వీనులమ్రాన్పడి। రాయివోలె। తా
గనుచును। నున్నకోవలుడు। గర్జనచేయుచులేచి మైకమున్
గొనుటను కన్నులెఱ్ఱవడ కోమలిరత్నను నొక్కచేతితో
గొనియును। మాధవిన్దరసె। గూడెమునిద్దియుగాంచిసుంతయున్ 320

గీ.। కన్నగీసతి। శాంతంబు। మున్నెరూపు
దాల్చినటులను। శాంతంబు దాల్చియామె
తలయువంచుక నిల్చుండె। లలనరత్న
పీడి। కోవలుండును। ముందు వేగవచ్చి 321

గీ॥ గర్వభూయిష్టయైయుండు। కాంతముందు
జేరికోవలుండును, నటశీఘ్రముగను
జూపుజూపుల జేర్చియు। చెంపపైన
తలయు తిరుగంగ కొట్టెను- తలముసాచి 322

కం॥ నాతో తులతూగెదనని
నీతలపున తలచినావె। నీకునుగర్వం
బే। తలకెక్కెను। దాసివి
ఛీ। తొలగుము। విపణియందు। జేరియు వెలకున్ 323

కం॥ అమ్ముడుబోయెడు వేశ్యవు
నిమ్మహి। నాతోసమంబు। నేగతి నీవున్
కామ్మాగొనెదగెదవునిలు
పొమ్మాదూరంబుగాగ పూర్తిగనింకన్ 324

ఆ।వె। దెబ్బతినియు। మదిని- యుబ్బిన యభిమాన
మెంతొజార। యేడ్పువందియామె
చెప్పబోవునట్టి। చేడెనుసవలకు
త్రోసిముందుకేగె। రోషమునను 325

ఉ॥ పోవుచు తాముహూర్తమటు। పుణ్యసతీమణి; కన్నగీముఖం
బే। వహియించు శాంతమును।నెంతయొ।సౌమ్యపురూపువోలె। నా
తావున నిల్చునాసతిని। తానునుగాంచి శిరంబు వంచియున్
ఆవనితా శిరోమణి సమంబుగ జేరియ పేక్షతోడసున్ 326

కం॥ ప్రక్కను జేరినవెంటనే
యక్కజమొనగూర్చ। యెండకారున బడియున్
దిక్కులు తెలియని। మవిషికి
దిక్కైచల్లనగునీడ- తీరియుచిక్కన్ 327

గీ॥ ఎంతహాయిని పొందునో, యంతహాయి
గొనియు కన్నగీసతిరూపు, కోవలుండు
ప్రథమ వీక్షణమును దీక్షబరపి యతడు
నిట్లు తలపోసె యెంతయో- వింతతోడ 328

కం॥ ఇంతటి సుందరమూర్తికి
యింతటి శాంతిస్వరూప మెనసిన దానిన్
ఇంతటి యపకారంబును
చెంతన్నేర్చితిని నేను; ఛీ యిది బ్రతుకా 329

గీ॥ సాధ్వి, తొలిరాత్రి, జేరంగ, చక్కరాగ
యిట్లుజేయంగ, బాధను నెంతగొనెనొ
కులట, పాపిష్ఠి వేశ్యకై, తలయుమునుగు
నాపదల జిక్కిపోతిని, యయ్యోదేవ 330

గీ॥ గాజుపెంకును గాంచియు మోజుతోడ
రత్నమ: యెంచి- యవివేక- యత్నమూని
మణిని తన్నితి, ఛీయని, మహితయశుడు
తనను తానటురోసెను, తనదు మదిని 331

గీ॥ మదిజుగుప్సయు నిండంగ మాన్యుడతడు
తిరిగి, చురుకుగ, మాధవి దరినిజేరి
నాగరత్న యొడినిబడి, రోగిరీతి
నున్న, దానిపై, కన్నిడి, యున్నతుండు 332

శా॥ ఏలాయీగతి, యిద్దియుజ్జరిగె, నేనీరీతి, యీ వేశ్యనున్
చాలన్నిట్టుల క్రుళ్ళికంపుగొను, నీచానన్మదిన్గోరియున్
నాలో ప్రేమయటంచు, రోగమదియున్నాకున్నిటన్వచ్చె, యిం
కేలా, నాపరువు ప్రతిష్ఠ, యిటులన్నీదేరె, యంచాతడున్
333

గీ॥ అని తలంచుచు, కన్నగి నతడుగాంచి
నన్నుక్షమియించు, కులలక్ష్మి, నిన్ను నిట్లు
ఈగతిని వేశ్యముందుకు. నేనుతెచ్చి
యింత యవమానమును జేసి, తింతవరకు 334

ఉ॥ ఏపతి యీగతిన్దరను, నిట్టియనర్థము తెచ్చియుండెనే
ఓపడతీ ముహూర్తమట, మున్నుగ నీగతి నేనుజూచినన్
ఈపగి దిన్నెను, న్కులట చెందకు జేర్చిమనంబు, నార్తినిన్
ఏపడయంగ జేసితిటు, యింతిరో యెంగిలికూడు తించునున్
335

గీ॥ బ్రతుకు విషనాగి యియ్యది। పటురయంబు
నీదు తొలిరాత్రి। యీగతి। యిట్టిదాని
అలయహంకృతి। బాల్పడ। నట్టెజేసి
నాడ। పదబోవుదము। క్షణమీద నేను 336

చం॥ అనియనికోవలుండునట ద్వారముదాటియు। కన్నగీసతిన్
గొనికరమందున। న్వెడల। గూడగశోకము। వేశ్యవేగమే
జనిబరువెత్తి। కోవలుని। చాయకుజేరగ। వేగమూనగా
గని। నిలువంగలేక। నట। కన్నగితూలిన యామెవట్టియున్ 337

గీ॥ తొలగుదూరంబు ముట్టక। తొలగిపొమ్మ
నన్నుదాకెడు యర్హ్మత। యున్నమున్మ
తొలగి పోయెను। కులటను। గొలచినేను
మూర్ఖుదనునైతి। లోకాన। మునిగిపోతి 338

ఉ॥ కూరుకుపోయెగొంతు। మరికొంచెముతాను పెకల్పలేకనున్
జేరియుతల్లి దగ్గరకు। చెంతనుసిల్వగ। కోవలుండునున్
కోరెనటన్స్వరన్వెరియ। గూడుమునిద్ది యుజ్ఞాపకంబుగా
చేరినయిత్తెయెవ్వరికి। చేదెతొనిన్ను మొసళ్ళ జేర్తునే 339

కం॥ అనియాజ్ఞాపించియునట
గొనికన్న గిజేయి, తేగ, గూడగనుదమున్
జనెత్వర, వరుడట, పురస్త్రీ
గొనె విధవత్వ, మయిన కులవధు వెందులి పథముల్ 340

వ॥ మణిమంజీర ధ్వనిత, సౌభాగ్య పథంబున, మందరి
మందరింబుగా మ్రోగె- 341

గీ॥ పెదవిదాటినదాటును. పెన్నయనుచు
విదులుపల్కెడి వాక్కులు! వదలనగునె
శోభనపురాత్రి జరిగిన, చోద్యమెల్ల
నగరమంతయు మార్మోగె, యగణతముగ 342

చం॥ తనసుతునిస్మరించి, మదితానును, నిట్టిదియూహయెందునన్
గొనకనునుండ, యిద్దివిని, గూడయసహ్యము, శ్రేష్ఠికోవలుం
డనయము, పొందినట్టి, ఘనమైన పొగడ్తల యెన్నొవీనులన్
వినియునునుంట, వైశ్యకుల, విశ్రుతఖ్యాతిని పెంపుచేయగా
343

చం॥ గనుగొనితృప్తుడై, పడతిగాంచియు పెండిలిజేసి, తోషమున్
గొనియునునుండునట్టితరి, గూడినయిట్టి యవాంతరంబునన్
మనమదితట్టుకొంచు ధరమాన్యుడు నిల్వగలేక, కోవలున్
గొనకను కన్నగిన్తనకు గూడినబాధను, చెప్పబోకనే 344

వ॥ తనయందునత్యంత గౌరవంబున ప్రవర్తిల్లువేల్లినాధునిం
345

ఆ॥వె॥ పిలువబంచితాను - వివరంబు నడుగంగ
వేల్లినాధుడంత, విశదబరచె
దేవదాసికథను - కోవలుదేసిన
తప్పటడుగునంత తప్పకుండ 346

ఆ॥వె॥ అంత వినియు శ్రేష్ఠి - యంతరంగంబది
కలతవెట్ట ముఖము - తొలగ వెలుగు
కులముగుణము జూచి - కూతునిచ్చెను శ్రేష్ఠి
యేమిచెప్పువాడ - యింత నేను 347

కం॥ కొంతకు మెల్లగ లేచియు
యంతఃపురమదియు జేరి, యాకన్నగినిన్
చెంతకు పిలిపించియునట
యంతఃమ్రనమందునుండు, నద్దియునడిగెన్ 348

శా॥ తల్లీ నాసుతుడీవు నొక్కటియె, యెంతన్వేరు లేదింతయున్
ఉల్లంబందునునుండునద్దినిట, నేనునిన్ను ప్రశ్నించెదన్
మెల్లన్ప్రోత్రియక, నీకుతండ్రిడనని, నీమేల్కోరునంచెంచియున్
ఉల్లంబందున, నుండునద్దితెలుపనోపలున్నిటన్నాకునున్
349

కం॥ మా యింటి దీపమీవును
నోయింతీ కోవలుండు, నున్నతమగునా
ఈయింటిని మాలిన్యము
తోయించెను నిందునట్లు, తోయజనయనో 350

గీ॥ నిజము సెప్పుము, నీభర్త, నిన్ను నేడు
యెచటికేవియు, తోడ్కొని, యేగనేమొ
అద్ది తెలుపంగవలయును, నన్ననపుడు
శాంతమూర్తియునగునామె, చక్కగనవె 351

గీ॥ నాదుభర్తయునన్ను భవంతి నుండి
యెటకుగొనిపోవలేదంచు, నింతవలికె
అటనసత్యంబు జెప్పంగ, నామెహృదయ
ఘోషవెల్వడె గొంతులో గూడునటుల 352

సీ॥ అంతమహాశ్రేష్ఠి- యామెను వీక్షించి
యంతరంగబున- యంతయెరిగి
నిట్టూర్పువిడిచియు- నీదుసౌశీల్యంబు
నియమవ్రతంబున- నీదుతండ్రి

వంశంబుధన్యంబు- వడసియు వర్ధిల్లె
యిటయసత్యంబును- నిందువలుక
మాగౌరవంబును- మహినిల్పుచుంటివి
తల్లిశ్రేష్ఠియు రెంట- ధన్యవదమ్మ

గీ॥ నేనెదౌర్భాగ్య జీవిని- నేనెభూమి
గౌరవంబును నిలుపంగ- గూడనిందు
శక్తిలేనట్టి వాడనై- చవటనైతి
యంచులేచి ప్రకోష్ఠంబు- నందుటోయె 353

ఉ॥ అందునకొంతకాలమట, నాతడునందు పచార్లుజేసి, తా
నందున నిల్వలేక, మరియట్టులెసౌధము పైకిజేరగా
అందుననైన శాంతిగొన, కాతడు, కోవలుడట్లుగౌరవం
బందిన, యద్దిపోవునటునట్టు లగొట్టగ, బుద్ధిజారగా 354

గీ॥ అందుతిరుగాడుచుండగ, యమితత్వరగ
వేల్లినాధుండు కోవలు, వెంటగొనియు
వచ్చి, జేసినతప్పుకు, వ్యధనుమదిలొ
గూడియున్నాడు, నిందునకోవలుండు 355

సీ॥ అనగమహా శ్రేష్ఠి- తనయునిగానంగ
మదియిష్టపడకను- మాన్యుడతడు
తనయయిష్టతనంత- తలయును నూపియు
నెరిగింప కోవలు దెరిగియద్ది
తనతప్పిదంబును- గొనిబుద్ధి తనభార్య
శాంతరూపిణి సతి యంతబాధ
అవమానమూనంగ- యటుజేసియుంటచే
యంతరంగంబును- నదిదహించె

గీ॥ ఉత్తమంబగు సంస్కారమున్నతముగ
నుండ, వివశత్వమూనియు, నుండేనతడు
తండ్రికఠినంబుగానను- దండనంబు
చేయ, కొంతయు పూరటజెందియుండు 356

కం॥ తననటు జూచియు తండ్రియు
గొనుయూరట కొంతయైన- గూడగచేయన్
గొనిపౌరుష మేదైనను
ఘనకార్యముజేసితాను గణుతికినెక్కన్ 357

వ॥ మదిని నిశ్చయించినవాడై 358

గీ॥ తాను వైశ్యుడై। వెలయుట। ధరణియందు
తలితుడైనను। గౌరవభాజనుండు
ఔచు వెలయుట. వంశంబుగౌరవంబు
నిలుచునట్టులజేయంగ। నేర్చువాడు 359

చం॥ జనియటకన్నగిన్ననినగ।చయ్యనజేరియు। దేవి,యంచునున్
అనియును. నన్నుసద్గుణము లన్నియునంటియునుంటచేతనే
అనితరమౌ జయంబుగౌన। యందునపుట్టిన యగ్నిచేతనే
ఘనతరమూర్ఛితన్నిటుల। గాల్చితి జ్ఞానముపొంది తేనునున్ 360

గీ॥ పుటముబెట్టిన స్వర్ణంబు బోలియున్న
దానిచేతనె భవితవ్యజ్ఞానమంత
తెలసినాడను క్షమియించు లలననన్ను
పలుకనిరీతి భర్తయు పడతిమిన్న 361

వ॥ శిరంబు సిగ్గునవంచి నొకలిప్తకాలంబు నూరకుండి తన
శిరంబు పైకెత్తి 362

చం॥ గనియటభర్తృపసతి। గ్రక్కున మీరిటబల్క పల్కులున్
గనినను। నిందు నాహృదయ। గానమెబల్లుచునుండె। వేరుగా
గొని। క్షమియింపబోలునిట। గూడినయెవ్వరి తప్పులేదు। నీ
వును। మరినేను। చేయమిది। పూర్తిగనావిధిలాగెయివ్విధిన్
363

ఉ॥ కన్నగిమాటలన్వినియు। కన్నగి। పోయినదానినీమదిన్
ఎన్నగరాదు। వైశ్యుడను। యెంపికజేసిన బేరమందువన్
సన్నగజారె। బేరమున। జాలినదైన। యదృష్టమాతనిన్
ఎన్నడువీడబోదు। గనజేసిన బేరముదిద్ది గెల్పునున్ 364

కం। గొనియెడు నంచును బలికియు
గననొదబడకున్న। తండ్రిగాంచియు వ్యధనున్
జనె మామనుగనుగొనగా
యనయమునటు జరుగుదాని। యాద్యంతములున్ 365

వ॥ సమస్తంబు నెరిగించి. మామను క్షమియింప వేడుకొన.
యతండు నల్లుని వేశ్యాసంపర్కంబున గలుగునపఖ్యాతి
యును। వారి కపట ప్రేమంగూర్చి। వివరించి మఱియు
విట్లనియె- 366

కం॥ అనుభవములు। నాదగునవి
గొనుమిది। పీడంగవలదు। గుర్తుంచుము। నీ
వును। వైశ్యుండెపుడును ధర
గొని। వస్తువులనమ్మి ధనము గూర్చెడు నెపుడున్ 367

వ॥ కానివస్తు వ్యామోహియై, తనధర్మంబు విసర్జింపడు-
ధనార్జనంబుకొఱకు ప్రాణనష్టంబైనను వెనుదీయక, ధనం
బార్జించు। ప్రాణాపాయంబైన సమయంబుల నట్టిధనంబును
తృణప్రాయంబుగా విసర్జించు, వ్యాపారికి పరవతి ప్రాణం
బుతో సమానంబు। వర్తకుండు చేసిన। తప్పులదిద్దికొని।
సంఘంబున గౌరవమర్యాదలఁ పెంపొందించు। కావున।
నీవిషయంబుల మనంబున నిలిపికొని। గౌరవ మర్యాదలఁ
కాపాడ ప్రయత్నింపుమని విహితబోధజేసి- 368

కం॥ అల్లునిగాంచియు। తనదగు
కొల్లలుగానుండు ధనము। గూర్చియునంతఁ
చల్లని వ్యాపారంబును
నల్లుని పరమతడుజేసె। యప్పుడెనందున్ 369

గీ॥ కార్యభారంబు బూనెడి, కర్తలనట
యెల్లవారిని పిలిపించి, చల్లగాను
అంత నెరిగించి, వ్యవహారమంతనతడు
జూచుకొనునంచు, నాజ్ఞల సారదిజేసె 370

చం॥ అదివిని సార్ధవాహులట, నప్పురినుండెడు శ్రేష్ఠివర్యుడున్
కొఱవయులేని యా ధనము, కోవలుగూడగజేయ, వించునున్
అదివరకుండువారు, నొకచైరట కోవలు నాధిపత్యమున్
మదియను మోదమందియును, మధ్యదళారులపీకిపై చియున్ 371

గీ॥ నగరవీధుల అలితయు, నగరవధువు
లైనవారలు, రాజమ్మ లందుకుట్ర
బన్ని, యిలకులీనుల నవమానబరచి
నట్టివారల, నగరంబునందునుండి 372

ఆ॥వె॥ వెడలనంపవలయు, విధిగను, ననుచు
వాడ వాడలందు, బలపమూని
బహుళమైనరీతి, పలుకులచాటిరి
వారియందుహీన భావమూని 373

కం॥ ఇది యటుజరుగుచునున్నను
వదలదు సందియము। నగరప్రజలకు మదులన్
ఆదిరియునుండు దళారుల
పదలక కోపలుదుసందు। వారలనెల్లన్ 374

వ॥ పన్నావ్యాపారధాటికి। తట్టుకొనలేని। వారియందరితోడఁ
కోవలుండు సంబంధంబుల పెంచుకొనియె। ఆమధ్య
దళారీలు। స్తిమితపడి। వారు నిలువశక్తిగలవారలై
పరికించునప్పటికి। కావేరీపట్టణఁబున వ్యాపారంగంబు తారు
మారయ్యె. యిట్టి వార్తలతో। కావేరీ। పట్టణంబంతయు
సంపూర్ణంబుగానిండి యల్లకల్లోలంబయ్యె 375

చం॥ ఇటుజరుగంగ।మాధవియు।నెంతయుగ్రుంగిజ్వరంబురాగతా
నటస్పృహలేకయుండగను।నందియుఁజూవగ।పట్టణంబునన్
నటనటనుండువైద్యులు।ఘనఁబుగలంచములూనివైద్యమున్
కుటిలత జేయవచ్చినను। కోమలికి విషమిచ్చునంచునున్
376

గీ॥ పురిని నుండెడు వైద్యుల। పెరియయందు
పిలువకుండెను। దానికి గలుగు దుఃఖ
మెంతొ। యంతులేకుండెను। వింతులందు
వారిని బహిష్కరింపగ। బహుళముగను 378

ఆ।వె। యోజచేయుచుండి। రున్నతులందున
యంచువాడవాడ। ననుదినంబు
పురమునందు జనులు। పూర్తిగవినగను
బడియెనింకనందు। వాదువెడలె 378

ఆ।వె। రాజధాని నుండి। రాజాజ్ఞ వెల్వడె
పురము వెడలనంపు, త్వరగననుచు
కోవలుందు వేగగూడెను పన్నతో
నంచుమాటవించు। నందు పెరియ 379

కం॥ వారికి జరిగెడు యోచన
నేరికి తెలియంగరాక! యెనసెను నదియున్
చేరగ కోవలు బోధలు
నారసినను విడచిపోవు। నంచును భయమున్ 380

ఆ।వె। గొనియునుండె పెరియ। గూడెను జ్వరమంచు
నెరిగి పన్నశ్రేష్ఠి। త్వరగవైద్యు
పంపియూరకుండె। పంపినదాసిని
జూడకుండ పంపె। చోద్యపడగ 381

చం॥ మఱియొకవార్తయు, న్వేరియ మానసీమను, గాటుపెట్టగా
గురిగొనివేయు నాయుధము, గ్రుచ్చినరీతిని వచ్చిచేరె, నా
పురినటు, కోవలుండు, పనిబూనియు, పన్నను నీటముంచగా
సరియగుటుత్న మున్నతడు చక్కగగూర్చెనటంచురూఢిగా 882

గీ॥ పెరియనాయకి, మాధవి జ్వరముగొనగ
కోవలునితోడ గూడియు, కొంతవరకు
తన్నుతానును దూషించి, తనదు మదిని
స్థిమితమదిలేక, గంతులు, చేడెవేసె 38

గీ॥ ఇంతలోనను, వెలుపల సందడివిని
దృష్టిసారించిరిద్దరు, దూరముననను
వచ్చువారిని జూచియు, నచ్చెరువును
గొనిరి, పెరియకన్నులలోన, యొనరెమెరుపు 384

ఆ.వె. నాగరత్నలేచి, సాగినయజమాని
గాంచి గౌరవంబు, గనగయామె
అంజలించెతాను, నభిమానమెంతమో
మదినినిండ, దాసిమనుగడ కని 385

ఉ॥ బంగరురంగు గడ్డమును, బాగగుకన్నులునీలిమంబులై
పొంగులువారు, స్ఫూర్తిగొని, పూజ్యుడునౌనటునంటిపన్నయున్
చెంగటజేర, దుఃఖమది, శీఘ్రమనాముఖమందజేరగా
అంగనదానిన్గనియు, నాతని కౌగలిజేర్చనాతడున్ 386

కం॥ ఏగతినున్నది మాధవి
జాగును లేకుండ, తెల్పు, చానరొయనగా
ఈగతి బల్కెను పెరియయు
బాగగునే, కలువరింత, బాగుగహెచ్చెన్ 387

ఆ.వె. ఆమె మాటవించు, నామాధవిని జూడ
పన్నుశేష్ఠిలేచి, పడతియుండు
దరికిజేరనడచి, తాసును జూచెను
జ్వరముతోడ స్పృహయు, బాయుదాని 388

కం॥ చందనకర్పూరంబుల
కొందల మందంగ, నుదుట, గూర్చగపట్టన్
తొందర మాధవి దగ్గరి
యందతకును, ప్రక్కమీద, యామెను గనుచున్ 389

ఆ॥వె॥ గూరుచుండె। ప్రేమగూడగ పన్నయు
స్పృహయులేనినామె। జూచియంత
కరముసాచియామె। కరమునునిమురగ
నిప్పుకణికవోలె। నప్పుడుండె 390

గీ॥ ఆమె చేతిని తనచేత। యందుకొనియు
అగ్నితోడను చెలగాట। మాడినావు
నీవుగాలుట గాదిట। నీతోగూడి
పురమునంతయుగాలెను। పూర్తితల్లి 391

కం॥ ఏకాంతమందు పెరియయు
తాకాంతుని తోడగూడి। తనమదిలోనన్
చేకురునయ్యది యడుగగ
యేకాంతము జేరుకొరకు। చేకానిపోయెన్ 392

గీ॥ అతని గూర్చుండబెట్టియు। నంగితీసి
మంచిగంధంబు తెచ్చియు। నెంచితాను
అతని యంగంబులకు బూసియామెయడిగె
యానవంబది తెత్తునా। యనుచునడుగ 393

కం॥ కాదిది త్రాగెడు సమయము
నేదైననుపనియుజూచు। నిదివేళయుగా
నీదైనమాట ద్రోయక
యేదీ తెమ్మిపుడు త్రావుదేనుననిందున్ 394

కం॥ ఇంతటి నుండియు। నాకును
నింతీ త్రాగడమె। పనియు। నేమియువేరే
ఇంతయునుండదు। నంచును
నంతటనవ్వుచును। జూచి। యాతడుమరలన్ 395

ఆ।వె। అనగక్షణమునాగి। నామెయుస్వయముగ
మద్యపాత్రనంది। మానకుండ
అతనికి త్రాగి। యతడునుసుంతయు
తేరె। పాదములను। జేరివత్తె 396

వ॥ మాసాత్తుశ్రేష్ఠి సుతుండగు కోవలుండు విన్న కలిసెనా
యని యడుగ 397

కం॥ మాసాత్తుశ్రేష్ఠి। సుతుడచె
మాసాయికి। యల్లుడతడు। మనమిటనిపుడున్
కాపా: తిరుగటిరాళ్ళకు
వేసరకుము। మద్యజిక్కి వెలుపలరాగన్ 398

వ॥ ఎవరిచేతనైనవనియని నిరాశాహృదయుండై। మద్యపాన
మత్తుండగు నతండుమందిరంబు ప్రతిధ్వనింప బిగ్గరగా
నవ్వె అంత పెరియనాయకి- 399

కం॥ ఏమని జెప్పగవచ్చెను
సామీ కోవలుడు నీకు। చయ్యెనచెపుమా
ఆమాటకు పన్నయునిట
లేనుని జెప్పుదును। మీకు। వింతిరానేను౼ 400

గీ॥ ఇంటినుండియు మిమ్ముల। జంటగాను
వెడలనంపుమటంచని। నుడివెనతడు
అనగతత్తరపాటుతో। యతివయతని
జూచుచుండెను రెప్పలు। మూసుకొనక 401

చం॥ తగినటునేమజెప్పితిని। దానికి। వ్రేలికిగోటికిందునన్
తగిలినబంధనంబునెటు। దాల్చనోయట్లిది వేరుజేయగా
తగనిది। పెద్దదై పెరుగ। దానినితీయుటయొప్పు। గోటినిన్
మిగులకతీయ నెట్లగును। మేనికి కీడునుచేయదే భువిన్
402

ఆ|వె| అతనిమాట వినియు| నా పెరియయు| గౌర
వంబుతోడ| చూపు| నమరునట్లు
ప్రేమతోడకలపి| ప్రియునటు
జూచియు| దెబ్బదీయుమిమ్ము దిట్టగాడు 403

కం|| పన్నెనువ్యూహమటంచును
విన్నానిట నేననంగ వినిచెనునతడు
పన్నుటయైనది| కొనుటకు
కొన్నైననులేకజేసె| కోవలుడిందున్ 404

గీ|| నాదళంబున నుండెడినట్టివారి
చీలదీసియు| తనలోన| జేర్చుకొనియె
కోవలుని తెల్విగాదిది| కోరిశ్రేష్ఠి
జేసినట్టిది| నామాటజేరగానె 405

చం|| మనసుత| శ్రేష్ఠిపుత్రియెడ| మానవికీడునుగూర్చె| దీనినిజ
మనమునవొప్పుకోవలయు|మానినియంచన| నామెకండ్లలో
దొనదొననీరుగార| నిటతొయ్యలికేనును నెంతొజెప్పితిన్
వినదయె| మూర్ఖురాలనగ| వెంటనెనాకును జెప్పియున్నచో
406

ఆ|వె| నేనుయెట్లోజెప్పు| దీనినిజరుగక
జేసియుండువాడ| చెప్పుకున్న
కతననింతయయ్యె| గాకని| యోజన
జేసియిట్టులనియె స్థిరముగాను 407

ఆ|వె| నన్నుమిమ్ము| వేరుమున్నగజేసియు
మిమ్ముశిక్షజేయ| మేలటంచు
వారుయోజచేసి| బాగుగయోచించ
మనిషియన్నవాడు| మహినిగొనునె 408

కం|| అనవిని పెరియయు| పన్నను
గనుగొని| తుచ్ఛులముమేము| గావలెనని| నీ
వును| నీగతి యిటత్యాగము
గొనధవె| యనిపలుకనంత| గూడియుముదమున్ 409

చం|| ఇదియెటుత్యాగమౌను| మరియింతటి| దానికెపన్నయేగతిన్
మదివి| దరిద్రుడౌదనుచు| మానినియెంచితి| వర్తకంబునన్
ఇదెయిటువంటి నష్టములు| యేర్పడుచుండుట| సిద్ధమేగదా
వదలగలాడనేమిము|సమంజసమౌనాకొ| యంచుపల్కినన్
410

గీ॥ ఆతనిమాటలవిని యును। నతివ పెరియ
మనసుద్రవియింప। జరిగియు। గొనియుగర్వ
మింత। శిరమును। నురముననంత జేర్చి
కన్నులర మోడ్పుడానివి। కరముదువ్వి 411

కం॥ ఇద్దరుశ్రేష్ఠులతోడను
ముద్దియవైరంబువచ్చె। మూర్ఖతగొనగన్
అద్దిరమాధవి నిపుడును
సుద్దుల పనియేమి। రక్షజూడగవలయున్ 412

ఆ।వె। గోరుచుట్టుమీద। గురిజూచిరోకటి
పోటుబడ్డయట్లు। పూర్తిగాను
పన్నశ్రేష్ఠికుండు వ్యాపారనౌకలు
దోచిరంత। పన్నతూలివడగ 413

ఆ।వె। దానితట్టుగొనగ। దారియులేకను
గొనెదరిద్రరూపు। ఘనముగాను
కోవలుండుశ్రేష్ఠి। గూర్చినవ్యాపార
భారమూని। వెంటవర్తకులును 414

ఆ॥వె॥ పెక్కుమందిరాగ। విడువకన్నగి
యావిదేశయాత్ర। కతడు వెడలె
తరుణివెంట విడక దాసదాసీజనుల్
పెక్కుమంది। రాగ ప్రేమతోట 415

చం॥ జనగయనంతమౌజలధి। చావభయంబును। నొందనందునన్
గొనెపతి। కౌగలి। న్నదియు।గూర్చెనురక్షయు।గాంచిదానినిన్
గొనియుసఖుల్సహేళనను।గూర్చిభయంబనుసాకుతోడుతన్
గొనియెను కౌగలిన్విడక। కోపలియంచును। నాడిరయ్యెడన్ 416

వ॥ కన్నగి భయంబుసాకుగాగొని। కోవలుండు 417

చం॥ అదిగొతిమింగిలంబనిన।నయ్యదిగాంచినయంత యామెయున్
మదిభయమంది। భర్తనటు। మానకకౌగలి వీడకుండగానన్
అదియెమరింతకోవలున। కయ్యెనునెంతయొహాయిపూర్తిగా
ముదమునుజెందె।స్ఫూర్తిగొనె।మోహనరాగవశీకృతాంగుడై 418

సీ॥ అకాలమందున। యాడువారికి విద్య
గురువనియాచార। కారణమున
అకుటుంబములంమె। సాగకయుండిన
చదువుసంధ్యలుసాగె। చక్కగాను

కన్నగీసతిపెండ్లి। కన్నను మూడేండ్ల
ముందుగా తల్లియుపొందెనుగతి
అప్పటినుండియు। నామెయేశ్రేష్ఠిదౌ
సంద్రంబుబోలు। సంసారమంత

గీ॥ చాకచక్యంబుగానామె। చక్కదిద్ది
పెండ్లియై వెనుకనామె। పీడకుండ
అత్తవారిల్లు। చక్కగదిద్దినామె
యెవరికేరీతి। యేపనులెట్లజేయ 419

గీ॥ వలెనొనారీతివారల। బనుపుచుండె
గౌరవంబేమొ పెద్దలజేరగాను
జూపుచుండెను కన్నగి। చౌరవలస
యందరానంద మందున యందికొనిరి 420

ఉ॥ కన్నగి చాకచాక్యమును। గాంచిన కోవలు మానసంబునన్
ఎన్నగలేని తోషమున। యిష్టమునుంగుచునుండెగాని। తా
మున్నుగ మానసంబునకు। మోదమునందజేయు మాధవిన్
దిన్నగనప్పుడప్పుడు। మతిన్నొకవైపున పీడకుండెగా
421

చం॥ విడువక కన్నగీసతియు। ప్రేమతొ భర్తకు సేవజేసినన్
విడువగుప్రేమయందున।వినిర్మలమైతగు। యాజమాన్యపుం
గడుసరి జీవితంబొకటి। గానగవచ్చెడి। నైనమాధవీ
పడతియుదాసిగా। సఖియభావన। లాలనప్రేమ జూపియున్ 422

కం॥ ఆకర్షణంబు జేయుచు
నాకోరికలన్నిపొంగ। యామెయుదానిన్
చేకొననియక దొరుకక
యాకాంతయు నేడిపించుటదియును ప్రియమై 423

వ॥ కోవలునకు కన్పించుచుండె। కాని కన్నగీసతిప్రేమంబు
కల్మషరహితంబై। సనాతనంబై। స్థిరంబై। యకలకంబై।
హక్కుభుక్తంబై। కన్పట్టుచుంన్నందునను, విరామంబు
లేక। యేసమయంబునన్నైన యందుచున్నందువలనను
యాకర్షణంబు కొంతతరిగినట్లు కోవలుండు భావించుచుండె- 424

ఆ।వె। ఆమెపొందుతనకు। యధికారయుతమౌచు
నడ్డులేకయున్న। యందువలన
పదముక్రియయు। లేక। భాసిల్లదేరీతి
యటులశాంతిలేక। యతడునుండె 425

కం॥ ఎప్పుడూ మాధవితోనిక
తప్పుడు పనులెందుజేయు। తగదని తానున్
చప్పునగైకొనె శపథము
నప్పుడు నటనందువలన। యాతడు దానిన్ 426

చం॥ జలనిధి యానమెప్పుడును। చక్కగ నొక్కటియై తనర్చదే
అలలటునొక్కతూరిగను। నాకసమంటెటునట్లు వచ్చియున్
లలనల। మోహావశ్యత। విలాసముగూడగ। బుద్ధియెట్టులన్
అలజడి।జెంద,నౌకలును।నట్టులనూగిసలాడు। అప్తయున్ 427

కం॥ క్షణమటు నుండుసునగ్పడె
క్షణమాన। సంతసముగూర్చు। క్షణమునమబ్బుల్
ఇనుడును గనుపడకుండగ
ఘనముచ నాగసముగప్పు। కాదనలేకన్ 428

వ॥ అయ్యోలపి, బార్ వికోమంజూ। మొదలైన రేవు పట్టణం
బులఁదాటి కోవలని వ్యాపారనౌకలు। సికందరియా
జేరెనంత 429

కం॥ అందున కోవలుదంపతు
అందుండెడినా, సికందర, నెడి, వానితొ, తా
మందింది యాతిధ్యమునట
యందున యుద్యోగివలన, యందిరివర్ళల్ 430

కం॥ కోవలుని భార్యతోడుత
సేవింపగ, గౌరవంబు, జేకురునటులన్
వేవెగమె, విందులునట
గావించిరి, సంతసంబు గాంచగవారల్ 431

చం॥ అచటశిలామయంబునయి, యందమునై యలరారు స్తంభముల్
అచటనమర్చు, నాసనములన్నియు చిత్రవిచిత్ర శోభలన్
అచటను శిల్పముల్గనగ, యంతటరంగులతోడ గూడియున్
ఎచటనుజూడ, మోదమును, నెంతయుగూర్చెను, తద్గృహంబునన్ 432

కం॥ పూర్వుల చిత్రపటంబు, ల
పూర్వములై నట్టి, వాని పుష్పంబులతో
సర్వము శోభను గూర్పగ
సర్వులుముదమందనుండె, చక్కగనందున్ 433

సీ॥ సభకును నతిధులు। సర్వులురాగను
పుష్పంబులందించి। పూర్తిగాను
చిత్రకళాశోభ- చెలువారుచుండెడి
పాత్రలందునయిచ్చె- మద్యమందు
పుష్పగుచ్ఛంబుల- పొందికయందించి
గంధంబు పాదముల్కాలయయద్ది
గొనివచ్చివారల- గూర్చుండజేసిరి
నర్తకీమణులంత- నర్తనంబు

ఆ।వె। నొక్కచోటజేయ- నొకవంక కీర్తనన్
పాడుచుండ- నందువారు దాని
వినియుతన్మయంబు- గొనెరటువారలు
మత్తులగుచునుండ- మమతతోడ 434

కం॥ తనవాక్చాతుర్యంబున
ఘనుడా కోవలుడునందు- ఘనులగువారిన్
గొనివేసె- భార్యతోడుత
గొనయాతిధ్యంబు- నందుగూర్చెది పిలువున్ 435

ఆ॥వె॥ సతియువెంటరాగ, మతిమంతుడాతడు
నచటిదేవతలను- నతడుజూచె
పెద్దవైనయట్టి॥ పిరమిడ్లనందున
జూచెసతియు, వెంటజొబ్బిలంగ 436

గీ॥ అందువ్యవహారమంతయు॥ నతడు దీర్చి
రోముదేశంబు జేరంగ- తాముదలచి
యుండ కావేరి నుండియు॥ నందెనటకు
పురికి రమ్మంచునాజ్ఞయు॥ త్వరగనందు 437

గీ॥ మామదౌ యాజ్ఞనతడును॥ మతితలంచి
వస్తుచయమంతనచటనే॥ బాగయమ్మి
తనదుదేశంబుజేరంగ॥ తగునటంచు
బయలుదేరెను పురినటు॥ త్వరగజేర 438

చం॥ అతడువిదేశయాత్రలను॥ నంతయుపూర్తిగజేసికొంచు॥ రా
నతనితొవెంట నంటుకొని॥ యాతనితోడుత॥ సార్థవాహులై
జతగను॥ నుండువారికిని॥ చక్కగయర్థము॥ కోరినట్లుగా
అతడునునిచ్చె॥ యద్దివిని॥ యుందలితక్కినవారు వెంటనే-
439

ఆ।వె। అతనితోడ గలసి। వ్యాపారమందున
వృద్ధినిగోరివారు। విడువకుండ
తండ్రిబోయినంత తనయాస్తితోడుత
మామయిచ్చినట్టి- మహితమైన 440

గీ॥ అండదండలు ప్రోత్సాహ। మంతనిచ్చె
రెండువంశంబులందుండు। దండివైన
వర్తకంబుల। ధనముల। వదలకుండ
వచ్చిజేరంగ। మామను। వదలకుండె 441

కం॥ ఆతని యనుమతి తోడను
చేతమునటు మెచ్చునటుల। శీఘ్రమనందున్
ఆతడు కావేరీపురి
ఖ్యాతినిజేపట్టె ప్రభువు। గాంచెడు దానిన్ 442

గీ॥ ఆమహాశ్రేష్ఠిచాతుర్య। మంత పెరిగి
నలగిపోయిన పన్సయు। మెలగలేక
మధురజేరెదు యోచనయతడుజేసె
పాండ్యరాజులు। పాలించుపట్టణంబు 443

కం॥ చేరెదననియన పెరియయు
నారసి, యా యోజనంబు, నామెయు భయమున్
చేరగ, పన్నయు మాటయె
గూరుపభయమద్ది, తానుగూడియు వెంటనే 444

చం॥ తనదరియున్న యర్థమది, తప్పకపన్న యెరిగినంత, నా
ధనమును, వర్తకంబునకు, తానునునీయుమటంచు గోరెడిన్
అనుకొని, యాతనిన్విడువ జాలక, నామెయు సంశయాత్మయై
తనధనమంతగాచుకొను, దారినిగానగ, చింతతోడుతన్ 445

గీ॥ పెరియనాయకి, పన్నల, ప్రేమచాల
కాలముననుండి, సాగుచు కలసియుంట
ప్రేమకొరకును, ప్రాణంబు, విడువుమన్న
సిద్ధమగు ధనమునువీడ, సిద్దపడదు 446

కం॥ దీనికి కారణమారయ
చానయునా మాధవియని, చాలగకోపం
బూనియునుండెడు, లక్ష్యము
దీనికి నామాటయందు, దేనికియుండున్ 447

ఆ॥వె॥ నాదుమాట వినక। పైదలి కోవలు
దిందువచ్చునెడల। క్షేమముగను
మించునట్లునేను। మేఖలా దేవికి
యుత్సవంబుజేతు। నున్నతగతి 448

వ॥ అని మ్రొక్కుకొని యున్నకతంబున, నయ్యుత్సవంబు
నకు ధనంబు విమ్మని పెరియనాయకిని వేధించుచుండె 449

ఆ॥వె॥ ఉత్సవంబుజేయ। యున్నతుడౌ శ్రేష్ఠి
వినినముప్పువచ్చు। ననగవినదు
పన్నవిన్నయెడల। పైబడు క్రోధంబు
నన్నమాటవినదు। నటివయిందు 450

కం॥ గడచె నురెండగుబుతువులు
విడువదు తనపట్టునుంత। భీకరమగుచున్
గడచను రోజొకయుగముగ
పడతికి శూన్యంబునయ్యె। భావము మదియున్ 451

ఉ॥ కోవలుగూడకుండుతరి। కోమలి. దువ్వియునంద మొప్పగా
ఏవిధిగానుపించదట సిద్ధురమానియు। నామెయొక్కటీ
భావమునందుశూన్యతను। బాగుగనింపియు రాత్రివేళలన్
ఆవనజారితారకల। యాకసమున్నట జూచుచుండెడిన్ 452

సీ॥ ఇటులను జరుగంగ- యింతలో మాసాత్తు
శ్రేష్ఠి యారోగ్యంబు। చెడగనతడు
దానిని తప్పింప- దారియులేకున్న
మరణించె మాసాయి మహితయశుడు
ఆవిదేశములందు। కోవలుడుండుగ
వేగమేరమ్మని। వేగుబంపె
త్వరగనుతిరిగియు- తనదేశమును జేర
వచ్చునంచుసునట- బాగయెరిగి

గీ॥ సంబరంబున రోజులు- చానమరియు
పరిగణించుచు నుండెను। భామ। రత్న
రేవులకుపంపి। యందున। వలయునద్ది
తెలసికొనుచుండె। మాధవి గలగకుండ 457

కం॥ క్షణమొక యుగముగ గడుపుచు
వనితయు నటనున్నతరిని। వచ్చెనునంచు౯
వినియును కోవలురాకను। గనె
సంతోషంబునామె। గ్రన్ననవందున్ 458

గీ॥ మ్రొక్కుకొన్నట్టి దానిని। మోదమునను
దీర్చ। నుత్సవంబులు। మరిదీనులకును
అన్నదానంబులు ఘనముగ వన్నెకెక్క
చేయదలచెను। వినురారు। చిత్తగాగ 459

గీ॥ ఆమెసంకల్పమెంతయు। నమరకుండ
పెరియయడ్డంబు గల్పించు వరుసజూచి
కార్యసాధనబుద్ధితో। కదలియామె
వచ్చెతల్లియున్న గృహము। భామవేగ 460

ఉ॥ ఆమెనుజూచితల్లియును। నామెమనోగతభావమంతయున్
తా।మదిచక్కగనెరిగి। దాసజనంబుల నందునుండకన్
వేమరు పొమ్మటంచు। నదిపీఠక. సైగనుజేసి। కూతునున్
ఆమెకరంబువట్టియును। నప్పుడెతానొడజేర్చి వెండియున్ 461

కం॥ సాకులు జెప్పిన సాగవు
నీకలికికి యనుచునామె। నిశ్చయమూనెన్
తాకొనెను నాప్రయత్నమె
నోకలికీయిదియు నీదియొక్కటె పనియున్ 462

గీ॥ కాదు, నాదగు పనియౌదు, కలికియుండె
నీ ప్రియునికొరకేరీతి, నీవునిందు
విరహవేదన గొంటివో, సరిగయటులె
నేను గొంటిని విరహంబు, నిక్కువముగ 463

ఆ॥వె॥ నేను నిన్ను సరిగ, నిక్కంబు యర్థ ము
చేసుకొంటినమ్మ, చిత్తమందు
నాపరిస్థితియిక, నీవును నెరుగుము
నీదు మేలుగోరి, నేనుజెపుదు 464

ఆ॥వె॥ కన్నకడుపుకంటె, మిన్నగుపెంచిన
ప్రేమయద్ది నీవు వినుముదీని
ఆమెచెప్పుచుండ, యేమనకుండను
వించునుండెయతివ, వీనులనిడి 465

సీ॥ నేనునునీతోడ- నిక్కంబు తెలుపక
దాచియుంచితి, నేడు తప్పకుండ
చెప్పెదవినుమమ్మ, నిప్పుడె నగరంబు
వీడనిశ్చయమేను- వేగగొంటి

పరిణయమాడిన- భర్తయుగాదమ్మ
కన్నబిడ్డవు నీవు। గాదుగాన
పన్నను నిన్నును- బాసియుపోవంగ
సిద్ధంబు నేనును జేసియుంటి

గీ॥ అంచునాడంగ దీనికియంతయేది
యనగ। మాధవి పెరియతో యనియెనిట్లు
ఉత్సవంబును జరుపంగ। నున్ననిందు
మేలుగలిగెడు వంచన। మించితలచి 466

గీ॥ ఉన్నదానవు నీవును। నన్నియివ్వి
శ్రేష్ఠిగారికి తెలిసిన। చిక్కుతెన్ని
వచ్చునోసుంతనీవును। బాగమదిని
యోజనేయుము మాధవియున్నదాని 467

ఉ॥ కావుననీవు నాదు వెనుకన్నను వీడక నాతోవచ్చినన్
నీవును నేను। నామధురనే। నివసించియు। క్రొత్త జీవితం
బీవును నెన్నుకొందుననిౕ యిందుననాకును బాసజేయుమా
నీవిటుబాపజేసియుననేకముతానటు యుత్సవంబులన్ 468

వ॥ చేసికొనవలసినది। దీనికినాకేమి యభ్యంతరములేదని।
పెరియనాయకి వివరించ। మాధవి యొకనిర్ణయంబునకు
వచ్చివుత్సవంబుజరుప వలశినదేయని। వక్కాణించె।
యంతనా పెరియ నావాగ్దానంబేమియన- 469

ఉ॥ నేనెటుజేతునమ్మ। యది। నీధవితవ్యము పాడుజేయగా
కానిదిగాన। శ్రేష్ఠియును। కానుకగా। నగలిచ్చియుండెగా
వానిలొలక్షరూప్యములు। బాగుగపెంచితినీవు। నిక్కమే
బూనియువిద్యనుస్గరిపి। పొందగజేసితిని। కీర్తివిద్యలన్
470

వ॥ కావుననీవు నాలక్షరూప్యంబుల గ్రహింపనగు 471

కం॥ మిగిలినదానితొ నాకును
తగువైనటువంటియిల్లు। ధరసియిటన్
వగవలదిట। కొనియివ్వము
తగవేలను నాకుదగిన। దారినిజూతున్ 472

గీ॥ పెరియనాయకి। యోచించి। త్వరగనీవు
వేరుపడుచుంటి విప్పుడు। వివరముగను
నీదుతండ్రికి నేమని। నేనుజెప్ప
గలనటంచన। వేశ్యవు। గానతెలియు 473

కం॥ ముందుగ నేమను జెప్పిన
చందంబునజేసియంత, చాలిననీవున్
అందంబగు కధలల్లియు
పొందింతువు, నమ్మకమ్ము, పూర్తిగనమ్మా 474

శా॥ వేరై పోయిన మాధవిన్గనియు, నవ్వీటన్నెటనూచినన్
వేరేచర్చలులేక నాజనములు నిర్భ్రాంతులై, యందరున్
సారంబంతయు తీరిపోనగును, పన్నానాముడున్వేగుకా
వేకీపట్టణమీడిపోయె, నటనే, విశ్రాంతి యానంచునున్
475

కం॥ పెరియయు నొక్కతెయింటిని
యరయగ నివసించుచుండు, నామెనుగనగా
అరులకు పరమానందము
వరలెను, రాజమ్మ మరల, వచ్చుచునుండెన్ 476

కం॥ కోవలుని పిచ్చిలోబడి
యావనితయు, మాధవియును, నటులనునుండన్
వేవేగమె వెడలించితి
కావలయునె శ్రేష్ఠితోడి, ఘనవైరంబున్ 47[illegible]

ఆ|వె| ఎందుకమ్మమాకు| నంతటి వారితో
వైరమంచు పలికి| వనితతాను
పన్నజేరెమధుర| బాగుగనుండిన
నేనుబోదు మధుర| నిక్కువముగ 478

చం|| అనుదినమిట్టివార్తలను| నందుచునుండిన| కోవలుండునున్
గొనకను| నివ్వియేవి| తనుగూడిన| వర్తక|కార్యమందునన్
మునిగియునుండె| నైననివి| ముట్టకపోవగలేదు| వానినిన్
మనమునునుండనీయకను|మానుషుడుజెసియునిగ్రహించియున్ 479

గీ|| తాసురాపాన మదివీడి| తగినయట్టి
వ్రతములనుపూజలనుజెసె| వనితగూడి
అన్నదానంబుబీదల| కమితముగను
చేయుచుండెను| నాతడు| చిత్తమూని 480

కం|| కోవలుదంపతులను| నిటు
యేవిధిగనుగొన్న| మనకు నెంతటి పుణ్యం
బావహిలునంచునందరు
కోవలు| కన్నగినిగూర్చి- గొనియాడిరిగా 481

సీ॥ మణిమేఖలాదే- మహితంపునుత్సవ
కార్యంబుజరిపించె- ఘనముగాను
పట్టణంబునసుండు- ప్రముఖవైలనెల్ల
పిలచియువిందును- పెద్దగాను
జరిపించె మాధవి- చక్కని నృత్యంబు
గానంబులను గూర్చె- గానిగురువు
చేలమ్మజాడయు- చేరగలేదందు
యేమయ్యెనోగాని- యెరుగకుండె

గీ॥ పెరియవచ్చియు- పలుకక- వరుసగాను
సతిధులును గూరుచుండెడి- యట్టిచోట
గూరుచుండెను- శంకర- గురువుగూడ
వచ్చిగూర్చుండె- వైరంబుబారద్రోలి 482

ఆ।వె। గజ్జకట్టి లలిత। ఘనమైన నృత్యంబు
దందరౌననంగ। యందమొప్ప
అందుజేసె। యంత నామాధవినిగాంచి
నృత్యమాడుమంచు। నిట్టిజెప్ప 483

కం॥ అందుకు నొప్పక మాధవి
యెందరు బ్రతిమాలుచున్న। యింతయుగొనకన్
అందలివారికి। బ్రాశిన
విందౌగీతంబులందు। వినిపించెను తా 484

ఉ॥ కోవలునే తలంచుచును। కోరికతీరక। నిందువేగమే
ఏవిధిజూచినన్నికను। నెన్నిదినంబులు। భూమియందునన్
తావసియించు। జచ్చునని। తత్పురమందలి నెల్లవారలున్
ఆవిధినాడుచుండిరట। యందులకేగిన వర్తకుండటన్ 485

గీ॥ కోవలునకద్ది తెలుపంగ। కోవలుండు
నేపనియుజేయుబుద్ధియు। నింతగొనగ
శాంతిలేకుండ। మాధవీ కాంతగూడి
గడపినట్టి క్షణంబులు। గణనజేసె 486

చం॥ అయిననునీతియున్మరియు। నాతనికుండు వివేకమంతయున్
వ్యయమయిపోకయుండుటను। వాటినిమించిన। శ్రేష్ఠికన్నగి
భయమదిబుద్ధినిన్నిలచి।బాయకనుండె।భయంబుగొల్పుచున్
వ్యయమునుజేసికట్టినది। భవ్యపునోదయు।క్రొత్తదండునన్
487

ఆ.వె। వచ్చియుంట గాంచి। బాయగనీచింత
జలప్రవేశమందు। జరుపనెంచి
రెండురోజులందు। నుండగడానిలో
నిశ్చయించె సతితో। నిశ్చయముగ 488

చం॥ పవలునురేయి। కన్నగిని। బాయకయుంట।మనోవ్యథార్తియున్
అవనతమయ్యెకొద్దిగను। నందలినోడకు। నాయకుండునున్
భువినటజేర్చనోడను। విభుండవు। నాజ్ఞనునిమ్ము। సాగరం
బవధిని। మించిపొంగె। సుడిగాలులు వీచెభయంకరంబుగా
489

కం॥ తీరము నోడను జేర్చగా
కోరగనావికులుగూడ। కొందరురాగన్
తీరనియవసర ముండిన
జేరగదగు తీరమందు। జేరకరేవున్ 490

చం॥ అతిగనలంకరించి। యతివైభవమ్మూనెడి। నోడకక్ష్యలో
సతితోభుజించి।యందున।విచారమువీడియు।గూర్చొనంగనే
కుతుకముగూర్చనందున। గూర్చిరికుక్కలు పందెమెంతయో
మతిముదమంద। జూచెనట। మానినికన్నగి। తోషచిత్తయై
491

ఆ।వె। వాటిపౌరుషంబు। పరికించుచుండియు
మౌనమూనియున్న। వానిభర్త
గాంచివ్యాకులంబు। కడత్రోయనెంచియు
నలవినోదమూను నట్టికధను 492

గీ॥ చెప్పుమంచనిదేవంతి। జీరివలుక
చెప్పుచుండిన వినుచుండె। చెప్పునద్ది
మనసుకెక్కెన। జాడయు। గనగరాక
దాసదాసీజనంబుల। తానుపిలచి 493

కం॥ గలుగవినోదము మీదును
సలలితమైనట్టి। పాట। సమకురజేయన్
గలుగును ముదమని పలుకగ
వలదనివారించె వారివైశ్యవిభుండున్ 494

కం॥ అంవరుపోయిన వెనుకను
నంచుండిన। కన్నగినట। గాంచియునతడున్
ఎందునచలనము లేకను
యందునస్తంబించిపోయె। వాకోవలుడున్ 495

మ॥ అనిమేషుండయి। కన్నగీసతిని। యిట్లొత్తండుగాంచంగ। నా
వనితారత్నము। కన్నగీసతియు। తాభర్తన్నిరీక్షించియున్
అనెతానిట్లును నిర్నిమేషతను। గాంచన్నాదు వక్త్రింబునన్
గొనగా నేమదియుండె। వింతగనగా గూర్చిన్నిటన్నేమియో
496

చం॥ అని యిటు కన్నగీసతియు। నాడగ కోవలుడెంతొ బుద్ధినిన్
గొనిఇటువంటిభావమును। కోమలిబుద్ధినెరుంగకుండగా
మనసుననిల్పి। గూర్చొని।సమంబుగ।నాదువిశృంఖలంబునున్
అణచగ।నీదుకళ్లకును। నబ్బెనుశక్తియు। దానిగూర్చియే
497

కం॥ మనసున తరచుచునుంటిని
వనితా యనియనగనామె। బాగుగననియెన్
అనిశము నీదు ప్రభావము
గొనుటను। నిట। నాదియేమిగూడదు నిందున్ 498

చం॥ మనసుకిచిత్రమౌగద। సమంచితసుందర రూపరాశివై
మనియెదునిన్ను। కన్నులతో। మానినిగాంచగ పుద్దిపుట్టకన్
గొనియుమహాపరాధమును। గూర్చితినీయెడనంచు।నాతడున్
గనియెగవాక్షమందుననను। గానగవచ్చెడి। యంబురాశినిన్
499

గీ॥ అల్లకల్లోలమైయుండె। యంబుధియును
విప్లవంబదిజెలరేగ। విశ్వమెటుల
అల్లకల్లోలమగునట్లై। యంతగాంచ
కడుభయంకరమైయుండి। కడలియపుడు 500

ఆ।వె। దానిస్థితినిబోల్చి- తానుమనంబును
నబ్ధిగాంచునతడు- నందుబలికె
నాదుమదినినుండు। నంతయునీకును
జెప్పతలచితేను। తప్పకుండ 501

ఉ॥ నాదుమనంబు।స్థైర్యము। యనాదృతి। యెవ్వరిప్రేమనుంతయున్
కాదనకుండనుండె। నిల్వగను। కామినినామనసంతనెందుకో
ఏదరినుండకుండగను। నింగినిస్వేచ్ఛతో। పర్వులెత్తగా
నాదుమనంబుగోరె మదినావశమందున నుండకుండగా 502

చం॥ అనవిని శాంతమౌస్వరము। నందగ కన్నగియిట్లు। బల్కెదా
గావనగునే భయంబుమది। గూడదునిట్టిది। మామగారునున్
జనగను స్వర్గలోకమును। చక్కగ మీరిటులై తిరయ్యోయో
అనియన కోపముండునట। యన్నిపనుల్నిట సక్రమంబుగా
503

మ॥ వదలన్నోపికను జేయుచుంటిగద। వ్యాపారంబును। నీవడనే
మదిశిష్టాచరణంబునిక్కముగ। భామాయిన్నియున్జేసినన్
మదిలోనేను। ససహ్యామున్గొనుచు। నేమానంగలేకుంటి గా
ఇదియేనామనమందు। నుండునది। యెంతిస్వేచ్ఛనున్గోరెడిన్
504

గీ॥ వినియు కన్నగీసతియిటు। లనియెవేగ
యిట్టియాలోచనంబును। నేనుజేయ
నాదుజీవితసర్వస్వం మిందుమీదు
యోచునుండంగ। కొరతయే।మోచునుండు 505

ఉ॥ నామనసంత వక్రముగ। నాతిజనంగనుగోరు। నీదునౌ
నామహనీయరూపమది। యచ్చుగవచ్చియు। నిల్చుచుండగా
ఏమనగావలెన్నపుడు। వింతటిభీషణ విజ్వరంబునున్
భామరో పొంగుపాలపయి।బడ్డ।జలంబునణంగునట్లుగా 506

ఆ।వె। అణగిపోవజూడ। యచ్చెరువయ్యెను
నీప్రభావమింత। నేమెయనుచు
అనగనామె। భర్తయందకు జేరియు
భుజముమీదజేయి। బూన్చియనియె 507

గీ॥ మంత్రతంత్రంబు లెరుగను। మహితమైన
నీదు ప్రేమయు తప్పించి। నేను వేరె
ఏమియెరుగను సంచని। యెంతోచనువు
గల్గగయుమాయకతనుండ। కాంత బల్కె 508

ఉ॥ మాయలుమంత్రమ క్షణము। మాత్రమునిల్చెడు।నీ సుశీల మే
మాయక।యింతగర్వమును।మాయని నేనును నీదుముంగిటన్
ద్రోయగలేక।మక్కువతో।తొయ్యలిసిల్చితి నీవునన్ననున్
జాయవునైన మించితివి। చానరొ। నొక్కకతూరి కోపమా
509

చం॥ అనవిని కన్నగీసతియు। నాతనివాక్కుల। విన్నయంత నే
వణకెను। నాకసంబునను। వర్థితెనా మెరుపుల్దిశాంతముల్
జనియెను। దాపియొక్కతెయు।జయ్యనవచ్చియు। దూతనొక్కడున్
గనుగొన వచ్చియుండెనని। కాంతునితోనటజెప్పె వేగమే
510

గీ॥ ఇపుడు జూడగజాలను। యేను ననుచు
పైగజేసెను। నదియుమ। చానగని యు
ఏమిపనిమీద। వచ్చెనో। యేరుపంప
దూతజూడక పంపుట। నీతిగాదు 511

కం॥ అనవుడు రమ్మని యనగను
గనిదాసియు। గానుపించు। ఘనమగుపడవన్
గనపడె। రాచపుకార్యము
గొనివచ్చెను। మీతొవేరె। గూడగనతడున్ 512

ఉ॥ కన్నగి! మోదముప్పొలుపగా। నతదేమియు। యిష్టమూనకన్
తిన్నగనిచ్చెఃద్దిగియు। దేవతితోడను గూడియుండు। నా
వన్నెలు।చిన్నెలుస్తరిగి। వర్తిలు మాధవియుండు నావనున్
కన్నులగానటోయె। విధిగాదననెవ్వరికౌను భూమినిన్ 513

గీ॥ దండమునుబెట్టి। వేగంబ। దాదులంత
తెరలువేలాడు చోటికి। నరుగజేసి
తెరలుతొలగించి। చూడంగ। తెరలమధ్య
మంచమందున బడియుండు। మాధవిగనె 514

ఉ॥ కన్నులనమ్మలేక. యట। కాళ్ళకదన్నడి। యేడ్చుదాసినిన్
కన్నులగాంచె। పాదముల ఘట్టిగనాహృదయంబుజేర్చియున్
గ్రన్ననవచ్చుకోవలుని।గాంచియురోదనమెక్కువౌచు యీ
అన్నులమిన్నజీవముల।నందదుతావిషయమంత గ్రోలుటన్
515

గీ॥ అనుచు పెద్దగ శోకింప। గనియుదాని
తెచ్చుకొన్న నిగ్రహమంత। తీరిపోవ
నిలువలేకను నాతడు। నిలువలేక
మాధవీయని యరచియు। మహినివ్రాలె 516

ఉ॥ అంతకు నంతకున్నచట। నాపెనుగాలులు హెచ్చె। నోడకున్
అంతకుముందునుండు। నలనావకు మధ్యను। నంధకారమున్
ఎంతకుగానరానియటు। హెచ్చెను। గాలికితాళలేకనున్
సుంతయు నావయున్నిలువ। జూడగరాకనుదూరమయ్యెగా 517

కం॥ చెరియొకపైపుకు బోయెను
మెరుపులు నటనిలువకుండ। మెఱయుచునుండెన్
వరలెడు దానిని కన్నగి
యరపియు। నాప్రాణమదియు। నరిగెను చెలియా 518

వ॥ అనియొక్క పెనుకేకవైచె। యామెహృదయంబు।
ఝంఝూమారుత తాడికసాగరంబురీతి। యల్లకల్లోలంబయ్యె 519

కం॥ కావేరి తీరమందున
యా వెలసిన। నొక్క గ్రామమందునజేరెన్
ఆవెలదికియు పచారము
లా వేళను జేసి। యతడు। నామెను బొందెన్ 520

గీ॥ విరహమందిన వెనుకను। వీరువారు
కలయుటయ। యెంతయో। యిక. కలనుగూడ
వీడరాదంచు। ప్రతినలు। వేగవారు
జేసికొనిరంత। వారలు। చిరమునుండ 521

ఆ।వె। నాగరత్న విడక। సాగించె సేవలు
బహుమతులనునెన్నొ। బడసెనామె
పగలురేయి। యనెడు। నెగడొందు భేదంబు
తెలియకుండవారు। మెలగిరందు 522

కం॥ పూర్వపు సంతోషంబు। ల
పూర్వములై నట్టివాని। బొందెనునతడున్
సర్వము వ్యాపారంబుల
నుర్విని ధనధాన్యచయము। లున్ననుమరచెన్ 523

మ॥ తనబుద్ధిన్బొరపాటునన్పదగు। నంతన్నా మహాశ్రేష్ఠినిన్
గొనడంచున్మరిపన్న పేరుగొనక। న్బోర్కెల్లనటన్దీరగా
గొనియాడన్నట।తన్నగిసతిని।తాకోపించె।నా(మాధవిన్)వేశ్యయున్
జనరోజుల్లట। భార్యయానతిని। సచ్చారిత్రగాంచంగనౌ 524

గీ॥ అనుచుమాధవి పోర్వెట్ట। యతడుపోవ
ప్రతినజేసెను। పోవగ। వచ్చువేళ
భయము పీడించె। యడుగునుబడగలేదు
శ్రేష్ఠి। లోకంబు జూచియు। జేరెభయము 525

కం॥ చివరకు మాధవి కొరకై
యవిరళ భయమంత వదలి। యాతడుబోవన్
భువిబోవుచునతడను కొనె
యెవరేనియు భయముగూర్ప। యేగతిబోలున్ 526

గీ॥ నేనుబానిసగాదెట। నిక్కముగను
వారుజెప్పినరీతిగ। జేరినడువ
ఏలనాకిందు। నొక్కడనేలబోవ
నీవునావెంట రమ్మంక। నిశ్చయంబు 527

చం॥ అనుచును బల్కుచున్నపుడె। యామెనుతోడ్కొని పట్టణంబునన్
జనియును। వెల్లినాధునట। చాలత్వరనప్పిలిపించి। యాతడున్
మునుజరిగున్న లెఖ్ఖలను। పూర్తిగజూచియు, మామచేతనుగా
గొనుచును నున్నవానినటు। గొబ్బునవానిని। సుతలేకనున్ 528

వ॥ అన్నివ్యాపార యొప్పందంబుల రద్దుజేసి। మాధవితో
గూడి వేరుగృహంబున నివసించుచుండె 529

ఆ।వె। వెల్లినాధుగాంచి। వేగంబనీవును
పన్నశ్రేష్ఠియమ్మ- వనముమరల
గొనియు। రమ్ము వేగ- యనగను। చిత్తంబు
నంచు వెల్లినాధుదరిగియంత 530

మ॥ మరురోజాతడు వచ్చి,యవ్వనము నీమాటక్రయంచిచ్చియున్
కరమున్గోటినటంచు। నాడియును। నిక్కంబైనయా లెఖ్ఖలన్
సరిగానుండిన। వాటినన్నియును। నిశ్శంకన్నటన్నిచ్చియున్
వరమౌతాళపుగుత్తులన్నచట। విభ్రాంతుడునై। శ్రేష్ఠియున్ 531

గీ॥ చూడనుంచియు। వయసది। నేడునింక
చేయలేనంతవచ్చెను। చిత్తమింక
దైవచింతనజేయుచు తరుగుకాల
మింకగడుపంగ। గోరియు। నిచ్చినాడ 532

చం॥ అనియను వేల్లినాధు। పలుకాతడు। ఖండనజేసి। యిట్లనెన్
అనియెడుముందునీవు। నిటుచక్కగ నీగతిపల్కలేదు। కా
వున। నిటనీకు। దైవమున బుట్టుకవచ్చెనె భక్తియిప్పుడే
అనియన।వేల్లినాధుడును। నయ్య।నిజంబగునీదుమాటయున్
533

కం॥ ఐదుతరంబుల నుండియు
మీదైనటువంటియుప్పు। మేమును తినుచున్
మీదు ప్రతిష్టకు. భంగము
యేదైనను। జేయకుండ। యిప్పటిదాకన్ 534

గీ॥ వారు మేమును గలసియే। పాటుబడియు
నిల్పినారము నేటికి నేనునిట్లు
చెప్పవలసియు వచ్చెను జెప్పరాదు
ననుచు కన్నులనీరును। గొనుచునతడు 535

కం॥ క్షణమటులాగియు నతడును
దినదినమును, వృద్ధిజెందు, దివ్యపులక్ష్మిన్
గొనియెటు నాచేతులతో
నని, మరిమాటయునురాక, నతడటనుండన్ 536

వ॥ కోవలుండు, నాతనింగనినట్లు మాటరాక సిలిపితిరే,
తరువాతిదానిఁ పూర్తి జేయుండన, వేల్లినాధుండు 537

గీ॥ చపలురాలని, లక్ష్మికి, చంచలయని
కడుప్రసిద్ధియునంచనా నుడువుచంద్రు
ఇపుడు లక్ష్మిపతియె, వదలియింటినుండి
వెలుపలకువచ్చె, లక్ష్మికి గలదెచోటు 538

సీ॥ వేల్లినాధుడుజేయు, హెచ్చరికనువిని
కలగుండు వడియును, కరమునతడు
మదిలోనవిద్రించు, నదియును మేల్కొన
కొద్దిస్పృహకెనందు, కోపమూని
పిచ్చివానివోలె, విస్మృతి తెలిసిన
యదిసహింపగలేని, యతడునెపుడు
మాధవిమత్తులో, మనుచునుండుటే
మంచిదంచునుతన, దెంచుచుండె

ఆ।వె। వీటికేదియైన- వేసినయద్దము
కోపమూనుదాని- నాపలేని
స్థితికివచ్చెనతడు। జెప్పెదునతనిని
జూచియిట్లువలికె- జోద్యమలర 539

గీ॥ శ్రేష్ఠిగారును। కన్నగి। జేరియిట్లు
జెప్పిపంపిరే। మీరును జేరకున్న
నేనును। దివాళదీయుట। నిక్కమనుచు
తలచియుందురు। దానినితప్పుజేతు 540

కం॥ మీమది యిష్టములేనిచో
నేమియుబలవంతమిందు। నెందుకునుండున్
మామది యిష్టములేదని
యామాటయునేనుజెప్ప। ననియెనునతడున్ 541

గీ॥ కార్యవాహుండు। వృద్ధుడు। ఘట్టివాడు
కోవలుని పిదెనంచను। భావమంత
పురినినిండెను। ప్రజలంత తరచితరచి
జెప్పుకొను చుండిరదియంత। చిత్రముగను 542

ఉ॥ కోవలుడింటినిన్గొనగ, గోరకభార్యను, గౌరవంబునన్
ఏవిధితానుబొందగను, నింతతలంపక, వేశ్యభామనే
కావలెనంచు, నుండగను, కామినివేశ్యయు, వానిలోగొనన్
తావహియించె, వేషమది, తప్పకరోజునకొక్కరీతిగా 543

సీ॥ ఉత్సవంబనిజెప్పు- నొకరోజునింతియు
వ్రతమని నొకరోజు- వనితబలుకు
ప్రతికక్షిలందర- పనివడిపిలిపించి
కానుకలిచ్చియు- కాంతబంపు
రాజమ్మకూతురు- రమణియౌలలితయు
కూర్మిస్నేహితులయి- గూడియుండె
ఆమెతోగూడియు- నతిసనిహాస్యంబు
పట్టించుచుండిరి- ప్రతిదినంబు

గీ॥ అట్టినెపమూని, బహుమతులట్టి గొనిరి
నగరమందున శ్రేష్ఠులు, సగటుతోడ
వారి వుంపుడుగత్తెల బంపినారు
పనులజేయించుకొనిరట, పలువిధముల 544

కం॥ లంచములెన్నియొ మాధవి
గొంచును ధనమంతజేర్చి। గొనరానియటుల్
మించిన వేశ్యను వెంటను
గొంచున। బాహ్వాళికేగె। కోవలుడుతగన్ 545

ఆ।వె। ఇనునికాంతిగూడి। ఘనకన్య లెంతయో
మెఱసిపోవుచుండె। మించియవ్వి
నేనుమిమ్ముబొంద। నిక్కంబునామది
యాశ్లెమెరయుచుండె ననుదినంబు 546

చం॥ అదివినిపించనట్లె యటయాతడు। సృష్టిలోచిత్రచిత్రముల్
వదలకయెన్నొగూడుగద। మాధవి। నీవు। విసంబుమ్రింగగా
వదిలియునిన్నునావిసము।పట్టియునాయభిజాత్యమంతనున్
విదిలిచిజంపివై చెనిట। పీడక తన్నగి శీలముండినన్ 547

వ॥ అదియెంత మాత్రము నన్నుగౌరవభాజనునిగా నిలుపలేక
పోయెగదా! 548

గీ॥ ఆవిసమె చారలిట్టుల। నంతగట్టి
గానుపించెడు। సంధ్యను గావలెనని
పలుక। మాసిపోయిన। శక్తి। పట్టుబట్టి
వెలుగుజూపిన కరణిని। పీడకుండె 549

చం। చెదరినమానసంబు।నటుజేర్చెడు సూత్రమురీతి।సంధ్యయున్
వదలకనాకసంబునను। ప్రాద్దిశనుండియు। పశ్చిమాశకున్
కదిలెడునట్లు తోపగను। కాలుగదల్పగ నందెసిల్పియున్
మదిబరువెక్కుదృశ్యమును।మానకజూచుచునుండె నింటిలో
550

కం॥ దేవంతి ప్రక్కనేయట
యా వేదనతోటి। మఱుగుదనవయగ। గనుచున్
ఆవనితయుండె। క్షణమట
పోవగగూర్చుండెనామె। బొందియువనటన్ 551

ఆ।వె। గొంతుపూడిపోయె। గూడగకన్నీళ్ళు
దాసియున్నదంచు। తలపకుండ
అస్తమించునినుని। కాంతినిదొంగలి
మబ్బులన్నిమురిసె। మానకుండ 552

గీ॥ గడచిపోయిన కాలంబు। విడువకుండ
హృదయమందున। సాయంత్రమది యునిండి
యుండె తలచినహృదయంబు నూడునట్లు
ననినదేవంతి। మదిలోన। రగిలెయగ్ని 553

వ॥ అదివిన్న దేవంతి। విచారభారావనతయై। నిట్టూర్పు
నిగుడించి సంధ్యాసమయంబు నొక్కచేగాని। యొకరియా
నందంబు - మరియొకచోట యందించుచుండుగదా? 554

ఉ॥ ఇక్కడ మానసంబునను। నెందుకుగూర్చుడు।సంతసంబునున్
అక్కడ నాదుభర్తగొనగా। సుఖమయ్యెది। నాదిగాదొకో
అక్కజమంద। కన్నగియు। నాడగనిట్లు। బహూకృతివ్వగా
నక్కడ జేరునట్లు। పరిచారకులొక్కరి వెన్ననొక్కరున్ 555

ఆ।వె। పరుగులెత్తివచ్చి। వారునురొప్పుచు
కోవలుండు నిన్నుగోరివచ్చె
అనుచు జెప్పి। రందునారుమాసములయ్యె
నగరమందుజొచ్చె। ననుచువారు 556

ఉ॥ ఇప్పటికిన్మనంబునను। నింటికి బోవగబుద్ధిపుట్టగా
అప్పుడువచ్చు కోవలుని। రాకనుఖించును। నామెవెంటనే
చప్పునగుండెయంతయును। జారగగూడగదీసియా మెయున్
ఎప్పటివోలెమారియును। నింటికివచ్చెడు వానిరీతిగా 557

కం॥ మనమున తలచియుకన్నగి
వినయమునను లేచినిల్చి, పిరికియునగుచున్
మనియెదు సీరుని పగిదిని
గనవచ్చెదువానివోలె, గ్రక్కునసటకున్ 558

ఉ॥ మాయలు కృత్రిమంబులును, మాధవిజూపగ, కోవలుండునున్
హేయమునైనదంచు, మదియెంతొతలంచియు, శాంతిగోరియున్
జాయనుజేరవచ్చెత్వర, చాలభయాకులచిత్తయుక్తుడై
మాయగలేనిభీతియది, మాయనిగాయమురీతిసల్పగా 559

కం॥ జేరగనేనటు కన్నగి
యారసినను కోపమూను, నాటిడనుండన్
జేరియు, బ్రతిమాలియునే
కోరికదీరంగమదిని, గూడెదుముదమున్ 560

గీ॥ ఆమె కోపంబు బోవంగనందు నేను
యెట్టియత్నంబు జేయంగనేల, వలదు
అల్పసంతోషియామెయు, ననపరాధ
దేవలతలతోడ సాటియౌదివ్యవనిత 561

కం॥ అనియెడు వ్యూహాలుదారికి
గొనకనునటమున్నె। యందు। గూరిమితోడన్
గనబడె। కన్నాగిముఖమున
గననీక వికారమేమి। గనియుననామెన్ 562

ఆ।వె। మనసులోనిభావ। మంతయుపోనాడి
స్థిమితపడగలేక। జేరియందు
కోవలుండుతానె। గూర్చుండె। గంధపు
పట్టెమంచమందు। నట్టెనతడు 563

చం॥ చక్కనిదారు శిల్పములు। చక్కనిబంగరు। కోళ్లనుండగా
అక్కడహంసతూలికల। తల్పమునందున। యందమొప్పగా
చెక్కియునున్నతీవెలను।చిక్కనిపుష్పసముచ్చయంబులన్
అక్కడెగోడయందున।నమర్చిన।గూటిలోవిగ్రహంబునున్ 5?4

కం॥ మెరయుచు గనుపించెనునట
వరలెడు నాపీటమీద। ప్రవిమలగంధం
బురుతర పుష్పంబులతో
వరలుచునందుండెశోభ। బడయుచునందున్ 565

గీ॥ ఉద్యమందున వ్రేలాడె, గూర్మిమించు
స్వర్ణవీణెయు, చిత్రముల్చక్కగీయు
పరికరంబులు, నచ్చోటవరలుచుండె
పరుపుమెత్తలు, క్రిందుగపాచికలును 566

కం॥ హేళన కైనను, దేవతి
యాలలనయు మాధవి, యట, యనియెడుననుచున్
చెలినటు, వెలుపలకంపెను
చెలులను మరిలేకపంపె, చేడియ యంతన్ 567

కం॥ పాదము లొత్తుచు కన్నగి
సేదయునటదీర వంత, చేడియనతడున్
తాదరిలేకను నుండగ
యేదైనను జరిపె, దానియింతయుపోకన్ 568

ఉ॥ పెంచునెమళ్ల పిల్లలను, వెట్టెను, పంటలుపుష్పలంబుగా
అంచనలన్ని మించగను, నందెనుచేతికి, ముందునెన్నదేన్
మించగసిట్లురాలదనె, మీకనివుత్తమ పట్టువస్త్రమున్
ఎంచియుతెచ్చె, వస్త్రముల, శిల్పులు, స్వర్ణముతోడజేసియున్ 569

ఆ॥వె॥ మిశ్రభారతీయ। మిళితంబులౌచును
శిల్పములను। నందుజేర్చియతడు
మిశ్రవాసుడిందు। మీకనియుంగర
మిచ్చినాడు। నంచునింతిజెప్పె 570

గీ॥ సఖులవ్యాపార। విషయంబు। సర్వమందు
సేవకుల। వారివలనను జేరుచున్న
సర్వవిషయంబు లెరిగించె చానయామె
తంద్రిమాటయు। మాధవిదైనమాట 571

కం॥ సుంతయునెత్తక యామెయు
పంతంబున। వేల్లినాధు। దరిగినవెంటన్
ఎంతయు నష్టమువచ్చిన
యింతైనను తెలియజేయ దింతియునచటన్ 572

మ॥ తనచేజేసిన। సాపరాధమునకు। న్తన్వంగిచే దండనం
బును। పొందంగను। వచ్చియుండుకతన। న్బుద్ధిన్ప్రవర్తిల్లునున్
ఘనమై। యుండగ। తల్లక్రిందులగుచున్గన్పట్ట। గాదానినిన్
గనియెనోటను। నద్దితిన్నగను। నకాంతన్గననోకపమై 573

వ॥ మించుచు-డె- 574

కం॥ కోపము జూపియు। నలిగిన
యాపడతిని క్షమయుగోరి। యామెతోగడుపన్
తాపడసిన యయ్యాదినీట
యేపనిచేయకనుటోయె। యింతయుగూడన్ 575

గీ॥ తనపరాజయమంతయు। తానెగొనియు
నింతకాలంబు। నేనింట యింతిలేక
తిరిగినాడను। యెక్కడో। తిరిగి తిరిగి
నిన్నుతలపక యుంటినే। నీవునిపుడు 576

కం॥ ఎచ్చటికేగి తివీవును
నిచ్చటననువీడి నేగ। యెంతయుమేలా
అచ్చము నడుగవు నీవును
కచ్చయు నింతైనలేదె। కళ్యాణముఖి 577

ఆ।వె। అతనిమాటవినియు। క్షణమటులుండియు
మీరునేమిజేయ। మేలునాకు
గలుగునంచుతలతు। నలఘుడు దేవుడు
సుఖములిచ్చు మీకుజోద్యమేమి 588

కం॥ కన్నగిశాంత స్వభావము
కన్నారగగాంచి, కోపకంపితుడగుచున్
నిన్నను పాషాణంబుగ
కన్నగినేదలచువాడ, కరమటునీకు౯ 579

గీ॥ ఇన్నిదినములు, నేనును నెక్కడుంటి
నద్దితెలియదా? బాధనునందలేద
అన్న, గృహమందునుండెదు, వారినెల్ల
యెరుగుచుంటయు గృహిణికి, నెప్పుడుండు 580

గీ॥ మఱియునిందించవేమిటి, మహినినీవు
మాటకైనను, ననగను, మానినియనె
విజ్ఞులెప్పుడు నెరిగియే, విడువకుండ
పనులుజేతురు, నిందింపవలెనెనేను 581

గీ॥ నేనుజేసెది పనులన్ని, నిక్కవముగ
నాదువిజ్ఞత యెరిగించు నట్టిదేన
అనుచు రెట్టింప, కన్నగియమితశాంత
స్వరముతోడుత, కావనివనితబలికె 582

చం॥ మణియును నేను జేయుపని। మంచిదిగాదనినీవు నన్ననున్
ధరణినియడ్డుపెట్టకను। తప్పితినేలనటన్న। నామెయున్
వరదులుమీరుముందుగను। బాగనిచెడ్డని। చెప్పునాజ్ఞనున్
వరముగనిచ్చియున్న। నటుబల్కగవచ్చును। నాజ్ఞలేదుగా- 583

చం॥ అతితమ ప్రేమయున్గొనియు।నత్యధికంబుగ। నిన్నుగోరుచున్
మతినిడి। నేనుజేయుపని। మానుమటంచని కోపమూనినన్
అతివరొనేదుకాళ్ళబడి। నన్ను క్షమించుమటంచు। వేడియున్
అతియగుపాపమున్దరను। బాయగనుందుగ దాక్రమంబునన్ 584

కం॥ కన్నగి నేత్రంబులునట
యెన్నగలేకుండజలము। యెంతయుగ్రమ్మెన్
అన్నెలతస్థిమితపడియును।
గ్రన్ననిటు వల్కెవేగ। కాంతునితోడన్ 585

సీ॥ దాసీజనులదుఃఖ- ధారణగూర్చియు
ప్రశ్నింపగూడదు- ప్రభువులకును
మీదుఃఖమంతయు- నాదుఃఖముగబూన
తల్లిదండ్రులునాకు- తగినయట్టి

సంస్కారమిందున- సమకూర్చియుండిరి
నననును కన్నగియనగనతడు
అటులైనసీవును। నట్లెభావించుచు
నింటనేపడియుండు నింతినీవు

గీ॥ నీతినియమంబులన్నియు। నిట్టెదుల్చి
యీసుఖంబుల। కింతము నెచటగలదొ
నేనుజూచెదనంచును। నిర్భయముగ
వికటముగనవ్వ। గదియంత వేగ్రగమ్మె 586

ఉ॥ కన్నులు నప్పగించియును। కాదనలేకను। నవ్వుజూచుచున్
కన్నగిభావమందు। సుడిగట్టెడు। దుఃఖము నిల్వగలేకనున్
మున్నుగ। ఘోరవాతగతి। మూలముతోడుత లేచితీ। వెయున్
ఛిన్నముగాని చెట్టునటజేరియు చుట్టినరీతి నామెయున్ 587

గీ॥ కోవలుని హృదయంబును। కోమలియును
వేగబరువెత్తి హత్తుకవిడువకుండె
చాలకాలంబుగడువగ। చానస్పర్శ
యందుమధురానుభూతిని। యందజేనె 588

గీ॥ మనసులోపల డాగియు। మసలునద్ది
నగ్నసత్యంబు నాత్మను। నట్టెతట్టి
ఆక్షణంబున। యేశక్తియైనగాని
బంధనంబును విడదీయ। వలనుబడునె 589

గీ॥ హృదయమందున తలవాల్చి। వదలకుండ
యశ్రుజలముల। నురమును। నామెతడిపె
ఆమెకన్నీరు తుడిచియు। నందుమీద
తన్మయత్వంబుతోడుత। తానుబలికె। 590

మ॥ ననురప్పింపగ। తావిసంబుగొనె। చానా। వేశ్యయున్మాయతో
గొను। నాదుర్మిషమంత। ప్రాణముల పోగొట్టన్సమర్ధంబుగా
దను।వాక్కుల్మది।నేనెరింగియు। నీటన్తత్కామమోహాబ్ధిలో
గనలేకుంటిని యొద్దు। నేమికతమో। కాంతామహాశ్చర్యమౌ
591

కం॥ వెలయాలు। కులటయదియును
కలవటమంత్రాలు। మాయ। కానియునిజమౌ
తలచిన దానిని వివశత
గలిగెడునను। నర్ధమింత। గాంచుమునీవున్ 592

కం॥ నేరము జేసినవారిని
యారయనటుజేసినట్లు। నధికముగాగన్
నేరను। జీలఁచునుంటిని
ఘోరమునగు శిక్షనేను। గుడుచుచునుంటిన్ 593

గీ॥ మాయతోగూడు ప్రేమను। మాధవిగొనె
యతితమంబగు। ప్రేమంబు। నందునిన్ను
గోరుచున్నాను। మిమ్ముల। వేరుగాక
యెట్టియాకర్షణంబును। నేనుగొనెదొ 594

ఉ॥ నాదగుజీవితంబును। ననాశ్రయమై। తనరారుచుండు। నా
మీదగు। నాకసంబు। నటుమేల్గొనపోవగలేక। భూమినిన్
నేదగురీతిచేరగను। నిందుననేరక। మధ్యమందునన్
ఏదరిలేనిపక్షిగతి। యిట్టులబోవుచునుంటి కన్నగి 595

వ॥ అని కోవలుండువలుక దానికి సమాదానంబుగా। కన్నగి
ప్రాణేశ్వరుని హృదయంబున హత్తుకొనియె- 596

కం। కన్నగితోడను గూడియు
మున్నటుగతియించెనిద్ది। పూర్తిగవిడకన్
తిన్నగరోజులు నెట్టుచు
నున్నను। కన్నగియుభర్త। యొందగముదమున్ 597

గీ॥ బహుమలు నెన్ని యోనట। పంపుచుండె
వేశ్యకడకును। కన్నెగి। విడువకుండ
కోవలునకద్ది। ముదమును। గూర్చెగాని
శ్రేష్ఠితోడను। మాట్లాడజేరలేక 598

వ॥ సిగ్గునయెదురువడలేక। యున్నయల్లునితోడఁ గలియక
మహాశ్రేష్ఠి తనపనులుతాను నిర్వర్తించుకొనుచుండె 599

చం॥ మునుపటియంత।యుత్సుకత।పూనగలేకనుటోయె।కార్యమున్
గొనియెడునప్పుడున్నయిన। గూడినరోజులు। టోపుచుండగా
అనుకొనిరంత కోవలుడు। నంతయుతావిడనాడి। కార్యముల్
అనువుగజేయుచుండెనని। యప్పుడె మాధవి। గర్భమూనగా
600

గీ॥ అదియు వినియును। కోవలు। హృదయమంత
స్తిమితమును। గోలుపోయెను। జేరెపన్న
అట్టిసమయంబునందున। యరుగుదెంచి
పాతకక్షలవిడనాడి। పన్నవేగ 601

ఆ।వె। కుశలమడిగివేగ। గూడియు పెరియను
మధురగొనుచు। టోడు। మానినియవి
తెలిపెవిందులెన్నొ పలుపంగ పన్నయు
కోలుకొనెడునంచు। కోరివలుక 602

గీ॥ మామపేర్విన్న। కోఁదంబు। మదిని పెరిగ
దానితోడుత। వ్యాపారధ్యానమంత
బెదరిక్రిఁదుమీదుగజేసె। చిత్తమందు
శ్రేష్ఠిగారినిగాంచంగ। సిగ్గునందె 603

ఉ॥ కన్నగి మాధవిన్సమముగా గను చుండుట స్థైర్యభావమున్
మున్నుగపొందినన్గృహము। మోదముమించెడి। గౌరవంబునున్
కన్నగితండ్రి। తండ్రి। మరిగాదివృత్తియు। వేల్లినాధుడున్
క్రన్నన మానసంబునను। గారియ పెట్టెడి। వీడకుండగా 604

కం॥ ఇద్దరు యువతుల మోహము
పెద్దగనయి। వ్యావహార మెంతయు చెడగా
పెద్దలు మామయు। మంత్రియు
తుద్దునలేకుండబో। గూడెను చెరుపున్ 605

గీ॥ వ్యాకులంబును। నొందియు। వ్యావహార
మంతచెడిపోవ। మాదుపై- పగయు పెరుగ
పెరియపన్నయు। దానిగాని పెంచియగ్ని
యాజ్యమునుపోసినట్టుల। యమరజేసె 606

చం॥ కొలది దినంబులట్లుచన। కోరికదీరెడునట్లు పన్నయున్
తొలి। తనవైభవంబుగొనె। తొయ్యలిమాధవి। తల్లిగాగ। తా
వెలిగియు। తారరాలుగతి। పీడకికోవలు। నెల్లవారునున్
వెలయిడి। కొన్ననాతిగగు। వేశ్యకు సంతతినిచ్చె నంచునున్
607

ఆ।వె। పదుగురారుమాట వదలక కోవలు
డందు హాస్యభరితుడయ్యెనందు
శ్రేష్ఠికన్నతాను। జేసెను మిన్నగ
బారసాలయందు। పన్నశ్రేష్ఠి 608

కం॥ కన్నగిం మాధవి బిడ్డకు
నెన్నగ రాసట్టి। వాని యింటికిపంపెన్
సన్నుతిజేయగ కాన్కలు
నన్నెలపున। యున్నవారు। నాశ్చర్యపడన్ 609

మ॥ వెలయాలిస్మృదమంత। నింపగనుః। నవ్వేళన్నుతన్గన్న। యా
వెలయాలప్పుడు। కోవలున్గనగ। తావేగంబుగా వచ్చియున్
వెలయన్నిగ్గును। చేరునామె। గనగా। వీక్షించి। నాభామయున్
వెలయించెన్గద। పితృభావమును। నీవేయిప్పుడు। స్వీడకన్
610

గీ॥ సుతనుయిచ్చిన। తల్లియు। శోభతనర
నీవు కళ్యాణమంజీర। నికరములను
తెచ్చియివ్వగగోరగ। యిచ్చుటకిని
వచ్చినానన। నవ్వేను। ప్రణలముగను 611

కం॥ వెలయిది। మోహము తీరగ
మెలగెడి। వాడెట్టులౌను। మేలగుపితయున్
ఇలలో దానికి సంతతి
గలిగిన। గౌరవమునెంతొ। కామినివింటే 612

వ॥ అట్టిబిడ్డకు కళ్యాణమంజీరంబులు। ధరించుయోగ్యత యెక్కడ నుండి వచ్చు తండ్రియు దానికి తండ్రి గానేరదు- 613

కం॥ అనవిని। మాధవి క్రుంగియు
మనమును। నటగూడదీసి। మాననియనియెన్
గొనకిది। హాస్యము కొరకై
వినిచితి ననకోవలుండు। వినియును। ననియెన్ 614

గీ॥ దానినెఱిగియు। గెలువంగ। దారిలేని
వాడునయ్యును। నిటులను। బలికెనతడు
నవ్వులాటకా। యిట్లాడ। హావ్వయింక
కోవలుని కోశమందున। గూడియుండె 615

చం॥ ధనమును। వజ్రముల్మణులు। తప్పతనయ్యవిబాయకుండగా
నను నిటనుండుదాకకద। నన్నును బాయవునంచు నవ్వునున్
గొనియును।నవ్వ।నాగృహము గూఢముగాగను నిండెదానినిన్
వినియును। వేశ్యకాంతకట। వెల్లనబోయెను। మోమునంతయున్ 616

గీ॥ దేశదేశాల మార్గోగు। దివ్యమైన
కోవలుని వ్యాపారమునట। కోరితెచ్చు
కొన్నపన్నయే। మాసాత్తు। గూర్చెనెనట
యాసనంబున పన్నయే। యధివసించె 617

కం॥ వ్యాపారభారమంతయు
నాపన్నాశ్రేష్ఠిగారి। యనుయాయులు తా
ఏపుగగైకొని రందున
యాపన్నయెనడుపుచుండె। వ్యాపారంబున్ 618

గీ॥ అంతిపురియందు మేడల, నంతపన్న
యనుచరులు నిండిపోయిరి, పాతవారు
ఒకరుయిద్దరు మాత్రమే యుండిరందు
వారు కన్నగి దూషించి, భవనమందు 619

ఆ,వె, నిధులున్నచోటు విధిగనునెరిగియు
నదియువేగమేగి, యద్దివేశ్య
కంతతెలుపవారు, నంతట కోవలు
పేరుమీద యాజ్ఞ పెట్టివేగ 620

గీ॥ అదియుమాధవిజేరెడు, నన్నియింట్లు
వెండిబంగారుతోడను నిండియుండు
నవ్వివెలవెల బోయెను, నద్దిగనియు
వెలది దేవంతియోర్వక, మెలగుచున్న 621

కం॥ దీపారాధన మాత్రము
నాపదు, జేయుటయునింత, యాగృహమందున్
ఆపయి మంజీరనాదము
లేవనివడి వినబడునటు, నెంతయువిడకన్ 622

సీ॥ ఒకరోజు దేవంతి- యురుగుచు కన్నగి
యున్నచోటుకువచ్చి- యోర్వలేక
కోపంబుచేతను- గూడగశాంతని
నేసహింపనునిది- యింతగూడ
బంగారు, ధనమును, పట్టుకబోయిరి
కానియిపుడు మించి- ఘనపువంశ
కీర్తికి మచ్చను- పూర్తిగగలిగింప
బూనిరి దానిని- పొందనీను

గీ॥ మనప్రకోష్ఠంబునందున। మనెదువంశ
పట్టి బంగారుతోడుత। పనరునద్ది
మాయమైపోయె। యెందుకో మదినినెఱుగు
కోశమేమియు వృద్ధిని గొనదు। సుంత 623

వ॥ మఱియది యెప్పుడు యెందుకు దొంగిలించినారో।
యెరుగుదువాయన కన్నగి 624

ఆ।వె। వంశవృక్షమందు- బాగుగ మాధవి
కూతురుపేరు వ్రాయగోరి। వారు
దొంగిలించినారు। తొయ్యలి నిజమేన
యనగనదియుభ్రాంతి। నందియంత 625

చం॥ ఎవరదిచెప్పినారు, ఇది, మీరునెరింగిన యట్టియయ్యెగా
ఘవియన యెవ్వరిందునను, పూర్తిగ చెప్పగలేకపోయినన్
సునిధితమయ్యె, వంశమును, చొప్పడనిల్పగ, జన్మనిచ్చెగా
అవితథమైన!యామె మది, యక్కజమౌ,ఁబె, నేనెరుంగుటన్
626

కం॥ అని దేవంతిని కరమును
గొని, దగ్గరగజేర్చికొంచు, గూడగప్రీతిన్
అనె, యిటువంచన తోడను
గొని పాడియుతప్పియిట్లు, గూర్చెనునిచటన్ 627

మ॥ అన, దేవంతియుకోపమున్గొనియు, నమ్మా నేనునందేగియున్
గొనితెత్తున్న లపట్టకంబు, కులమున్గూడంగ,సత్కీర్తియున్
గొనరాదిట్టిదినేను, దాసినయినన్, గూర్మిన్సఖిత్వంబునే
గొనుదాన,న్మరిమీదుసొమ్ముతినియే గొంటిన్నిట సౌఖ్యముల్
628

చం॥ ఇదిసహింపలేనునన, యింతియు పంతమువట్టెదేలనే
ముదితరో!వంశకర్తయిటు,పూర్తిగయన్నిటయాధిపత్యమున్
వదలుకొనె, న్నికవమ్మనము, పట్టగతప్పులు, పిచ్చిదాన, నీ
కెదియిటహక్కు మాధవిని యెక్కనమాడగనేలనిందునున్
629

గీ॥ ఆమె నిట్టూర్పు విడిచియు। నంతయనియె
వంశపుంకీర్తి కెప్పుడు। బాధ్యులగును
ననగపురుషుండు నిక్కంబు। యయినసబబె
వంశమానునిల్ప। యాడదే। వసుధమిన్న 630

కం॥ సతియిటు లేకనువంశము
సతి। యేలాగునను। వృద్ధిచక్కగగల్గున్
గతినీవేయిక వంశము
నతిగౌరవమంద జేయునటులను జేమన్ 631

గీ॥ సభియు నిటులాడ నిట్టూర్పు। చానవదలి
పలికెనీరీతి। కన్నగిభాషణముల
అయిన మాధవియాడదే। యతివనీవు
నేనునెటులనో। యట్టిదే। యిందునామె 632

గీ॥ సరిసరియయిన। నింకను। వరలునేమి
నీదుకళ్యాణ మంజీరమింక నేల
అదియుగూడను గొనిపోయి। యామెపాద
ములకు కట్టియురమ్మింక। మోదమూను 633

గీ॥ మౌనమూనిన కన్నగి మౌనమంత
యొప్పుకొనినట్టిదేయని। యువిదవేగ
పరుగులెత్తెను। దేవంతి మాధవిదగు
భవనమును జేర। కోపంబు। వర్ధిలంగ 634

గీ॥ వేశ్యకన్యలతోగూడి। విడవకుండ
జూదమాడెడు। కోవలు। జోద్యపడుచు
మధువునిండిన పాత్రయే। వదలకుండ
ప్రక్కనేయుండె మాధవి। భవనమందు 635

ఉ॥ త్రాగుట జూదమాడుట। సతంబునువీడక। యన్యచింతనల్
తాగొనకుండ। కోవలుడు। తద్భవనంబున రేపవళ్ళునున్
ఆగతినుండ।మాధవియు।నంతయుద్రవ్యముగూర్చ యత్నమున్
ఏగతివీడకుండెనట। యింతియు దేవతివచ్చి యందునన్ 636

గీ॥ కోవలునిగాంచి। దండంబు గూర్చియందు
విలువదేవంతిజాడను। తెలసి వేశ్య
పరుగు పరుగున వచ్చియు। భామయంత
తనువు కోవలుతాకంగ। తానునిలచె 637

కం॥ దేవంతిని। కోవలుడట
భావమునను సెఱుగునట్లు। పరికించియుఁ తా
ఆ వెలదులతో జూదము
తా వెలిగించుచునునుండె। తరుణులునందున్ 638

వ॥ హాశ్యంబులయసందర్భపు ప్రసంగంబుల। మాధవి తోడం గూడి కోవలుండు జూదంబాడుచు। దేవంతివచ్చిన విషయంబు పట్టించుకొనకయున్న। నా దేవంతి కాళ్లుపీకుచున్నను కొంతవడినిలుచుండి ధైర్యంబుజేసికడకు దేవంతినీరీతిం బలకె 639

సీ॥ కులలక్ష్మి కన్నగి- లలితసౌభాగ్యంబు
నందినచేడియ నిందునన్న
శ్రేష్ఠిగారిది। వంశ. స్థిరప్రతిష్ఠకు। నిందు
సాక్షిగానన్నను। సతియునంపె
మీవద్ద న్యాయంబు। మేలందవేడంగ
స్వామియటంచును- చక్కబలుక
మాధవిముఖమును- మాటుపకజూచెను
పాచికలన్నియు బట్టిచేత

గీ॥ జూచె దేవంతి వైపున। జోద్యపడుచు
సరిగ గూర్చొని। యశ్లైన చాననన్ను
న్యాయమద్దింపబంపెనా। యనుచు నతడు
నింత కాలంబు గడువంగ। యిప్పటికిని 640

మ॥ ఇదె యర్థించెను।నామె నన్ను మొదట।న్ని న్నేండ్లుగా।చెప్పుమా
అదిజేతున్నన। కోవలుండు। వినియు। న్నా వేశ్యకోపంబునన్
మదిలోనున్నది।యేమెరుంగకయ।యీ మాడ్కి ప్రవర్తించి।నీ
మది।నన్యాయమునాకు గూర్పకల తే। మన్నింపవేయంచనన్
941

వ॥ దాని ప్రార్థనంబును లెక్కింపగ నాదేవంతి- 642

ఆ।వె। సహనశీలియామె, సతి। త్యాగరూపిణి
శ్రేష్ఠిగారివంశ స్థిరసుకీర్తి
చిరము నిలుపనిపుడు। జేరియున్యాయంబు
గోర ప్రార్థనంబు। గూర్చెస్వామి 643

వ॥ అనకోవలుండు। నీమదియందుగల కారణంబెరిగింపుమన
దేవంతి మహాశ్రేష్ఠి గారి గృహాభ్యంతరంబున విరాజిల్లు।
స్వర్ణ వంశవృక్షంబును నేరికి(తెలియక తెచ్చియున్నారు

స్వామీయన, మాధవియందుకొని యిందు వంశప్రతిష్ఠ జారుపనియేమి యున్నది, వంశవిభుండునిందే యుంటం జేసి, యాపట్టికయిందే వుండుట సమంజసంబనియని 644

సీ॥ తలయెత్తి భవనంబు- తానునునల్దిశల్
జూడంగభావంబు- చేడెయెరిగి
స్వరమును సరళంబు- చక్కజేసియు
పట్టికంబది- ధూళిబట్టియుండ
దానిని తెప్పించి- నేనును శుభ్రంబు
జేయంగ కంసాలిజేర్చినాను
అదియునుజేరంగ- నాపట్టికంబును
నిందుప్రతిష్ఠను నేనొనర్తు-

గీ॥ అనగవేశ్యాగృహంబున, యమునిజేరు
విటులకెల్లను, పిండంబు, పెట్టుచుంద్రు
బోలునంచును, బలుకంగ పొలతివినియు
కోపమూని యురెచ్చియు నాపయినిటు 645

కం॥ కోపము నాకసమంటగ
నాపడితియు। వేశ్యనేను। నగుదునె యనుచున్
చేపట్టను మంత్రంబుల
నాపదములు నగ్నిచుట్టు। నటుతిరుగవుగా 646

గీ॥ బూటకంబగు పనులేవి। పొందకుండ
యాత్మసాక్షిగ। వరియించి తెందువలన
నే కులవధువనౌదును। నిక్కువంబు
ననగ కోవలుడంతట యనియెనిట్లు 647

గీ। సాని, సంసారిగామది। తానెతలప
వచ్చు లోకంబుసానిగా। బలుకునుగద
నీదుతండ్రియు పన్నయు। నీదుతల్లి
ధర్మపత్నిగ తలచునే తనదుమదిని 648

గీ॥ వారి భావనవదలుడు। బడసితేను
మీదువలనను సంతతి। మించకోప
మంతపలుకంగ। కోవలుడందునిట్లు
వనియె। మణిమేఖలానామమందుజెక్క 649

వ॥ నాదు వంశవృక్షంబు తెప్పించితివి, కారణంబు తెలిసెయని
కోపలుండు పెద్దగానవ్వె 650

ఉ॥ పూనకమూను దానివలె, పొందితినేను పరాభవంబునున్
దానివి, తానెరింగినటు, తల్చిశివంగిని వోలె లేచియున్
గానగలేవె, వంశమున, గల్గువెలుగింక, నాదుకూతురే
బూనితి వంశవృక్షమున, పొందగజేయగ కూతురుపేరునున్
651

వ॥ అట్లునాసుత మణిమేఖలా నామంబు వంశపట్టికలో
లిఖింపబోయిన ప్రాణంబుల మీముందే వదలగలదాన-
652

సీ॥ తలవాల్చి దేవంతి- దానిని గమనించె
కోపలు మాధవి, గానెదురీతి
మాధవిజూచుచు- మాట్లాడకుండగ
గూర్చుండె నతడును, కొంతమదితో
మెదలగయోచించి- వదలక తడబాటు
ముఖమందు గన్పడె, మఃగుదకందు
నిట్టూర్పు నిగుడించి- పట్టగలజ్జయు
వాడంగముఖమంత, పలికెనిట్లు

గీ॥ నీదు ప్రాణంబు మీదను। నేను నేల
గొంటి మక్కువ। లోకాన గూడి నిన్ను
బహుళ దూరంబు వచ్చితి। వంశవృక్ష
మందు నీకూతురు పేరును। బొందుపరుతు 653

గీ॥ అనియు దేవంతి వంకను। గనియు నిట్లు
పలికె। పోవచ్చు। నీవింక పలుకు మిట్లు
నీతో గూడియు న్యాయంబు నీతియన్ని
విడచినాడంచు పలుకుము। పడతి యనియె 654

మ॥ ఘనమై వెల్గెడు శ్రేష్ఠిగారి కులము। న్గాంచంగ లేరై తిరే
అనగా కోవలుడిట్లు బల్కె,-నిజమే। నాసంస్కృతుల్ నన్నియున్
జనె। స్వల్పంబగు మాటకీ వెలదిని న్జంపంగ। నేఖడ్గమున్
గొనియుంటిన్నది కాలమయ్యెగద। జంకుస్దీరెగా దేవతీ
655

ఆ॥వె॥ దండమిడియు నంత। మెండగు వినయంబు
గల్గియున్న। దృఢము గల్గ బల్కె
స్వామి జెప్పుదంత। జనియును జెప్పుడు
వ్యక్తి కాకనికిద్ది- బడయగాడు 656

చం॥ కులమునకంతకున్నదియు, గూడుసమస్యయు, గాననేనునున్
ఇలయిట, యేకాలంబునకు, నింతిప్రతిష్ఠయుగల్గి, ప్రాణముల్
వెలయిడి యుంటి, దాని నిటవీగగజేయగ, నేనెదీనినిన్
కులపతి కన్నగీసతిని, గోరియు, గౌరవనీయుడౌచునున్
657

ఆ.వె. వెలుగుచోళరాజా, వేగమజేరియు
న్యాయమింత జరుప, యడుగుడాన
అనగ వినియునందు, నామాధవియుతేగ
సాంఘికంబునౌచు, జరుగునాద 658

చం॥ అరచుచుపెద్దగాను వెల, యాలను, న్యాయము నేను గోరెదన్
కరమటుడబ్బు జూపుచును కార్యముపొందగ జారచోరులన్
సరగునబంపి, మాయలను, చక్కగజేసియు మమ్మునెల్లరన్
సరకులజేసి, మార్చగను, చాలగనేను నెరింగిపొందనే 659

గీ॥ నేకులవధువుగానుంటి, నిందునేను
నాప్రతిష్ఠయు నాకుండె, ననగదాసి
మీదుపలుకులు గౌరవమంద దగెదు
నీసమస్య సమస్యయే, యెట్లుబోవు 660

కం॥ రాజసభాంతరమందున
నేజని న్యాయంబుజేయు డిందున ననియున్
రాజును నడుగమననియెను
నాజవమునకడ్డులేదు। ననియెను నందున్ 661

గీ॥ ప్రభువు నేలను। న్యాయంబు। పట్టిగూర్చ
కాలుదేజాలు న్యాయంబు। కట్టబెట్టు
నంచుమందుచు మాధవి। కందమంత
యొడిసిపట్టెను। గాంచియు కోవలుండు 662

ఉ॥ కోపముబూనిమద్యమును। గొంచుచునుంటచె।దుర్మలందు నై
బాపగపాపకార్యము జవంబును। గూడగతీసికొంచునున్
ఆపడితిన్కరంబునను లాగియుగొట్టెను। నొక్కబెబ్బనున్
పాపమ్మద్రిమ్మరద్దిరిగి। పట్టువీడియు కొయ్యబాదెగా 663

కం॥ పరిచారికలట జూచుచు
కరమట నుండియునువారు। గ్రగన్ననందున్
జొరబడకుండిరి భయమున
మరితొప్పుచునుండెనందు। మాధవకతా 664

గీ॥ ఇన్ని సంవత్సరంబులు. నేగనతడు
బలము నుపయోగపెట్టుటవలన। శక్తి
హీనుడౌచుంటినంచును। నెరిగియతడు
దిగులుపడె। నాగరత్నను। తేరిజూచి 665

గీ॥ కోపమూనియు। హెచ్చించిగొంతు। నరచె
గృహమువీడియు పొమ్మింక। గ్రూరురాల
అనుచుదాసిని జూచియు। ననియెనిట్లు
మెడనుపట్టుక త్రోయుము। పడగనవల 666

మ॥ వినిక్రోధంబున।లేచి।మాధవియునీవేనన్నుపొమ్మంచునున్
యననేలా? యిదినాదుతండ్రిగొనె। నాకై।దాసియున్నాయదే
యనగావించును। కోపలుండు। వికటంబైనట్టి హాసంబునున్
గొనియెన్।వేశ్యయు।గొన్నదానివిట।నీకున్నింతగర్వంబొకో
667

గీ॥ ఆమహాశ్రేష్ఠి తనయుండనైన నేను
నిన్నునీతల్లి తండ్రిని। నిక్కమిదియ
ఒకటిగాదిట। రెండుగగొనియునేను
దానమివ్వంగగలవాడ। తలగిపొమ్మ 668

గీ|| వెకలిపొమ్మన్న కదలవు। వెదగునీవు
ననుచు నాగరత్నను బట్టి। యవలకీడ్చె
బదులు తీర్పంగ మాధవి. బయలువెడల
యామె చేతిని బట్టెను। నందెయుండి 669

చం|| వెనుకను నిల్చి మాధవిని। వీడకపట్టియు। నిల్వరింపగా
మనమున సందియంబుగొని మాధవి వెన్కకు జూడనందునన్
తనవునమౌని వస్త్రములు। దాల్చియు నిల్చిన చేలమాఖ్యనున్
గనుగొనె। దేహమద్దియును। కాంతితొ వెల్లగవిస్మయంబునన్ 670

గీ|| పెరియనాయకి యుండెడి। నిరవుజేర్ప
నాగరత్నయు। మాధవిరాగ వెంట
వచ్చెచేలమ్మ। యారోగ్య భాగ్యమంత
యెట్లువచ్చెనోయంచును। వింతయైన 671

కం|| అడుగుగ లేదట మాధవి
యడుగులపై పడుచునామె। యాతనినడతన్
విడువక జెప్పెనునీగతి
పడతులతో। కామవాంఛ। పడనెడునంచు౯ 672

కం॥ త్రాగుచు। వీధుల। వేశ్యల
తాగూడియు తిరుగవచ్చు। దాసనుకులమున్
ఏగతి పొందదు మచ్చయు
కాగా। నాకూతుపేరు। గనపడునటులన్ 673

వ॥ వంశపట్టికలో వ్రాసిన మహాశ్రేష్ఠి। కులంబునకంతయు
మచ్చవచ్చు నటకదా? 674

ఆ।వె। శ్రేష్ఠిమనుమరాలు। చెప్పిరిబౌద్ధులు
విద్య। గరిపెనిందు। విడువకుండ
ఉత్తమంపుయువతి। యున్నతకులమున
నుండువర్తనంబు। నున్నతగతి 675

కం॥ పురమున శ్రేష్ఠికిధనమది
ధరలేదింతయును। నంత। తండ్రిదిగాదే
వరునిటజూచుచు నుండెను
వరుడునుదొరకంగ। తండ్రి। భాగ్యమునంతన్ 676

ఆ।వె। వారికిచ్చితాను। బడసెడు విశ్రాంతి
యంచుబలుకనంత। వించువీధి
వెంటబోవుచుండె। వీడకవినెనట
చేలమాఖ్య। యామెచెప్పునదియు 677

గీ॥ పెరియచేలమగాంచియు। విస్మయంబు
నంద। చేలమ్మ పెరియను। నందుకొనియు
కౌగలించెను స్నేహంబు। గూడియుంట
మాటలేకుండ। మాధవి నంటియుండె 678

కం॥ వచ్చినదానా। యెక్కడి
కచ్చెరువును గల్గనీవు। నరిగితివడియున్
చెచ్చరజెప్పుము నీవని
యచ్చెలువను కౌగలించె। యాశ్చర్యమునన్ 679

గీ॥ వారుమాట్లాడుచుండగ। భావమంత
యోచనాంబుధిమున్గగ నున్నయామె
వారిగొనకను। గృహమును జేరనరిగె
మాధవియు నంతపెరియయు। మాటగల్పె 680

ఆ।వె। నీదురోగమంత। యేతీరుగాబోయె
యెందుబోతివీవు। నింతవరకు
పదియునైదునైన। వత్సరంబులుబోయె
చెప్పుమంచు పెరియ। శీఘ్రమడిగె 681

వ॥ అనగా చేలమ్మ తనవృత్తాంతంబీరీతి యెరిగించె 682

ఉ॥ చేరితికాశి, యాత్రికుల జేరియు, వారితోనేను, నందునన్
జేరియుసాధువొక్కనిని, సేవలజేయగ, మెచ్చివానియున్
పారియుబోవరోగమది, వాడెనుమందులు, రోగమంతయున్
పారగ, నేనునీస్థితిని, బాగుగనందియు, మిమ్ముజూడగా 683

కం॥ పురమును జేరిన వెంటనె
యరసితి, మాధవినిగూర్చి, యంతయునేనున్
పురమును బాసినదాదిగ
జరిగినయదియెల్లతెలసె, చక్కగనాకున్ 684

గీ॥ అద్దివినియును పెరియయు నాదుఖర్మ
చచ్చునప్పుడు, శాంతిగ, చావనీదు
పురిలోయధికార, వర్గంబుపూర్తిగాను
తనదుచేతిలో నున్నట్టు, తానుతలచు 685

గీ॥ ఎన్నొభోగంబులుండిన, యింతిపెరియ
మదినిశాంతినిలేకుండ, మసలుచుండె
వేశ్యవాతలనేగాక, విపణివీధి
పేరువిన్పించె, మాధవిపేరె యెచట 686

చం॥ ధనమువికొల్లలైపెరిగె। దాకిశాంతియు। మానసంబునన్
గొనదటసుంతయేవి। పురిగూర్చిన రచ్చలుగాంచి యెంతయో
గొనెనదినిస్పృహన్పెరియ। గూడగపన్నయువచ్చి।చెప్పినన్
వినదనియీర్ష్యజెందియు వివేచనజేసియు।స్థబ్ధచిత్తయై 687

ఆ।వె। ఆమెశాంతినొందె। యదియెంతకాలమో
నిలువదయ్యెయంత। నిలువకుండ
శ్రేష్ఠివద్దకరిగి। శీఘ్రంబ దేవంతి
యంతతెలిపె। యందు। సుంతపోక 688

కం॥ అప్పుడె నగరశ్రేష్ఠులు
నప్పురముననుండువారు। నార్యునిశ్రేష్ఠిన్
చప్పునగలువగ వచ్చిరి
యప్పుడె। నారాజుజేరు। నప్పురమునకున్ 689

వ॥ అని వర్తమానంబు జేరె- 690

గీ॥ నగరమందున పన్నయే। దగిలిపేరు
పెరిగిపోవుచున్నాడు। సరిగజూడు
మనగృహంబుల యవనులు। గొనిరి పెత్త
నంబు। నంచునుశ్రేష్ఠికి। న్దందు తెలుప- 691

కం॥ దీనికి విరుగుడు జూడగ
మానినయిటమీద, మనకు, మానెదు పరువున్
గానగ వేశ్యలు గృహముల,
బూనెదు, యమ్మకమునకును, పూర్తిగ నింకన్ 692

కం॥ అనివిని శ్రేష్ఠికి కన్నుల
వదలెను మత్తింతవున్న, పటురయమునవే
పదువురతోడను రాజును
పదదర్శనమదియుగొనగ, పంపుదమనియున్ 693

సీ॥ వార్తలవినియును- వర్తకశ్రేష్ఠుండు
రాయబారముబంప-రాజుకడకు
నిశ్చయింపగనెద్ది- నిశ్చయంబునువమ్ము
జేయంగ వన్నయః- జేసెనిటుల
బంగారునాణెముల్- ప్రబలంబుగాజల్లి
దళమునభ్యులజీల్చె- తగినయటుల
మాటకారితనంబు- మహిలోనగొప్పగ
గలుగువాడును వన్న- నలువులేక

అంతకన్నను చాతుర్య మందియుంట
దళము సభ్యులనందర। దారిమార్చి
వేరుత్రోవనబంపెను। వారినెల్ల
వారుబోయెడి త్రోవలదారిగాచి 694

వారటురాయబారులను। బంపగ। నాయమునింటి ముంగికిన్
జేరుపనుండతా తెలిసి। జేసెదు తంత్రములన్ని। వారినిన్
మీరియు వేరుదారిగొని। మించియు వారటురాజధానినిన్
చేరక। విస్మయంబుగొన। చేరకరాజ్యము జేరిరెల్లరున్ 695

కావేరీపురి లేకను
నావలపట రాజధాని యందునలేకన్
ఏవిధి బోయిరొ వారలు
యావిధి తెలియంగలేక। యందలివారల్ 696

ఇదియిటులుండ శ్రేష్ఠియును నెంతొసమర్థునివాక్యకోవిదున్
విదితముచేయరాజునకు। వేగమబంపెను। వర్తకంబునున్
మొదలిడివారు। నెందరటు। పోవుచు। వచ్చెడివారితోడనున్
కదలియుజేరిరాజపురి। గమ్యముజేరియు రాజుకంతకున్
697

ఆ౹వె౹ విన్నవించవినియు౹ వీరదురాజును
చేరనూరునందు జేరియుండు
వనమునందు వేటబాగుగజేయగ
పోవునంచు౹ వెడలి౹ బోయిజేరె 698

చం౹౹ వినియును చోళరాజు౹ పురిపీడియు యుద్ధముజేయదేశముల్
గొనితిరుగంగుదేశమున౹ గూడుననర్థము౹ లన్నివించునున్
అనఘుడు రాజధానియికి౹ నాదరయూరును వీడివెంటనే
గొనునటతాత్వరన్నికెను౹ గూరిమివీడక వెంటవెంటనే 699

వ౹౹ కావేరీపట్టణంబును రాజధానిగా జేనుకొని౹ పరిపాలించుననువార్త౹ కావేరీపురినున్న యవనవ్యాపారులైన పన్నా మొదలగువురికి ముచ్చెమటలు బోయునట్లొనరించె౹ చోళరాజ్యంబును౹ వీడి౹ యిన్ని సంవత్సరంబులకు పోవలసివచ్చిగదాయని పరితపించుచుండె 700

చం౹౹ ఇదివినిక్రోధవేగమున౹యింతియుమాధవియాళలన్నియున్
తుదిమొదలంటగూలగను౹ తొయ్యలిజీవితమంత రాలమై
కదలనిరీతినిల్చె౹ యికకాదని౹ నాపెరియాఖ్య పన్నతో
కదలగవిశ్చయించుకొని౹ కాదనకుండగనీవు వెంటనే
701

కం॥ మణిమేఖల తోడనుమము
వెనుకొని రమ్మీవుననుచు। వివరము జెప్పన్
వినకను। తనసంకల్పము
మనమున। నటపీడకుండె। మాధవియందున్ 702

చం॥ అనుకొననట్టి కార్యములు। నట్టెపయింబడ। నామెక్రోధమున్
గొనియును। శ్రేష్ఠిమీదపగ ఘోరముగాగనుదీర్ప।యంతటన్
మణిమయమంజిరంబులను। మానక కోవలుచేత బొందుటల్
ఘనసతికన్నగిన్గృహిణి। గాదని యింటినినుండి గెంటియున్ 703

చం॥ పతికిని। శ్రేష్ఠివాక్కుఘనమైతనరారగ। వచ్చుదానిచే
మతినిడి నన్నుగెల్వగను। మాన। వలెన్నటులేక పోయినన్
అతితమ ప్రీతిపాత్రుడగు। నాతనియల్లుడు కోవలుండునున్
మతియటుబోవమాధవిని। మాటకునైనను। పీడలేకనే 704

గీ॥ చిక్కువడియుండ। నన్నేమి జేయుననుచు
మాధవియు పన్నపెరియాల మాటలన్ని
గొట్టివేసెను। వారంత గూర్చిధనము
వెండిబంగారములు। మరివిలువమైన 705

ఆ।వె। విలువగలిగియుండు। వేలగువానిని
వెంటగొనుచువారు। వీడునవియు
మాధవికినియిచ్చి। మాటునరాత్రిని
పురినివీడివారు బోయిరంత 706

మ।। పొలిమేరల్నటుదాటగానె। వనిలో పూర్ణంబుగా దొంగలున్
పొలియన్జేసియు। పన్నను పెరియనుస్ఫూర్తిధనంబంతయున్
తెలియన్రాకనుబోవ। నయ్యదియు। నెంతేవీనులన్వించునున్
చెలి। యామాధవి నెత్తిపై। పిడుగున్చేరంగ నేరీతియో 707

వ।। ఆకీతిగా మ్రాన్పడిపోయె। యదిమొదలు నామెలో ప్రతీ
కారి వాంఛ జాజ్వల్యమానంబు నైనయగ్ని హోత్రంబు
పగిది। ప్రజ్వరిల్లుచుండె 708

మ।। పరదేశస్థులపైన భారమిడియున్ వ్యాపారసారంబు। నా
దరికిన్పోవకయుండ। పన్నయిపుడు న్దాటంగ। వారెల్లరున్
దరిత్రోవత్తెలియంగలేక। వెలయాంధ్రందందునే యాజ్ఞలన్
నెరవేర్పన్జనుమన్న వానినెయటన్నిక్కంబుగా జేయుటే 709

కం॥ పరమార్థమంచు వారలు
నెరవేర్చుచునుండనందు। నెరజాణలు తా
కరమలు జేయగవచ్చిరి
సరగుననవి తల్లక్రిందుచక్కాగ గాగన్ 710

ఆ।వె। పన్సరాజధాని। వరకును లంచముల్
పెట్టివారినంత పట్టియుండె
రాజుచూడ। యుద్ధయోచననివిసుంత
జెవినిచేర్చకుండె। జేరవిభుడు 711

కం॥ కావేరీపురి లోనను
నేవేవియు జరుగుచుండె। నింతయువానిన్
ఏవియు నెరుగక వ్యక్తికి
నీవిధి జరిగెడునటంచు వెంచుచునుండెన్ 712

గీ॥ ధనవినాశంబుతోపాటు। గనగపురిని
కులవధువులందు నీతియు గూలిపోయె
నగరవృద్ధులు శ్రేష్ఠితోననిరిదాని
వేశ్యవాడలముందున। వైశ్యవరుల 713

గీ॥ గీములన్నియు వెలవెల। గేలిసేయు
నట్లు బోయెను। సుపదలంతజేరె
వేస్యగృహముల నీరీతి। వెలయజేసి
కీడుదాటుదమవి। యోజనాడుజేసి 714

కం॥ మణిమేఖలకును పెండిలి
గొనియును నటరాజరత్న। కూరిమిసుతుకున్
ఘనముగ జేయగ నెంచితి
మని తెలియజేయనద్ది। నంతయువినియున్ 715

కం॥ దానికి లొంగియు మాధవి
గానగజని కోవలునట। గ్రక్కునబల్కెన్
దీనికి మోదము తెల్పుము
నేనిక సంతోషమంద। నిక్కముసీవున్ 7!6

గీ॥ అనగనిట్టూర్పునిగుడించి। యనియెనతడు
నేనుపతితుండనై యుంటనిక్కువంబు
అంతరాత్మయు నింకచావంగలేదు
హేళనను శ్రేష్ఠికొడుకింత। లెఖ్ఖగొనడు 717

॥ రాగదని మాటకోవలు
దేదయినను జెప్పలేదు। నీవిధిజేయన్
కాదిది యాచారము। మరి
కాదా సంఘంబుబెదరి। కదదారిబడన్ 718

॥ అనవిని। వేశ్యకాంత। మదియంతజుగుప్సయునింద।కోవలున్
గనియెనె। నెందువల్లయిట, క్రమ్మరనయ్యెనునంచు బల్కగా
గనకను। దాని మోమునిట। కాంతరొవేశ్యలు నెందరైనకో
గనిరిటవారు పుత్రులును। గాంచగనానొకావారికీ విధిన్ 719

। మారినసంఘము। నప్పుడు
కూరిమినటుజేయవచ్చు। కోరిక దీరన్
నేరను సంఘముమార్చగ
యారయబలహీనుటనిట। యందున నేనున్ 720

। ఒడలుకంపమెత్త। నువిదయారీతిగ
పలుకబోవనతడు। పలుకుదినగ
నొల్లకుండ। యనియె। నువ్వెన్నివిధముల
జెప్పుచున్న నేను। జెవియనొగ్గ 721

కం॥ రాగదని మాటకోవలు
దేదయినను జెప్పలేదు, నీవిధిజేయన్
కాదిది యాచారము, మరి
కాదా సంఘంబుబెదరి, కడదారిబడన్ 718

చం॥ అనవిని, వేశ్యకాంత, మదియంతజుగుప్సయునిండ, కోవలున్
గనియెనె, నెందువల్లయిట, క్రమ్మరనయ్యెనునంచు బల్కగా
గనకను, దానిమోమునిట, కాంతరొవేశ్యలు నెందరైనకో
గనిరిటవారు పుత్రులును, గాంచగనానొకొవారికీ విధిన్ 719

కం॥ మారినసంఘము, నప్పుడు
కూరిమినటుజేయవచ్చు, కోరిక దీరన్
నేరను సంఘముమార్చగ
యారయబలహీనుటనిట, యందుననేనున్ 720

ఆ, వె, ఒడలుకంపమెత్త, నువిదయీరీతిగ
పలుకబోవనతడు, పలుకుదినగ
నొల్లకుండ, యనియె, నువ్వెన్నివిధముల
జెప్పుచున్ననేను, జెవియునొగ్గ 721

గీ॥ అంతవరకొచ్చి నిలచిన। యంతమీద
నిన్నువిడచి పోవంగ। నేమ। వెనుక
తగ్గనంచును। కోవలుదండిమాట
వినియుచెదరియు నీరీతివనితబల్కె 722

వ॥ నీకూతు సౌఖ్యంబుగోరియే। యింతవట్టువకాృణించితి
నని కన్నులనీరు నింపె 723

గీ॥ తరతరంబులనుండియు। ధరణిలోన
వేశ్యలకు పుత్రులెందరో। వలయుచుండె
కులవధువుకంటె భాగ్యంబు। గూడునట్లు
చేసినారిల యెందరో జేసినారు 724

గీ॥ వేశ్యకన్యకు లీనుడై వెలయునరుని
పెండ్లియాడినవానిని। వేలునెత్తి
జూపుమెందున। క్షమియింపు। చూడునీదు
నశ్రుజలములు వ్యర్ధంబునందనే 725

సీ॥ మణిమేఖలయు।శ్రేష్ఠి- మనుమరాలగు। కుల
ధర్మమింత గొవగ। తప్పకుండ
ధర్మవర్తనబోవు- తరుణిని కులవృత్తి
యేరీతి బనుపగ నేర్పగలను

కన్నగిదేవియు- గవిన సంతానంబు
కులలటగా మారునే గోరిజేయ
కన్నగీసంతాన మన్నను కోవలు
డంతతీక్ష్ణంబుగా। నతడఁ జూచె

గీ॥ తలవంచుకమాధవి। తానుజెప్పె
నేనసత్యంబు జెప్పను। నిక్కమిదియ
వేఱుదారియులేకను। వేశ్యవృత్తి
బూనియుంటిని నేనును। బూర్తిగాను 726

ఉ॥ కన్నగివోలె। నేనునిట। కాదనలేనటువంటి రీతిగా
మున్నుగ జెప్పుచుంటివిను। పొందితినేకులకన్య జన్మమున్
తిన్నగబొందియుంటకును। తీర్చినసాక్ష్యములేదు దానమున్
ఎన్నివిధంబు ఘాతలటు, యేర్పడ నేనును వేశ్యవృత్తినిన్ 727

కం॥ గొనలేదిట మరినేనును
గొన। సంతానంబదియెటు గూడునుమార్పున్
అనినను కోవలుఁడందున
వినకున్నని రాళపొందె। వెలదియునంతన్ 728

సీ॥ మదిలోన మెదలెడు- మానని కోపంబు
బదులు తీర్చగ మది త్వరను పెట్టి
మణిమేఖలా వృద్ధి- మదిలోన నుంచుక
గ్రుంకుచుండెను। నదికొంత తడవు।
మాధవి భవనంబు- మార్రోగె విప్రుల
మంత్ర ఘోషలతోడ- మహితరీతి
వ్రతములు పూజలు- విదితంబు జేయంగ
విప్రులు వచ్చియు- విడువకుండ

గీ॥ దక్షిణలబొంద। జేయించె। ధరణీసురల
వేశ్యవాడల నివసించు। వేరువారు
వేశ్యకాంతలతోగూడి। విడువకుండ
వచ్చిపోవుచునుండిరి। వానివినగ 729

గీ। పానశాలలు నిలబడె। వట్టిపోయి
నైతికంబగు విలువలు। నందు పెరిగె
నగరపతనంబు వేశ్యల వగలవలన
కాదటంచును తెలుపంగ। కాంతగోఢి 730

గీ|| అందునుండెడి యుద్యోగులంతవారి
తప్పులన్నియు। వాణిజ్యతప్పిదములు
అంచువారిపై నెట్టియు। వారుతప్పు
కొనగ తలచియు। వేశ్యకు గూర్చిరెంతొ 731

వ|| అమిత సహాయ సహకారంబుల నందించుచుండిరి 732

కం|| దినమున కొక్కొక విధముగ
వినవచ్చెను రాజధాని। విడచియువార్తల్
వినియును నధికారులపని గొనె
రాజును కోపమెంతొ। కోరెనుదానిన్ 733

ఆ|వె| తొలగజేయగోరి। యలఘుడు రాజును
పురిని జేరునంచు పొక్కెవార్త
దానివినియుగూడ। దడచియు మాధవి
దారితాను తొలగ। తలచలేదు 734

ఉ|| కోవలుమాధవిన్విడచి। గూడగవేరగుత్రోవ। జేయుగా
కోవలుడద్దిత్రోయగను। గూడియువర్తకులెల్ల. శ్రేష్ఠిన్
ఏవిధినైన కోవలుని। యింటికితెచ్చుట ముఖ్యమంచునున్
తావినిపించి। మీదునిట ధైర్యముతో నిలువంగ జాలుగా 735

గీ॥ గర్వమెంతయో। మాధవిగలిగియుంట
దానినణచంగ యోచన। దగులకున్న
దానితోపాటు। మనమంత తథ్యమింక
మునిగిపోవుటయంచును। ననిరివారు 736

చం॥ అదివిని శ్రేష్ఠి। దీర్ఘముగ। శ్వాసయువీడియు। దీనిచేతిలో
వదలియుగౌరవంబు। నిటువర్తిల నాకు విధించెదైవమున్
అదియటులుండ। నేననిట। యందరకున్దగు రీతిజేయగా
వదలకజెప్పుడన్న। మదివారును। కోవలునెట్టు వైననున్ 737

ఆ।వె। దానియింటినుండి। తరలింపయద్దియు
దానిగర్వమణచ। తగినదారి
అద్దివినియునందు। వృద్ధుడు శ్రేష్ఠియు
నిట్టులనుచు బలికే। నిజమునంత 738

కం॥ రాజోద్యోగులు। గురువులు
యాజవ్వని వెనుకనుండె। పరదేశములన్
రాజాలని సరుకులునిట
బాజారునకొచ్చిజేరె। బహుళముగాగన్ 739

కం॥ వానిని యమ్ముట కెవరును
గానగరాదైరి, యిచటగావున మనకున్
దేనికి వ్యాపారంబిటు
మానుట సరియైనదంచు, మదితలచెదనే 740

చం॥ అనియనశ్రేష్ఠియున్నదియు, తతంయువించున్వైశ్యముఖ్యులున్
అనిరిటు, నిట్టిపల్కులను, నాడుటయేలను మీరు, మాకునుఁ
వెనుదగిలున్నజాలు, నికపీడకమేమును జూతుమన్నియున్,
గొనవిటసేని స్పృహము, గూడగజేతుము, రాజస్నేహమున్ 741

వ॥ మీరు మావెక నున్నారనజాలు మాబలంబు పెరుగునని వ్రాక్రుచ్చిరి- 742

ఉ॥ కోవలుడందు, సంజకడ, గూయువేశ్యల, భ్రష్టతాచునున్
ఆవెలయాంధ్ర గూడికొని, యంబుధితీరముజేరి, త్రాగుచున్
ఏవిధినైన ద్రవ్యమును, నెంతయు కొంచునువచ్చుమిత్రులన్
కోవలుడందుగూడివిన గూడనిమాటల, యాటలాడుచుఁ 743

కం॥ కన్నగిని మాధవినియట
యెన్నోనిందలును జేసి, యీర్ష్యతొవారల్
ఉన్నను వర్తక పుత్రుల
కన్నులగనినిందజేసె, కడజాతులుమన్ 744

చం॥ తలవనిరీతి। శ్రేష్ఠియును। తత్తలమందునజేర జూచియున్
మెలగెడివైశ్యపుత్రులకు। మిన్నునకేగెను ప్రాణసంచయం
బులు।నటచేతనున్న। మధుపూర్ణపుపాత్రలు। జారెభూమిపై
చెలగెడిదుష్టగోష్ఠు। శ్రమదూరమునయ్యె లిప్తలో 745

గీ॥ వెలుగుజిమ్మెడి కాగడా ల్చెలగచేత
సేవకులు వెంటరాగను। జేరినట్టి
మామగారినిగాంచియు। మహినియందు
చేతనున్నట్టి మధుపాత్ర చేతజారె 746

కం॥ తడబడుచు లేచినిల్వగ
వెడగుప్రయత్నంబుజేయ। వీడకగనియున్
అడుగులు పదియును వేసియు
కడువడి భుజమటులబట్టె. కాదనకుండన్ 747

ఆ।వె। మామ స్పర్శవలన। మదియంత తనువంత
పులకరించె చేయి। తొలగజేయ
బూనవీలులేక। పొదవియు
గట్టిగపట్టెయల్లు కరముబాగటంచు 748

ఆ।వె। ఒకరినొకరుదీక్ష। నొనరంగజూచుచు
మామగారి వెంట। మానకుండ
రథమునెక్కివారు। పథమున పదిమంది
ముందువెనుకయుండ। బోవదొడగె 749

కం॥ జనగనురథమున వారలు
గనుగొని యావింతజనులు। గ్రన్ననపురిలో
అనుకొవిరెచ్చట గనుగొన
గని। వీథులలోనివారు। కాదనకందుఱ 750

శా॥ జామాతన్గొని శ్లేషిచూపులట తాచక్కంగ మార్గంబుపై
ఏమాత్రంబును బాయకుండనిలుప। న్నింకన్నటన్నొవలుం
డామామన్గని। మౌనమీడియును। మీరయ్యోనిటన్నెంతయో
నామార్గంబును వీడిపోవ। నిట। యున్నాళ్ళున్నుపేక్షించితే
751

క॥ తలత్రిప్పి కోవలున్గన
గలుగుమనోవ్యథనుతాను। కాదనలేకన్
పరికెను మామతొ నిటులను
నలఘుడముందీవువచ్చి। యరసిన నన్నున్ 752

గీ॥ ఇటువినాశంబు జరుగక, యెంతొ మేలు
గూడియుండునునంచన, కోవిదుండు
అదియె యోచించుచుంటిని, యనుచునతడు
పలికెయల్లునితోడను పటురయమున 753

చం॥ ఇదివిధివ్రాత గావున, గతించినదానినిగూర్చి, చింతయున్
వదలుట మేలు, యిప్పటికి, బాసియుబోయిన దేమిలేదు,నీ
మదిస్థిమితంబొనర్చుకొని, మానినకార్యములన్ని జేకొనన్
అదిపదివేలు, మీదు వెనునంటియు,నందరునుందు రంచనన్ 754

గీ॥ అదియంభవమంచును, నతడుననియె
కోవలుని గ్రుచ్చిజూచుచు, గూరుచుంత
తలయునెత్తగ, కోవలు పలుకులిట్లు
వినగవచ్చెను, నీరీతి, వివరముగను 755

ఉ॥ ప్రాణములున్నయంతకును, పట్టగయాపదలెన్నొ,వానినిన్
తానునుదాటుయత్నమును,తప్పగజేసేడుగావి,యన్నియున్
గానగ వ్యర్థమైచనును, గావునయంతయు! మోహావశ్యమై
బూనియునుండుగాదెయన! పొందరివారలు గేహమందునన్ 756

గీ॥ మామ అల్లుడు గలసియు క్షేమమొప్ప
గృహము జొరరాగ, సేవకుల్లాదిజూచి
దాపికాజనమంతయు, తాముగనియు
విస్మయంబంది రందరు, వేగయద్ది 757

కం॥ పతియును తండ్రియు గలసియు
సతికన్నగియుండు గృహము చయ్యనజేరన్
అతిత్వర వినియును నయ్యది
మతివేదనయంతనణచి, మానినియందున్ 758

గీ॥ వేదనాదీత భావంబు, వెల్లివిరియ
మదిని శాంతంబు బూవియు ముదితవేగ
అంతిపురిద్వారమందున యతివనిలిచె
యదియు దేవంతితన విజయంబునందు 759

కం॥ తలచెను శ్రేష్ఠియు నక్కడ
గలిగెడు నాసనములందు, గ్రక్కున వారల్
తిలకించుచు గూర్చొనియును
నలఘుడు హితబోధజేసె, యట్లనికందున్ 760

శా॥ నాదేమున్నదియింక భూమిషయికొన్నాళ్ళేగదా। నాయనా
ఏరైనన్నిటనున్నయంతయును। మీదే। యిప్పుడీవీటిలో
రాదేసుంతయు లోపమిందునవి చారంబేల। వైశ్యందునన్
ఈదేశంబున నిర్ధనుండయిన। యెంతేస్థైర్యధైర్యందునే 761

ఆ.వె. తట్టుకొనియులేచి। ధరణిలో నార్జించి
నిలువబడుటమనకు। గలుగునిద్ది
అనుచుచెప్పయితంత। వినుచును కోవలు
దందుగూరచుండె। యంతమామ 762

గీ॥ సుతనుజూడంగ గృహమును। జొచ్చివేగ
యెన్నోవత్సరములుపనె। యిప్పుడందు
తండ్రి కూతుళ్ళు। గలసియు తగినరీతి
పలుకరించుట ప్రథమంబు। బహుళముగను 763

చం॥ తనయను। కన్నులన్గలపి। తానునుజూడగ యామెతండ్రినిన్
గనుగొనే వేదజనిత। గద్గదయౌచును। కన్నులశ్రువుల్
దొనదొనరావాని। సతిదూకకనిల్పియు। తీవ్రవేదనన్
తనువుణంక కన్నగియు। తండ్రిని గాంచియుజేరె కౌగలిన్ 764

కం॥ కన్నాగి దుఃస్థితి జూచియు
కన్నీటిని గోటద్రోచి। గాంచియుతనయున్
మున్నిటు జరుగునటంచును।
గన్నానాకా నీదుభార్య। గతియగుతల్లీ 765

చం॥ జరిగినదానికిన్మది విచారమునందక। నీదుభర్తనున్
మరచెడునట్లు సేవలను మానినిజేయుము నీకుపట్టణం
బరయగమేలు గూడనగు। నయ్యదిజూచినవారులేరుగా
తరుణియటంచు జెప్పియును। తానునుస్వగృహమేగేతంద్రియున్ 766

గీ॥ కోవలుని పరిచర్యల। గోరిజేయు
నట్టి దేవంతి పరుగున యందుజేరి
కన్నగిని కౌకలించియు కాంతబలికె
పార్వతీదేవి రూపంబు। బడయునీవు 767

వ॥ సన్యాసినీవేషంబు పరిహరింపుము విన్నుసర్వాలంకృతం జేసె
దయని- యనుచున్న సమయంబున- 768

కం॥ నవ్వుచు కోవలుడందున
యవ్వేలదులున్నచోటు। నతడును జేరన్
అవ్వనిత సిగ్గుతోడుత
జివ్వనతలవంచి నిలచె। జేరగపతియున్ 769

కం॥ కావేరీ జలధులునట
యేవిధిగలయంగనందు। నెటులనునుండున్
ఆవిధి గొనుటచె తపమును
యావెలది వెలిఁగె। వెల్గుయద్భుతమనగా 770

చం॥ కదలగ కన్నగీసతియు। కాలికినుండెడి మంజిరంబులు—
మృదుమధురంబుగా। ధ్వనులు మ్రోగుచునుండగ యామెపాదములు
వదలకజూచుచుండియును। బల్కెను। గజ్జెల మ్రోత యెందుకో
హృదయము నాదిచుట్టియును। నీగతి మ్రోగెడు కన్నగీనతీ 771

గీ॥ ఆత్మతంత్రులు మ్రోగంగ। యద్దివినగ
మానివేసితి శనియిట। బూనివిడదు
దివ్యమంజీరములు వాకు। నవ్విగజ్జె
లోలెగన్పించుచుండెడు। నువిదయిందు 772

కం॥ ముకురము పగిలినదావిలో
నికరముగా ముఖముగనగి। నెటులనుగాదో
సకలము స్పష్టముగానిటు
ప్రకటంబుగ గానబడని। భాగ్యరహితుదన్ 773

గీ॥ అనగ దేవంతి। శనియిటు। గొనెడు మీదు
శత్రువుల। దేవతలుమీరు। శనికితావు
లేదుపదుడింక వడ్డింతు। మీదుగ్రశమయు
తీరునంచని దేవంతి। జేరిపలుక 774

ఉ॥ కన్నగిమీదు। శ్రేష్ఠిపయి। కారణముఁన్గొనలేని కోపమున్
మిన్ననటంట। మాధవియు మేదినిపిచ్చిదివోలె।యుగ్రశువుల్
గ్రన్నన జారఁవార। మరిఘట్టిగ ముష్టిబిగించి। కక్ష్య। లో
గొన్న సివఁగివోలె। నటు। కోమలి తిర్గుచునుండె నందునన్
775

సీ। అప్పుడు నాదుకొనంగ। యుందుండె పన్నయు
పెరియనాయకిగూడి- వీడకుండ
అన్నివిధఁబుల- యువకాశమునుబట్టి
యోడించిరామెను- నున్నవారు
దానితోపగయును- దండిగబెరిగియు
దానితోమరుగుచు- తరుణియుండె
తనతను కాగుండ- తనవాని కోవలు
విడదీసి కూతును- వేగగూర్చ

గీ॥ శ్రేష్ఠివేసిన పాచిక జేసెత్తు
యనుచు తలపోసి, మాధవి యమితమైన
కోపమూనెను. మదియందు గూడియుండె
భయము కొంచెము బాయక వనితమదిని 776

గీ॥ ఏది యేమైన కానిమ్ము యేనునిందు
జయము సాధింతునంచును, సరగుననట
నిశ్చయించెను యొకరూము నేగనంత
వచ్చెచేలమ్మ మాధవి పడయనందు 777

కం॥ వచ్చి చేలమ్మనుగని
హెచ్చగుదుఃఖంబుతోడ, యింతియునామెన్
గ్రుచ్చియు కౌగలిజేర్చెను
నచ్చము తల్లియునువోలె, యామెయునంతన్ 778

ఉ॥ వచ్చువిపత్తునే యెదిరి, పారకధైర్యముతోడ నిల్చియే
ఇచ్చలు దీర్చుకోవలెను, నెప్పుడు జీవితమొక్కరీతిగా
చెచ్చర నేవిధిన్నరుగు, చేడియ ప్రాణముబోవు, సంకటం
బొచ్చిన, వైరమూనినను,నుండదుసౌఖ్యము కష్టమొచ్చినను 779

ఆ।వె। వానితోడ మనము। బాగుగ పోరాడి
నేర్చుకొనగవలెను। నిశ్చయముగ
నాదుమదిలొ పగయు। నాకునుండంగ।
సౌఖ్యమదియునొంత। షుదతినేను 780

వ॥ అని చేలమ్మవలుక నామాధవి యిట్లనియె 781

కం॥ కోవలు గొనుచును బోయెడు
నెవిధిగొనియైనగాని। యేర్పడేపగనున్
బోవగజేతును నేనును
నీవేగనుచుండు మింక। యిందుననినియెన్ 782

కం॥ ఆలోచించిన కొలదిని
చేలకునాగ్రహముమించె। విజయముబొందన్
కూలని సంకల్పంబున
యాలో। నిశ్చయముబూనె। యామెయునంతన్ 783

ఆ।వె। ఝాముప్రొద్దుబోవ। చానయు చేలమ్మ
తిరిగివచ్చిచేర। నరసియంత
పగయుకొంత తరుగ। పరువెత్తి చేలమ్మ
కౌగలించెయింతి। కౌగలించి 784

కం॥ ఆపదవచ్చినయప్పుడు
చేపడు ధైర్యంబు గొనగి। చేకురు పనులున్
ఒపదతి జీవితంబది
తాపడయదు నిశ్చలంబు। తలచు దీనిఁ 785

గీ॥ ఎదురుదెబ్బలు తగిలెడు। వదలకుండ
ప్రాణములమీదవచ్చెడు। పడతియపుడె
మతియుబోయెడు రీతిగ। నతిగగల్గు
పగయుబూనంగ దలితంబు। బడయరాదు 786

కం॥ ప్రాణులలోనను నిమిడియు
కానగరానట్టి జడత। ఘనముగనుండున్
దానిని పోగొట్టగవిధి
పూనిక నీవిధినిగూర్చు। పూర్తిగబడ్డా- 787

గీ॥ కష్టమొందినవేళనే। గనగవచ్చు
నరుడు। గుణపారమెంతయో సరగనేర్చు
కొనగవలెనంచు చేలమ్మ। ననియునేను
తీవ్ర కోపంబు తోడను। తీరమేది 788

ఆ|వె| దొరకకుంటనుండి| సరియైన మార్గంబు
యనగపెంట ననియె| నామె వేగ
దొరక కెందుబోవు| దొరకియేతీరును
శ్రేష్ఠిరాజుగారు| చేరులోన 789

గీ|| కోవలుని గొంచుపోయియు| కూతుకాపు
రంబుచక్కదిద్దగ గోరి| యందుగర్వ
మంతవట్టిది యామెను| నట్టిజేతు
ననుచు పలుకగ చేలమ్మయనియెనిట్లు 790

చం|| సమయము మించకుండగనె| చానరొ మాధవు| యింకనీవునున్
కొమరిత వెంటనుండగొని| గూడగ వేగము| పట్టణంబునన్
అమరగరాదు| వేరెపురియందున జేరియునుండు మీవునున్
సమయముగాదు నీకు| మదిచాలగనుండెడియద్ది జూడగా
791

గీ|| ఇటుప్రతీకార మీవును నింపుదీర్ప
తలపనద్దియే పునరావృతంబు నౌచు
పెరిగిపోయెడి| నంతంబు దొరకదెచట
ప్రాణముద్దియు నొక్కరి బాయకుండ- 792

శా॥ ఎన్నోయాతనలంది, శ్రేష్ఠివలన, న్దేవంతితో, కూతుతో
నన్నే దూషణలెన్నొ జేయమదిని, న్నాలింపలేకుంటి, నే
నన్నేవత్సరము, క్షణంబునయి నన్నేమాత్రమున్నాంతి, గా
నన్నున్నుందగ నిచ్చిరేయనగ, విన్నన్నంతచేలమ్మయున్ 793

ఆ. వె. శాంతస్వరముతోడ, చక్కగ చేలమ్మ
యనియెనిట్లుదాని, నందుగాంచి
కన్నగియును మదిని, కాదనలేనట్టి
బాధలొందియుండు పడతియెంతొ 794

గీ॥ నీదుకష్టంబునట్లనే, నీకునట్లె
యవలివారును కష్టమున్నందు చున్న
దానినెరిగున్నయప్పుడే, దక్కునీకు
శాంతిమదికిని, యోచన చక్కజేయు 795

చం॥ ఇదిమనమెంతజెప్పినను, నింతయు తావిమనట్టిరీతిలో
మదిని నెరుంగనింతయును, మానినియాగ్రహపీత బుద్ధియై
హృదయమునందుచేలమయు,నీగతిజెప్పగ రెచ్చిపోయియున్
వదలియు నామెజ్ఞనియు, పాపనుతెమ్మని నాగరత్నమున్ 796

వ ॥ మణిమేఖల నిద్రించుచున్నను। తీసుకరెమ్మని
యాజ్ఞాపించె- 797

గీ॥ దానివ్యవహార మంతయు। తానుజూచి
మదివిరక్తియుగల్గిన ముదితగాన
హాసరేఖయు। పెదవిపై। యాడుచుండ
తలయునెత్తియు జూచియు। తానువెడలె 798

వ ॥ అట్లుబయలుదేరిన చేలమ్మను జూచి నాగరత్న 799

కం॥ గదిలోనికి। చెలిపోవుచు
ముదితయు చేలమ్మ జనగ। ముందుకుజనియున్
వదలక మణిమేఖల నిట
సదయత గాపాడుమీవు। చాలవియనియెన్ 800

గీ॥ విధివిధానంబు। కటువుగా। విడువకుండ
నుండు వ్యక్తిజీవితమంత। నున్నతుండు
దేవుడేరీతి। సంస్కార భావమూని
హితముతోడనో। దండన నెరపియెట్లొ 801

చం॥ సరిగను జేసితీరునది। చక్కని సత్యము। దీని వ్రాతయున్
ఎరుగుటకేరికౌను।నిటు నేను। నహంకృతిబొందియొక్కటన్
బరపిడాన నాతలయు బ్రద్దలుగాగకు। బొప్పిగట్టియున్
ధరయిటులై తియంచనగ। దాసియు యోజజేసెవెంటనే 802

చం॥ మరియిట దీనికేతగిన। మార్గములేదన। యామె దేనికే
త్వరగను జెప్పుమన్న।యది బల్కెను।మాధవి।కోవలుండునున్
దరసిననాటి నుండియును। తానుమరొక్కని గోరకుండగా
జరిగెనుగాదె। నాకులపు। చానకు సానికిభేదమేమిటన్ 803

గీ॥ సానియాటల పాటల। చక్కజేయు
కాని సంసారి యిలువీడి। తానురాదు
భేదమేమిట। వారికి వీరికిందు
యాటపాటల పాడుట। నంటునేమి 804

గీ॥ మఱియు చిన్నమ్మ సాటియా। తరుణలకిట
కులవధులౌచు నుండంగ। గలుగుగోర్కె
తీరకుండగ। కారణం బాదయగను
నేమిటనియును। పసిపాప యేమిజేసె 805

చం॥ అనియనశ్రద్ధగావినియుఁ। నాయమచేఁ మఁ యిట్లు బల్కెఁతా
వినుమిట। యిద్దరునలుగు। వీడనిసంస్కృతి। లోఁ బేదముల్
గొనియునునుండె। వేశ్యయది। గూడియు।మాయము।హావభావముల్
గొనియెదు। దాని। వేరయిన కోమలి హక్కులను బొందునంతియే
806

చం॥ మరియెటు। నంతరంబులిట। మానకవచ్చెను। మూర్ఖురాలినే
సరిగను జూచుచుంటినిట। చానలునెందరో భర్తచాటునన్
గునుతిడలేని హీనమగు। ఘోరపుకార్యములెన్నొ జేయదే
మరిమనకన్న యేమిటిట। మాననిగొప్పది।యెందుజూచినన్
807

కం॥ అనయాలోచించియు నట
నొఁ గూడవు ప్రశ్నలను। నుచితపురీతిన్
గనగ సమాధానము నిట
గొనరావవ్వియును నెందు। గూడగ। మనకున్ 808

మ॥ అచటన్మాధవి యొక్క చేసిలచి। యేకాంతంబునన్నెంతయో
విచలంబై। మనసంత। నుండగ। నటన్వేదంగ లేకుంచగా
అచటన్నుండియు లేచి వేగముగ। తానాయింటిలో జొచ్చియున్
ఎచటన్నుండినరత్నభూషలను। నెంతేద్రవ్యమున్నంతయున్
809

ఆ.వె. బండ్లమీదవేసి, బాగుగదాటించి
వనమునందు, చెట్ల, మాటున దు
జేర్చి, వేగవచ్చి, చేరట యందరు
నిద్ర, యింటికంత నిప్పుపెట్టె 810

గీ వీధులందున బడియును, వీడకుండ
మంట మంటలంచును, నేడ్చి, మాధవియును
దాసదాసీ జనంబులు, తాము వెంట
నంటయేడ్చుచు పురిమధ్యకామెజేరె 811

ఉ॥ సుందరమై, మనోహర, ప్రశోభితమై, తనరారు గేహమున్
అందున యగ్నిప్రీతిగాన, యందరు నిద్రనువీడి లేచియున్
కొందరు నందునిద్దియుమ, గూడగకోపము, శ్రేష్ఠి దీనినిన్
ఇందునజేసెనంచునట, యెందరొజెప్పిరి, చేరువారలున్ 812

కం॥ దాసీజనంబు తోడను
డాసియు గృహమంత వేగ, పడతియు వెంటన్
కాసులు నన్నియు బోవగ
మాశాత్తు గృహంబుజేరె మాధవియంతన్ 813

ఆ.వె. వేశ్యవాడవీడి, వేశ్యయౌ మాధవి
పురముకంత వన్నెపొంద జేయు
శ్రేష్ఠిగారియింట జేరగమాధవి
గాంచి యద్ది చర్చ యెంచిపెరిగె 814

కం॥ ఎక్కడజూచిన యెక్కడ
పొక్కెను హాస్యంబులాడు పూర్తిగజనముల్
చక్కగ రచ్చల చర్చలు
ప్రక్కలనెటుజూడ జరిగె బ్రహ్మాండముగా 815

ఆ.వె. శ్రేష్ఠిగారిసైగ, చేకొని కొందరు
వరప్రచారమందు బాగజేసె
శ్రేష్ఠిగారి పరువు, చీలదు నొక్కతే
యలకులీనులంత యందగలరు 816

వ॥ అనియనేక ప్రకారంబుల ప్రచారంబులు ప్రారంభించిరి,
కులవృద్ధుల సమావేశపరచి, పంచాయితీ జరిపి, ధర్మ
విర్ణయంబు జేయవలెనని వైశ్యకుల హితులైన
పెద్దలు కోరిరి- 817

కం॥ దరయూరు వదలి రాజును
దరసెడి నావేళయందు। దగులగనిదియుకా
వదమగు నపచారంబవి
కరమటు పెద్దలునుబల్కె। కాదనరాకన్ 818

సీ॥ తరతరంబుల నుండి- వరలెడి కులమున
పెద్దయాచుసునందు- పేరుగలిగి
మాసాత్తు శ్రేష్ఠియు- మానక సాగింప
కోవలునతు గూడ। గూడియుండె
దానిని యెరిగింప- దానికి। యాతడు
తప్పుజేసినవాడు- ధరణిలోన
న్యాయంబు జెప్పంగ- యర్హుడు కాదంచు
పలికియు- మాధవి। పాదమిందు

గీ। పెట్టతప్పగు। దానిని వెడలగొట్ట
నాదుశక్తికి మించెడు। నద్దియిద్ది
వేశ్యయైనను। నాపట్ల ప్రేమయెంతొ
గలిగి యున్నది నిక్కంబు। గానసేను 819

ఆ।వె। వేశ్యవాడవిడచి। వేశ్య। కులీనుల
యిండ్లజేరి। యందు। నె లేని
పురిలోనుంచదగిన। పూరుష శ్రేష్ఠిదౌ
యింటియందు జేరయెట్టులౌను 820

కం॥ డరయూరు వదలి రాజును
త్వరకావేరి పురినిట। వరలెడునంచున్
జరిగినదిది। రాజుకునిట
మరియపచారంబటంచు। మాట్లాడిగా 821

గీ॥ తరతరంబునుండియు: పురిలోనింను
కులపుపెద్దలు। మాసాత్తు కొలమువారు
అదియు కోవలునందగ। దగునటంచు
చేరిపెద్దలు కోవలు జెప్పవినియు 822

మ॥ అపరాధేప్పుడున్యాయమూర్తిగను। నుండంజెల్లునేయేందుసన్
అపరాధంబది, మాధవీపడతి నీలాగున్నానర్పంగ। నే
నిపుడున్నేమియు చేయజాలనిట। నేనేనామె ప్రేమించుటన్
ఎపుడున్తెప్పగలేను। గానిచెడులున్నె చోటనున్నుండుగా 823

కం॥ కులవృద్ధు లద్దివివియును
పలుకులు మీయవియు నిజము, బాగుగకానీ
గలిగిన కన్నగిసతికిట
గలుగును నపకారమిందు, గావున చెపుదున్ 824

వ॥ మఱియు మీవంటివిజ్ఞానధనులు జేయవలసినపని కాదు
గదాయన- 825

గీ॥ నేను విజ్ఞానపరుడనా, నిక్కమేన?
మయసభను బోలుదానిలో స్వయముగానె
బ్రతుకుచుంటిని, నందునవచ్చుదాని
తమర సెలవిచ్చియుంటిరి దాని వింటి 826

చం॥ అనవిని,వృద్ధశ్రేష్ఠి,యిటులాడెను,కోపముమించ కోవలున్
గనుకొని, యిద్దినొక్కరికిగగ్గెడు కార్యముగాదుగాన, వే
జనియును, మేమురాజునకు,చక్కగజెప్పెదమంత, వేశ్యనున్
గొనియునువచ్చి,గౌరవముగూడు కుటుంబములందునుంచగా
827

గీ॥ తగినపనికాదటంచును, తప్పకుండ
వెడలనంపు మటంచును, వినిచివారు
వేగ, ప్రక్కనేనిలుండి, యింతవోక
వినెదు మాధవి కోవలుగనగవచ్చి 8?8

ఉ॥ ప్రక్కన గూడుచుండగను। భామిని యింటిని నుండిపంపంగా
నక్కడ చేతగానిగతి। యందుననుండగ। యామెకార్యమున్
మక్కువతో గ్రహింపగను। మావినవారును నెన్నొతర్కముల్
చక్కగజేసికాలిన గృహంబును గట్టియునందునుండగా 829

గీ॥ మంచిదంచును కోరిక। యెంచిపలుక
దానికిసమాధానంబు। బూనియుండ
ఇటుల వెలిబుచ్చె। దగ్ధంబు। గృహమునయ్యె
దానిగట్టుట వ్యయమది। కానినేను 830

ఆ।వె। ఉన్ననగలునమ్మి యెన్నగగట్టిన
జీవనంబుగడుప। గావలయును
మీరుజూడనిందు। మించినవ్యాపార
మంతవీడియుంటి। దిందునేడు 831

కం॥ సొమ్ములు। ధనమది పోవగ
యిమ్మహి। నేనెట్లు। బ్రతుకు। నీడ్చెదనిందున్
అమ్మాయి పోషణంబును
సుమ్మీగొనజాలనేను। చోద్యమునిదియే 832

ఆ।వె। ఇందునేనునుండ యీగతినిర్ణయ
మేనుగొంటి। యిందునేను నుండ
మేలుగల్గునింక। చాలగకన్నగీ।
సతికి మీదుకూతు కతిగనిందు 833

గీ॥ వైశ్యవర్గంబులోనను। వదలకుండ
చర్చజరుగుచు నుండెను। సత్వరంబు
ప్రభువువచ్చిన వెంటనే। బాగుగాను
నగరమునుండి గెంటుట। తగవుగాదు 834

వ॥ అని పెక్కు విధంబులవాదంబులు। విన్పించుచుండె
యయినను। మాధవిపట్టుదల వీడక। ప్రభువులు వచ్చు
దినంబులు సమీపించుకొలది మనంబున భయంబు వదలక
బెదురుచు గడుపుచుండె 835

సీ। మాధవి కూతురు- మణిమేఖలాఖ్యకు
కన్నగి శుశ్రూష- కరముజేయు
కపటంపు ప్రేమయు। నెపుడునుజూపింప
ప్రేమవలకబోయు- విడువకుండ

కన్నగిస్వచ్ఛత- గాంచియు మాధవి
పనులనన్నింటిని గొనగజేసె
ఇంటిఖర్చులకైన- నియ్యక నౌకర్ల
నందరపోషింప- నందుకామె

గీ॥ నగలునమ్మియు, తాకట్టునగలు పెట్టి
కాలమంతయు గడుపంగ గాంచివేశ్య
విస్మయంబునునందెను, విడువకుండ
వ్యయము నంతయు నామెపై, బడగజేసె 836

కం॥ నోరును మెదపక కన్నగి
చేరుచునటనన్ని, కాని చేడియమదినిన్
చేరియునుండిన కపటము
నారసిమదియంత దుఃఖమందుచునుండెన్ 837

కం॥ కన్నగి మదిలో మెదలెడు
నన్నియునట వచ్చుదినము, నతిత్వరలోనన్
కన్నులపొడగట్టెను. నిక
మెన్నెలవునగడుచునేడు, యేగతియనుచున్ 838

గీ॥ మదినితాపంబు జెందియు, నతివయంత
భర్త్తకుంతెల్ప యాతడు, పలుకునెట్లు
నంచు, భయమంది, మాధవి యంతరంగ
మందు, తానపార్ధంబును, నందునేమొ 839

చం॥ ఇటులమదిన్తలంచుచును నింతియుకన్నుగి, యశ్రుజాలముల్
బొటబొటజారి, చన్నుగవపూర్తిగ ధారలతోట నిండగా
అటకునుజేరుదేవతియు, నయ్యదిగాంచియు, నంతబుద్ధి, ప్ర
స్ఫుటముగ తానెఱింగి, యంటజొచ్చియు, వేగమనంతికంబుకున్ 840

కం॥ ఎందుకు దుఃఖము నందుట
యందేగియు శ్రేష్ఠితోడ, యంతయు జెపుదున్
ఇందులనున్నది యంతయు
ముందేచెల్లించినావు, ముదితరొ నీవున్ 841

చం॥ తెలియక నుండయేదియు, మతిన్నటనుంచెనొ, నద్దితెల్పగా
వలయునటంచు, దేవతియు, బల్కగకన్నగి, యామెగాంచియున్
కులసతి, లేమినిన్తనదు, కూరిమిభర్త్తకు జెప్పరాదుగా
వలసినవాని దీర్చగను, బాధ్యతయామెదె యెల్లవేళలన్ 842

కం॥ అనియని దేవంతి తొనట
యలినది। తా। గానిరేపునంతయు గడపన్
గొనగను లేవనిమదిలో
యసుకొనె। నీకీతిసతియు। నాత్మలొతానున్ 843

కం॥ ఏడుతరంబుల నుండియు
గూడిన సిరియెల్ల। నేడుగొనె। నాశంబున్
నేడిట। గర్భపు కోష్ఠ
గూడెడు కోశంబునుండె। గూడదు తాకన్ 844

ఆ।వె। కోశమందునుండు। గూడినద్రవ్యంబు
వెలికితీయు। పనియు। గలుగరాదు
వెలికితీయదాని। వీడక వెంటనె
త్వరగడానిగూర్చ। నరయవలయు 845

ఉ॥ వంశప్రతిష్ఠకు న్భయమువర్తిల। ధర్మముబాయువేళల౯
సంశయమింతలేక। యదిచక్కగతీయగవచ్చు। వెంటనే
భ్రంశముగాక యుండునట। వంశవివర్ధనిభార్య దానినిన్
అంశముయేమిలేనియటు। నంతయుజేర్చియు తీర్పగావలెన్
846

గీ॥ దానితరువాత సంపద తనకునున్న
వైశ్యగణముల। కళ్యాణవర్ధితములు
నైన। మంజీరములె। శనియంతవట్టి
యంత కోశంబు బోవంగ। యపుడెవిడక 847

వ॥ కళ్యాణమంజీరంబుల విక్రయించి। పోయిన తమవైభవం
బుల తిరిగి సంపాదించి। కులవైభవంబుల కాపాడుకొన
వలె। యనియామె వాదించ। దేవంతి యందు వినక
కోవలుని(జేరి। యంతయు। కొదులేక చెప్ప। నక్కడనే
యున్న మాధవి యెగిరిపడి నీరీతిబల్కె 848

ఉ॥ కూతురు తండ్రియున్గలసి। కుట్రనుబన్నిరి। వారునీగతిన్
ఈతరినన్ను। నాదుసుత। యిద్దరినిన్నిట। కూడువెట్టకన్
నాతియుజంపబూనె। మరినాకును। నాసుతకిట్టి శిక్షయున్
చేతముమెచ్చజేసినను। జేయగవచ్చునుగాని। మిమ్మనున్ 849

కం॥ ఆకలితోడను జంపగ
యాకలికి పతివ్రతాత్వ। మంతయునిదియే
నాకును మంజీరంబులు
చేకురినన్లేకపోవ। జేసెదనేనున్ 850

ఆ|వె| వదలకుండమిమ్ము| బాగుగనేనును
వేశ్యనైనగాని| విడువకుండ
మీకుబాధలేక మేదిని నేనైన
యింతతిండియెట్లొ| పెట్టగలను 851

ఆ|వె| మరుదినంబునుండి| మాధవి బీగముల్
పెత్తనంబునంత| విడువకుండ
తానుగొనియె| యెందుతాళముల్వేసిన
గదియునున్నదాని వదలకుండ 852

కం|| కోవలున డగ్గరుంచుక
యా వెలదియు| కన్నగినట| యందునపిలుచున్
కావలశిన బీగంబుల
కావలెననియడుగ| యామె| గ్రక్కుననిచ్చున్ 853

గీ|| దాసదాసీజనంబులు| తప్పకుండ
యందునుండెదు| వారల| నంతమంది
కన్ని జరుగుచునుండెను| నందు నిద్ర
లన్న పానంబులునులేక| యలమటించె 854

గీ॥ గృహమునందున వేశ్యయు, గూడితిరుగ
రానిచోటది, యెందును దానికున్నె
ఎచట బీగంబులేసిన, యింతగదియు
కానుపింగ వెంటనే, కన్నగినట 855

గీ॥ పిలువబంచియు, తాళముల్వేగకొనును
పలుకులేకుండ, కన్నగి మెలగునవ్వి
ఇచ్చివేయును నాజ్ఞను, మెచ్చినామె
యన్నిగృహముల, గదులను, నన్నిగనియె 856

గీ॥ ఒకగృహంబది, జూచిన, నన్నుబీగ
మద్దివెంటనే మాధవి యాజ్ఞజేసి
యందుకొను కోవలువి యంతికంబునందె
యావిధంబున యన్నియునందు కొనియె 857

ఉ॥ అన్నిప్రకోష్ఠముల్నటులె, యాటవెలందియు, లోగొనంగ, తా
నెన్నడుజూడనట్టి, గదియెంతయు, లోహపుద్వారబంధముల్
మిన్నగుతాళముల్నచట, మేల్గొనజేయు, ప్రకోష్ఠమందునన్
వన్నెలబూవుబోడి, గనిబంధనమూనినదాని తాళముల్ 858

ఆ।వె। లోగొనంగతలచి। యాకన్నగీసతి
యంతకంత బాధలంతపెట్ట
ఆమెతాళములను। నందకుండగజేసె
యేదొవంకపెట్టి యింతవరకు 859

కం॥ కోవలుని గూడ నడిగియు
నావెలదియు విసుగుజెంది। యుందియు కోపం
బేవిధి నైనను వానిని
తావడయగ నిశ్చయించి। తరుణియు జేరెన్ 860

వ॥ ఈవిధంబున మాధవి గుప్తకోశంబు। నెవ్విధంబుననైన
స్వాధీనంబును గొననిశ్చయించి। కన్నగీసతి వలన గొన
నేరక। కోవలుఁజేరి యడుగ 861

ఆ।వె। అత్తగారివలన। యుత్తమసతియగు
కోడలొద్దజేరు। నేడుగూడ
దానిదాకరాదు। ధరణిలోపురుషుండు
గృహము జొరగరాదు। సిహజమిదియ 862

ఉ॥ తల్లియుబోయినంతటను తండ్రియుతానువచ్చిద్రవ్యమున్
అల్లప్రకోష్ఠమున్తెరచి। యందునవేయక। బాహ్యదేశమం
దల్లననుంచువాడు।స్నుష।వచ్చినవెన్కను।నట్టిద్రవ్యమున్
మెల్లనజేర్చు లోపలను। మిక్కిలినిద్ది నిజమ్మునమ్ముమా 863

ఆ।వె. ఎన్నివత్సరంబు లేగెనో దానిలో
నుండుద్రవ్యమింత। యందరాదు
దానిమీదహక్కు తగు కోడలికి దక్క
పురుషునకును గూడ। పొందరాదు 864

ఉ॥ ఇంతనలేనిద్రవ్యమది। యేడుతరంబులనుండి। యందునన్
కొంతయుతీయకన్నచట। గూడగపెట్టియు నున్నదన్న। నా
యింతియునంతయున్నెరిగి।యేగతినైనను దానిబొందగా
పంతముబూని కోవలునిబాయక యెన్నొవిధంబులూనియున్ 865

చం॥ కపటపుప్రేమజూపుచును। కమ్మనిమద్యము బాయకుండగా
ఎపుడునునిచ్చుచున్మనను నింతయుపీడని దానిబొందగా
అపుడును।కౌగలించియును।నన్నివిధంబుల నాత్మకార్యమున్
నిపుణత తాంత్రికుండు। నటనిష్ఠుర కార్యములూని యేవిధీన్ 866

గీ॥ శవమునందున సాధనచక్కజేసి
సాధకుండెటులను తానుసాధనంబు
గూర్చునట్టుల, మాధని కోవలుపయి
గూర్చియెన్నియో విధముల, కొంకులేక 867

ఉ॥ ఎన్నియొతంత్రముల్చరపి, యేగతినైనను, వేశ్యలోగొనెన్
అన్నియుతర్కముల్సలిపి, యావిధకన్నుల నీరుగ్రమ్మగా
మున్నుమది స్వీచారమును, పూర్తిగజేసియు, నద్దికోవలున్
తిన్నగజేరి ప్రక్కగను, తీరికనీగతియిట్టి జెప్పితా 868

సీ॥ నేనును జెప్పెడి, నిక్కంపు మాటయు
కటువుగా నుండును గానిమీరు
మదిలోన యేమని- భావింపగూడదు
పాదసాక్షిగ నేను బలుకుచుంటి
స్వార్థంబుసుంతయు- చాలగనాలోన
లేదటంచునుతాను- వాదునెరపి
ఇద్దరు భార్యలు- నిలకులీనులకును
నుండుటభావ్యమే- నుండనేమి

గీ॥ కులసతిగ నేనులేకున్న। నిలనుమీదు
పాదదాసిగా నైనను। వనరుదాన
దానికంగీకృతియు మీరు। బూనువారొ
కాదొ। యంచయొప్పెద। కాదననిట 869

కం॥ అనియన। నన్నును నిందున
పనుగయమునింటికేని। పదపడిమీకున్
గొనియెడి సేవాభాగ్యము
గొనకుండనుఁజేయ। యోర్పుగొనుదే నీవున్ 870

గీ॥ అనగ సహింప। నేనును। నతివనీవు
నాదుప్రాణంబవౌచును। మీదునుంటి
అనినవెంటనే నన్నును। నాదుకొనగ
తగినకార్యంబు జేయంగ తగినయటుల 871

సీ॥ ప్రభువును పురికిని- వచ్చుట శ్రేష్ఠియు
నన్నును గెంటుట- మున్నుజరుగు
ధర్మంబు సంఘంబు- తక్కిన వారును
మీదుపక్షమెజేరి- మించియుండు

నేనును వేశ్యను- నేమియు జేయంగ
జాలనిదానను- జేలనిందు
ఈయాపదసుబాపి- యెట్టుల రక్షణ
గూర్పగనీవును- నేర్పరివిట

గీ॥ దీనిదాటునుపాయంబు। నేమజెపుదు
ననగ। యేమనకోవలు। డతివయనియె
శాస్త్రవిధినన్ను పెండ్లాడ। చక్కనైన
తగునుపాయంబు నంచనె। తరుణియదింపు 872

శా॥ నీతోడన్నిట పెండ్లియాః సబబు। నన్నే మెచ్చునే।లోకమున్
ఖ్యాతిన్గోతిని త్రోసినాడ। ధనము న్గావించితిన్నీ పరం
బీతీరున్నను గోరగాదగునె। నేదేవిన్నను గోరగా
చేతున్గానిటు పెండ్లియాడుమని। యిన్నీ। గోరగానౌనాకో
873

చం॥ అనవిని వేశ్య।మాధవియు। నాడెనును నాతలరాతయీగతిన్
గొనుచునిత్రావాసెబోలుననని। కోవలుమాటను వించుమోమునున్
వనితకువెల్లవార। నటుబల్కెను। నీగతినాకుగల్గు। నం
చని।మదినేనెరుంగుదు। నిజంబిట। శత్రులజేతజావగా 874



గీ|| ఏలవలయును। నాకునై నేను గోతి
నూతిలోబడి చచ్చుట। యుత్తమంబు
అయ్యెనాసుత। నాకును। పాపమెంతొ
జేసిపుట్టినావిటనీవు। శీఘ్రమిందు 875

కం|| అనుచును మాధవి నిలువున
గనుచుండగ। కోవలుండు। గ్రక్కున బడియెన్
మునుతల నేలకు తగులగ
గొనెగాయము రక్తమంతొగూడియుగారెన్ 876

గీ|| చిన్నగాయంబునైనను। నన్నెలంత
శయ్యమీదనెజేరియు। చానయుండ
సకలపరిచర్యలనుజేసె। సతియునైన
కన్నగిసతి రేబల్కదనకను 877

గీ|| మాధవికి స్వస్థతయు గూడ। మానకుండ
కోవలుండు వివాహంబు। గోరిచేసు
కొనగయేర్పాటు జేసెను। కొంకకుండ
ధనము నాశించు భూసులు తానెతెచ్చి 878

మ॥ సుముహూర్తంబది।దగ్గరన్పడగ। యచ్చోభూసురుండొక్కరుం
డమరెన్దర్విప్యపునాళ। బందుగులు। నొక్కండ్రై నరాకుండనే
సమకూర్చెన్పదునాలుగేండ్లుగను।తాసామీప్యమున్చేరియున్
అమరెన్సిగ్గుల మొగ్గగాగ। నటనెంచన్లేనియానందముఁ 879

గీ॥ గొనుచు కోవలు ముందుకు। గూర్మివచ్చి
పెండ్లియాడినవెన్కను। విడువకుండ
తనదు లక్ష్యంబుసాధింప తానుతలచె
సతిని నై తిని। పతిదంత। సతికెజెందు 880

గీ॥ అనుచు కోవలు తనచేతగొనియునామె
బాగత్రాగించి పురివెట్టి। పడతివేశ్య
కన్నగీసతిదెసకును। కార్యమంత
జేయ। పురిగొల్పి పంపెను। చేడెయద్ది 881

కం॥ నీపయి వ్యామోహంబది
యేపుగనున్నదియనంగ। యిదిసౌఖ్యంబౌ
ఓపినమట్టుకుతెత్తును
నోపడతీయనుచునతడు। తూలుచు వెడలెన్ 882

ఉ॥ కన్నగియున్న కోష్ఠమును। గ్రన్నన కోవలుఁడందు జేరగా
కన్నులగాంచియాసతియు।గౌరవమొప్పనమస్కరించియున్
కన్నులుగానరానిస్థితి। గానగవచ్చెడు। వానికెంతయో
ఎన్నోవిధంబులన్స్తుతియజేసెను దానికి। కోశమివ్వగా 883

ఆ॥వె॥ కూడదంచుజెప్పె కోమలికన్నగి
యామెమాటవించు। కైపువలన
అగ్గివోలెవెలిగి- యామెనుగొట్టెను
నద్దిదాసిగనియు। నమితత్వరగ 884

గీ॥ కావు కావుడంచును కేక। కలికిదాసి
వేయవినియును। రెచ్చియు వీడకుండ
కన్నగిసతి నీడ్చియు। నున్నయుట్లు
వెలుపలకుద్రోసి। తాళముత్వేగ గొనియు 885

గీ॥ గనియుమంజీరములజాచి। గొనగనెంచి
సాహసింపగలేకను। చాలవెరచి
రక్తసిక్తంబు నౌచును। రామతనువు
కంపమొందుట। దేవంత। గాపుకేక 886

వ॥ అన్నివిడచి మౌనంబుగాయున్న దేవంతిని, యందు
గుంపులు గుంపులుగాజేరి వీక్షించుచున్న జనంబులంజూచి
జంకువడి యాయాసంబున రొప్పుచు, బలమంతయు నుప
యోగించి, తలుపులను బంధించి, పాదంబుల కదల్పనేరక,
కవాటంబు నానుకొని గూలంబడియె 887

ఉ॥ ఆదినమంత కోవలుని యండకుజేరగ సాహసంబునున్
పోదగునట్లు చేయకయ, పూర్తిగనుండిరి కోవలుండునున్
ఆదరి ద్వారెమందుననె, యట్టులతాబడియుండి, త్రాగకన్
వేదనతీరమధ్యమును, వీడియునుండియు కన్నువిప్పియున్
888

గీ॥ చుట్టుబరికింప, శూన్యంబె, నట్టిగాను
పించె తలపోటుపెద్దగా, వీడకుండె
మిట్టమధ్యాహ్నమైనను, నట్టెనందు
పలుకరింపగరారైరి, వనితగాని 889

గీ॥ దాసదాసీజనంబులు, ద్వారమునకు
వెలుపల త్రాకపోకలు, సలుపుచుండె
రెవ్వరందులేనప్పు, డిట్టెలేచి
గడియవేసియు సేవకువడిగపిల్చి- 890

కం॥ కన్నగివచ్చిన తలుపులు
నెన్నగయాలస్యమింత జేయకమీరున్
తిన్న తెరువుండనియని
కన్నెత్తియుచూడకుండ గబగబచనియెన్ 891

ఆ।వె। తల్లికొరకునంద। తనయయునుండగ
గాంచెకోవలుండు। గాంచగానె
ఉలికిపాటుతోడ। వున్నట్టి తనయను
భ్రాంతచిత్త యగుచువణకుదాని 892

గీ॥ సుతను జూడంగ నడుగులు నతికినటుల
నిలువబడిపోయి। యామెచే గలుగ ప్రేమ
గాంచతనదు రూపమెనట। గానబడక
ప్రేమవుప్పొంగ భుజములు। వీడకుండ 893

కం॥ పట్టగరాకను ప్రేమయు
గట్టిగహృదయంబునకును। కాదనలేకన్
అట్టేయదు మగస్పర్శకు
నట్టిట్టయి జూచుచుండె। తండ్రిని సుతయున్ 894

చం॥ కనులను జాలువారుచును, కాల్వలుగట్టెడి యశ్రువాహినిన్
తనమదియందె, నిల్పగను, తానటుశక్తియులేక యేడ్చుచున్
గనుగొని, యెంతపాపమును, గట్టుకపుట్టితి వీవు తల్లి, నీ
ఘనమగు పాపకూపమున, కాదనలేకను గూలిపోయితే 895

గీ॥ అనుచు వెక్కిళ్ళు వెట్టుచు, నశ్రువులను
వదలు కోవలు మాధవి బాగగాంచి
ఎదురుపడకుండ చాటుకునదియుబోయి
తండ్రి కూతుండ్రు నొకటిగా, దరసిరిందు 896

ఆ.వె. అదియు జాలునాకు, వదలక కోవలు
డట్టినాదువంక, నతడు నిలచు
ఆంచు సంతసంబు, నందియు వెలదియు
పొంగిపోవుచుండె, పూర్తిగాను 897

సీ॥ ద్వారము మూసెను- తగదని కోవలు
డందరిజనములు, నడ్డగనియు
అందరక్షమియింప- నామెయు తలవంచి
వేడియు, దేవంతి వెంటరాగ

ధర్మశాలను మామ- తగువైన రీతిని
గట్టించెదానిలో- కరముజేర
వెడలగ, దేవంతి- వీడకముందుగ
దారి జూపుచుబోయె, దాసియయ్యు

గీ॥ కోట్లకుండెడు వారికి కూర్మితనయ
కులవధువు పాదచారియై, కూలపరువు
వీధినడువంగ గాంచియు- విడువకుండ
పురమునంతయు గగ్గోలు, పొందియుండె 898

గీ॥ ధర్మసత్రం పుయధికారి తానెవచ్చి
యాశ్రయంబును గోరగ, యద్దిగాంచి
సర్వనాశన మదిగూడె, సర్వమిందు
నేమిమిగులగలేదమ్మ, యేమిలేదు 899

గీ॥ వినగరానట్టి కార్యమే, కనులగాన
వలసివచ్చెను పురమంత పాడుబడియు
బోవుకాలము వచ్చెను పూర్తిగాను
నంచుబలికియు లోసల, కంపియామె 900

చం॥ ఇదివిని శ్రేష్ఠిదారుణము, నెంతయొ ఘోరమునైన వార్తనున్
మదియటుతల్లడిల్లి, యటమానియుచేష్టలు, గూరిమందియున్
పదపడిదిగ్గునన్నతడు, బాగుగలేచి, హతాత్తుగాగ, తా
వదలక పల్లకిన్ త్వరగ పట్టుకరమ్మని యాజ్ఞయిచ్చియున్ 901

చం॥ వదలగలేని జీవితము, బాసినయట్టులవేగ, పల్లకిన్
హృదయము తల్లడిల్లగను, నీక్షణజేయగ ధర్మసత్రమున్
పదపదమంచు వేగ, జనె, వచ్చినతండ్రినిగాంచె పుత్రియున్
పదయుడునైన వానిగనె, చానయు దేవతి యంతనందునన్ 902

వ॥ అంత దేవంతి హృదయవిదారంబుగా రోదించుచు, మాహా
శ్రేష్ఠి పాదంబులపై బడి, మీపుత్రిక కన్నగి యేరూపంబున
నున్నదో గాంచుమని రోదించు, దేవంతి తల నిమురుచు
నిలుచుండ- 903

చం॥ అనఘునితండ్రిగాంచి,యటశయ్యను డిగ్గగబోవనాపియున్
తనువునగాయమూర్తగుల,తాసునుశాంతముతోడ, మోమునున్
ఘనముగ వెల్గుచుండగను, గారియపెట్టెడి మాసంబునున్
ఘనుడటనిల్పలేక, సుతగాంచియు కౌగిలిజేర్చె నామెనుః 904

గీ॥ కనులుమూసుక నుండిన కన్నగికిని
యెప్పుడోపోవు తల్లియు। యిట్టెమదిలొ
మెదల కన్నీటి చుక్కలు హృదయమందు
జారజూచియు। శ్రేష్ఠియుచక్క బలికె 905

మ॥ కనులన్నింపగనేలతల్లి। యికనాకా దుఃఖసంబంధముల్
గనరానీకను। నేనుపుత్రునిగ। నిక్కంబిందుపిండంబులన్
అనియంబున్నిట పెట్టగాదగుదు। నీవంచున్మదిన్నమ్మియే
గనుగొంటిన్నిట। రెండుమార్గముల। నీకాంతన్ని కన్తెల్పనొ 906

మ॥ నినునేగొంచును। బోయినాగృహమున న్నినుంచివ్యాపారమున్
గొనిరాజిల్లగ। నెంచినాడ। వటుకాకున్న న్నిలన్సర్వమున్
జనియు న్రాజునకప్పగించియును। నేసన్యాసము న్బూనెదన్
గొనుమా నిశ్చయమేదొ మదిన్నిక్కొర్రెన్నెటుండునో 907

సీ॥ కన్నగిగాంచయు- కన్నతండ్రియునటు
పలుకంగ వినియును- పలుకకుండ
కనులుమూసుక నుండి- కాసంత యోచించి
నీవుపల్కినదెల్ల- నిక్కమగును

మీదు రెండ మార్గమెంతయు మేతాను
శ్రేయస్కరంబునై - చెలగునద్ది
మెట్టినింటినిపీడి- పుట్టింటికేగుట
కిచ్చగింపకయామె- యిటులబల్కె

గీ॥ కన్నులశ్రులుగారగ, కన్నతల్లి
గర్భమెంతయో పుణ్యంబు, గాంచెనమ్మ
వంశములు రెండు ధన్యంబు, బడసెనమ్మ
నాదుదుఃఖంబులన్నియు, నన్నుపీడె 908

గీ॥ శాంతిలభించేతల్లిరో, జాలునాకు
ననగ, కన్నీరుగార్వలై, యందుగార
ఆమహా, శేష్ఠి, సన్యాసమందు కొనగ
యన్నియేర్పాట్లుచేయగ నాజ్ఞయిచ్చె 909

సీ॥ తనమదినుండిన- ఘనమగు కోర్కెయు
ప్రభువులకీరీతి- వ్రాసిబంపె
నాదు కోశమునంత- నీదరిజేర్చితి
వర్తకుల్చితికిన- వారిబ్రతుకు

బాగుజేయుమటంచు- వ్రాశియు మాసొత్తు
వంశంబు చరితంబు- వదలకుండ
మాధవి కోశంబు- మాయతోలోగానె
దానిగైకొని- వేగద్రావినంత

ఆ॥వె॥ వర్తకాభివృద్ధి॥ బాగుగజరిపించి
స్వర్గమూను శ్రేష్ఠి॥ చల్లబరపు
అందుమీదవచ్చు॥ నాదాయమునవింత
వారికిచ్చి బ్రతుకుదారి జూపు 910

చ॥ అనుచును వేడిరాజు॥ తనదానపు పత్రము॥ పంపి॥ వెంటనే
గొనయధికారమంతనిట॥ గూర్పుమునొక్క నిబంధముక్తునిన్
ననునొనరింపుమంచు వినయంబున॥ పంపినదానిగొంచునున్
గొనుక్షణమందెనొక్కనిని॥ గూడగనాయధికార మందునన్ 911

ఉ॥ పంపుచురాజు॥ లేఖనటు. పంపెను శ్రేష్ఠికి దానిజూచియున్
తెంపునజేసుకొన్న తపధీగుణమార్గము॥ నింతవీడకన్
పంపినశ్రేష్ఠి సూచనను॥ బాగుగకోవలు॥ తండ్రి కోశమున్
సంపదయంతగైనగ చానయు మాధవి కొయ్యబారెగా 912

గీ॥ ఏదియంటని యోగిగా। నింతయుయిన
పలుకకుండగనుండె। కోవలుండునందు
గృహమువీడి మహాశ్రేష్ఠి। కోర్కెదీర
దానధర్మంబు లెన్నియో। దగినరీతి 913

కం॥ చేయుచులెక్కకు రానటు
బాయక జనమంతరాగ। వర్తకవిభుడున్
బాయగ కావేరీపురి
తోయములటడాట తానుతోతేరంగా 914

గీ॥ వేషభాషల వీడియు। వెడలిపోవ
తానుకాషాయ వస్త్రముల్తగునటంచు
వేగధరియించి వారికి వినతిజేసి
పడవనెక్కెను వర్తక। ప్రభువునంత 915

ఆ।వె। వీడుకోలునివ్వ। వీడకనగరంబు
సుంతవిడువకుండ। యంతవచ్చె
ప్రేమపాత్రురాలు। ప్రియపుత్రిక
కోవలుండుతక్క। కొరవవారు 916

వ॥ వచ్చి వీడ్కోలు జేసిరి। దేవంతి మాత్రము వచ్చి
ప్రణామంబుజేసె। చేలమ్మ జనసందోహంబున నిలువ
బడియుండె 917

కం॥ చిరపరిచిత కావేరీపురి
తరలినయట్లందుబాధ। తానునుదవిలెన్
పురివదలిన మాసాయిని
పరికించియు యన్యభావ। భావనతోడన్ 918

కం॥ ఎక్కడ విన్నను। రాజును
నిక్కడ జేరుటయె తడవు। విందునజేరన్
అక్కలికి వేశ్యకిందున
యక్కజమౌశిక్షవేయ। ననియెదుచర్చల్ 919

గీ॥ శిక్షబడవలె మాధవి। జేరుగర్వ
మంత। పోవలె కులసంప్రదాయమంత
పూడ్చుదానికి। శిరమును। బూనిగొరిగి
గార్దభంబును నెక్కించి। కట్టిదాని 920

కం॥ మణిమేఖల కొరకై యట
వనితయుయేదైనగాని। బాయకజేయన్
గొనదట వెనుకంజయు। మరి
మనముప వేశ్యంపుభావ। మందియునుంటన్ 923

గీ॥ రాజప్రతినిధి నాకట్టియోజనల్పి
జాలిగొలుపంగ యెంతయో చక్కతెల్పి
తాపతివ్రతభావంబు దగులువడుట
మనసుకెక్కెడునంతయు। మమత గొలుప 924

సీ॥ తనవ్రతాచారంబు- తగుపైనతీతిని
మాటి మాటికిజెప్పి- మానినిపయి
గలుగగనపోహయు- కామినిమాటలు
విసిపించెనందున విడువకుండ
ఏరీతిగానైన- నెంతయు కార్యంబు
సాధించుకొనివచ్చె- చానయామె
ఆకారణంబున- యావేశ్యకాంతయు
క్రమము తప్పక రోజు- గనగబోయె

గీ॥ కోవలుని పట్ల ప్రేమయు। గూడియుండె
పరపురుషమదిలోనను। వరలచేయ
కుండె। తనకున్న తెలివిని గూడియామె
దానికవకాశముండిన। దానిగొనగ 925

వ॥ ఏల జంకు గొనవలెయుని యామెతలపోయుచుండె 926

చం॥ దినములునట్టులేగడువ। తీర్చినపాచిక యద్దివెంటనే
గొనియెను। తన్నెపీడగను। కొంచెముమార్గములేక దానినిన్
గొనగను। మానసము గూడగబేదము। నామెయుండగా
వనితనుబొందుకోర్కెయది బాగుగమించగ నాతదెంతయో
927

ఆ।వె। పొందుగోరుచుంట- పొందియుభీతియు
వేశ్యసతికి మదిని భీషణంపు
మదనమెంతొ జరిగె మహిమయందు
రాజుకు। ప్రతినిధినటవదలి। పరుగులెత్తి 928

కం॥ వచ్చియు కోవలుహత్తుక
నచ్చెలువయు। కోర్కెదీర। నరసుఖమందున్
ఎచ్చటజూచిన నస్పృహ
హెచ్చెను భయమదియు। మించె। యెంతయుమదినిన్ 929

ఉ॥ కన్నగినుండి, కోవలుని, కాంచనభూషణ ద్రవ్యరాసులన్
క్రన్ననగైకొన గ్గలుగు, కాదనరానిది తోషమూనె, తా
నన్నియుగూల ద్రోసియును,వర్తక శ్రేష్ఠుడునొక్క మాటతో
అన్నియుగూల ద్రోసెనని, యామెయునెంచెనుసిప్పిహాయయై
930

గీ॥ అగ్నిసాక్షిగ పెండ్లాడి, నట్టియామె
వేశ్యకాకుండ సతిగనవశ్యముండె
సాక్ష్యమింతయులేదయ్యె జనులునిందు
నెట్లునమ్మెదురని మదినెంచియామె 931

మ॥ మణిమంజీరములున్నతీత్వము నిటన్మన్నించు సాక్ష్యంబుగా
గొనగాన్నాతలంచి,మాధవియు,తాగూడంగవాంఛించుచున్
వనితారత్నము కన్నగీసతిని, తాబాయంగనేచేయ, తా
ననునెట్టన్నపుడవ్వి కోవలుడు, తానుస్త్రీయగా బోవుటన్
932

వ॥ జూచినదిగాని, తనకోరిక తీరకపోయె, యేవిధంబున నైన
మణిమంజీరంబుల బొందనిశ్చయించె యందుతన ప్రాణం
బులు పోయినను సంతోషంబని నిశ్చయించె 933

సీ॥ ఇంద్రోత్సవంబులు- నెంతొ వేడుకజేయ
పట్టణంబంతయు- బాగుపరచి
చోళదేశాధీశు- పాలితమౌచును
కావేరీనగరంబు- కలుగనుండు
రాజధానిగయద్ది- రాణించుచుండుట
యుత్సవంబులు- నెంతొ యుత్సుకతను
నూతన వధువునే రీతిసింగారంబు
జేసిది నారీతి జేసిరందు

గీ॥ నాట్యమాడెడువారలు। నగరమందు
యైంద్రజాలికులెందరో। యందుజేరె
కవులుగాయక పండితబ్రువులువచ్చి
పురమునందుననుండిరి। పూర్తినిండి 934

చం॥ పతియిటువచ్చి పట్టణము। బాయకనుండుటజేత। నింకనున్
అతియగు వేశ్యవాడలిక। యన్నియు మాసెడునందువార్తలున్
సతతమువచ్చె। వర్తకులు। చక్కగవర్తక మెంతో వృద్ధినిన్
మతినిడి జేయునంచునట। మానవారు తలంచుచుండగా 93

మ॥ వెలయాండ్రందరు।పై భవంబులతో।నవ్వటన్మహాగర్వమున్
వెలయింత్రంచును।రాజువచ్చియును।తావేశ్యాగృహంబందునన్
మెలగన్నుండెడి।రత్నభాగ్యధనముల్మేలంచుతా లాగియున్
వెలయాండ్రన్నట గర్వహీనులుగ। తావేగంబుచేయించుగా 936

గీ॥ వేశ్యలందరు నంతయు వినియువారు
ధనమునంతయు। బూడ్చిరి। ధరణియందు
పురినివీడియు కొందరు బోయిరపుడె
నాల్గురోజుల పతియును। వెళ్గనచట 937

కం॥ అనియనుకొను చుండిరినట
గనగనుపద్రవము। నొకటి। గ్రక్కునవచ్చెన్
అనుకొననిరీతి నడియటు
ఘనముగ పొంగుచునువచ్చి। కాఠిన్యమునన్ 938

ఆ।వె। పొంగిపొరలినదియు। పూర్తిగ। రాజుకు
స్వాగతంబుపలుక। ప్రబలముగను
అందుజేయబడియు। నత్యంతశోభతో
వెలయుజేయునన్ని। జలముగలసె 939

కం॥ బీదజనంబుల గృహములు
నాదరినుండుటనునవ్వి। యందునగలసెన్
ఏదరిగానక వారలు
నాదరిహాహారవంబు। లందరుజేయన్ 940

సీ॥ నారీమణులగూడి; పూరుషులెందరో
నటవిహారంబులు- నందుచుంద్రు
అట్టిదిజనులెల్ల- నందు లేకుండ
నిర్జనంబౌచును- నెసయుచుండె
ఇంద్రోత్సవంబుల- నెసయంగ వెలసిన
స్వర్గంబు- నేటిలో జక్కగలసె
వెల్లువజూడంగ- వేకువఝామున
జనులుగుంపులు గూడిజనుచునుండె

గీ। కోవలుండును మాధవి। గూడిబోవు
గోర్కెవెలిబుచ్చ। మాధవి। కోడెత్రాచు
భంగిబుసకొట్టి। నీకేతి బలికెనద్ది
బ్రతుకుకది యొక్కటే। తక్కువయ్యెనాకు 941

చం॥ వరదలలోన నుండినటి బాయని యశ్రులగొట్టు గొంచునున్
సరగునబోవనుంటినది చక్కగబోయినవారె భూమినిన్
కరముసదృష్టవంతులుగ గాంచిరివారలు సానుభూతినిన్
ధర దురదృష్టమంతులిట దాటిననుండిన నొక్కపేగదా 942

గీ॥ వేశ్యపల్కులు వినియును వీడెనతడు
సహనమంతయు రెచ్చియు చానజూచి
బక్కపురుషుండు స్త్రీకియేపాటునైన
జేయరానట్టి దానిని జేర్చినాను 943

సీ॥ నామామగౌరవ నాశంబుజేయగ
వైభవంబును వృత్తివదలినాను
నీకొరకిందున నేనవహేళన
యపకీర్తి యెంతయో నందినాను
వంశప్రతిష్ఠకే- బాయని మచ్చను
జేకూర్చితృప్తిని- జెందినాను
ఉన్నదంతయు- నిచ్చియున్నను నికును
తృప్తిని జేకూర్చ తీర్చలేను

గీ॥ వేశ్య వినియంత నీరీతి, వేగబల్కె
యెన్నొ మృష్టాన్నములు నుండి యింతవుప్పు
లేకపోయిన, దేవుడనేక(మైన) భంగి
సుందరాకృతిజేసియు జూడ(ప్రాథ 944

గీ॥ ఇంతలేకుండ జేసిన యేమియౌనొ
పతియునుండియు రాజ్యంబు బడయకున్న
పేరుతోడుత నేమౌను, వేశ్యయింట
పెరిగి, వధువుగా నేనిందు బిలువబడుచు 945

వ॥ ఉన్నను నన్ను, సతిని పిలుచు వారు లేరు గదా 946

ఉ॥ ఎంతయొ (ప్రేమజూపినను, నేనిటగుండెను కోసిపిడకన్
పొంతలజేర్చి పెట్టినను, పూర్తిగ జీవితమంత మీకునై
యంతయుధారవోసినను, నయ్యయొనాకొరకింతత్యాగమున్
ఎంతయుజేసినాననుచు, నిప్పుడుబల్కితివిద్ది త్యాగమే 947

వ॥ అని మాధవి యనవిని కోవలుండు 948

గీ॥ నీదు(ప్రేమంవు విలువయే, యెంతదైన
నాదుహృదయంబు, శాంతినియందలేదు
అనగనౌనౌను, శాంతిని యందలేదు
యేమిచేయగలారము, నిందుమీకు 949

ఉ॥ ఉన్నది శ్రేష్ఠికూతురట। యూర్వశివోలెను। దేవకన్యయై
మిన్నునమండి భూమికిట। మీకొరకై దిగివచ్చి। నేనునున్
కన్నులకింద దయ్యముగ। గానగవచ్చితి। లోకమందునున్
ఎన్నగవచ్చుహీనగుణ। మెంతయుబొందిన దాననంచునున్ 950

కం॥ కన్నీరుగార కన్నుల
యెన్నడులేనట్టి। కోపమెంతయుగలగన్
ఉన్నను। మాధవి ముఖమును
కన్నులగాంచుననుండ। గలిగెను దయయున్ 951

ఉ॥ కన్నగిపైన యీనతియకారణ ద్వేషము నీవు। బొందగా
ఉన్నదియేమి యామెదెస। యుత్తమమౌభవనంబునీకునున్
ఉన్నది।యన్నిహక్కులును।నూడగపాపమునామెదిక్కునున్
మన్నన గాంచలేక। సతిమానిని వీడియుబోయె మాధవీ 952

ఉ॥ ఔనిట। పాపమానతిని। యుండగనివ్వక। వెళ్ళగొట్టగా
కానిదిచేయనేల। మదికాంతతీనీవును। నుంగవచ్చుగా
దానదయార్ద్రశీలురయి। దాసిని నీభవనంపు రాణిగా
పూనియుజేసినాడవది। పూర్తిగనుండునె। రాజురాగనే 953

ఆ॥వె॥ నాదుగృహము ధనము। నంతయులాగి
వెళ్ళగొట్టనుండ। వీడిపోయి
వీధులందు నేను। విడువక నుందునో
దేశమీడిపోయి। తిరుగవలెనొ 954

చం॥ అనియనిపల్కి మాధవికి। యశ్రులుకన్నులగార। భీతియున్
గనుపడ। నామె మోముగని। గ్రక్కున కౌగిలిజేర్చి। యిట్లనెన్
మనమున నుండగావలయు। మాటిదిగాదిట పిచ్చిదానివే
ఘనడగురాజు నీగృహము। కాదనినెట్టిననెట్ట వచ్చుగా 955

గీ॥ కానినానుండి వేసును। గాదుజేయ
వంశగౌరవమందున వైభవంబు
పైన। యభిమానముండెడు। బాయకుండ
యట్టిగర్వంబుతోడు యానాడుజంప 956

వ॥ ఉద్యుక్తుండనైతి యేనాడు నాభార్య కన్నగిని యింటి
నుండి వెడలించితినో యానాడే యన్నివిలుప్తంబయ్యె
యికనీవీనాకు మిగిలియున్న దానవు 957

కం॥ నేనిక నాలుగు రోజులు
కానగనిట నుండుదాన, కావునయనుచున్
మానినమాటలు రాకను
దానినిగని కోవలుండు, తడయక బల్కెన్ 958

చం॥ భవనము గైకొనున్దనము బాయక పుచ్చుకొనున్గదా, మదిన్
అవగతమయ్యెనిదునిక, యంపునుపట్టణమందునుండియు
భువినినుగూడియే వెడలిపోవుదు పట్టణమీది నంచునున్
అవివిని వేశ్యకాంత, యిటులాడెను, నెక్కడజేరగావలెన్ 959

సీ॥ మనమిద్దమైన- గొనియును భిక్షంబు
బ్రతుకంగ వచ్చును- విధియటంచు
మణిమేఖలను వెంట- మనమునుగైకొని
పోవంగ దస్సులు- పొదివిచుట్టి
నాకూతుగొనిపోయి- నావిధంబున వేశ్య
కమ్మంగ నేనేమి- గనెడుదాన
అనవినా యోచించి- నాకోవలుండును
దాటయుపాయంబు- తరుణి చెప్పుమ

గీ॥ భవనమంతయు పోవంగ। నాగమనము
చిన్నగృహమును గైకొని। చేరుదవుట
నీదుదరినున్న ధనమది। నిందుపొదుపు
జేయచాలించు మనగను। శీఘ్రమనియె 960

కం॥ దానినిగైకొన। రాజును
బూనియు వేశ్యకునుశిక్ష। పొందగజేయన్
గానగరానిది లేదిట
పూనుడు। సతులందురాజు పొందెడు ప్రేమన్ 961

కం॥ పతి యెడనపచారంబును
సతివిసమును పెట్టకున్న। జాలడు రాజున్
సతికినిదండన జేయగ
నుఱియందుననుంచుమీవు। మానకయనగా 962

సీ॥ మాధవి మనసులో- మరిగెను మాటయు
కోవలునకునింత- తోపకుండె
అటుపైన యేమైన- నామెయుచెప్పునో
యనుచునునాతడు- సతివజూచె

పెదవియు కదుపక- వినువీధిజూచుచు
నున్నట్టి మాధవి కన్నులూర
భయముతో ముఖమంత- పాలియుబోవంగ
పెదవులు వణకెను నదటుతోడ

గీ॥ హృదయమంత ద్రవింపగ యింతజూచి
ప్రక్కజేరియు కోవలుడక్కలికికి
తలనునిమురుచు భయమేల। తరుణినీకు
కఠినశిక్షను విధియింప గనడురాజు 963

ఉ॥ ఎంతటికోపమున్న। పతియింతటిఘోరపు క్రూరకార్యమున్
సుంతయు నొప్పదామనసు। చూడిటుజ్ఞాపకమున్నదే మదిన్
అంతటిగొప్పదౌసభలో యందరుజూచుచుండ యందునన్
కాంతరొగౌరవంబులు గంటిమి నుండును సానుభూతియున్ 964

గీ॥ సంఘమందున దోషిని। చానకాని
చెడ్డయో మంచియోనిట। జేసియుంటి
తరుణి కొరకొచు త్యాగంబు। దానిఫలము
కొంతయైనను లేకుండ। కాంతబోదు 965

చం॥ అవసరమైన నేనెఱని। యంత యురాజుకు విన్నవించెదన్
భువినిటు ప్రేమకు స్థలముబొందినకట్టిది।యిందుసొత్తునున్
అవగతమౌనటుల్ కుదురజాలదు। ప్రేమ। యనంత విశ్వమం
దవహితమౌచు నడ్డుగనరాకను। పోవుచునుండు నెప్పుడున్ 966

గీ॥ సంఘమెంతయు వృక్షంబు చక్కబోలి
నిడనిచ్చుచు। వృద్ధియై।నెగడుచుండు
అవధిదాటియుబోలేదు। నద్దిగా
ప్రేమయాకాశమంచున। విమువకెపురు 967

కం॥ నేనును యాకాశంబున
గానగరానట్టులందు కడువేగమునన్
పూనికబోయితి। భయమును
బూనను। నోరమణియెందు। పూర్తికనికనున్ 968

ఉ॥ కోవలుమాటలున్వినుచు।గూడిముదంబును। వేశ్యకాంతయున్
ఆవడినిల్పి। కాంత। పనియప్పుడు యెప్పటియట్లరాగ। యా
కోవలుగాంచి। నింకనిటగోరి విహారము। నాకాసంబునన్
నీవునుజేయుచుంటివిట। నిక్కపులోకము దానికింతయున్ 969

గీ॥ సుంతపొంతన కుదరదు। మీదుహృదిని
యెంతయును దాగమున్నను నాదుశత్రు
గణము। రాజును జేరియు। గనియువారు
పన్నకూతురు మాధవి బ్రతికియుండ 970

ఆ। వె। పురమనిందునిపుడు। పూర్తిగదానిని
యురికి పంపకున్న। యూరునాడు
చెడునటంచుజెప్ప। జేరెనె విస్మయ
మిందు మిమ్మునేను। నిట్లుజెప్ప 971

కం॥ పురమునసుండెడి వారలు
సరగుననిట్లాడుచుండ। జాలగవింటిన్
ధరశ్రేష్ఠియు సన్యాసము
త్వరగైకొనె। దానిగొనియు। తప్పకవారన్ 972

గీ॥ పన్నపైనుండు। క్రోధంబు పన్నజావ
దానితీర్చుకొనంగను। దారిలేక
నాదుపైనింత పగయును। నింతపోక
తీర్చుకొనగను తలచిరి। తీరికగను 973

ఉ॥ మౌనముబూని, యోచనను, బూనియు పట్టణమీది నేగగన్
బూనెభయంబు, నుంటకును, బొందెభయంబు, ముందునుయియున్
గావగవెన్కఁ గోతి, యెటుగానగరాదట బోవుమార్గమున్
దానమునీవునేను, యిక, తప్పకయీనది నీటమున్గుతే 974

చం॥ శరణము, వేరుదారియిక, చానరొకానగరాదు, నింకిటన్
కరము సుఖప్రదంబగును కామినినామణిమేఖలాఖ్యసుఁ
ధరణి సమంపుశాంతి నిటదాలిల్చిన కన్నగి చేతపెట్టినన్
వరబెడి నింకనీపు, నీట, పట్టగగోరెది కార్యమంతయున్
9.5

గీ॥ ఏమి మాట్లాడకుండిన, యింతిగవియు
క్షణము యోచించి, నాతోడ మునిగిజావ
సిద్ధపడవిట, నీరాత చేరునట్లు
నట్లైయనుభనించుమునను, నతివయంత 976

కం॥ సౌమరి, యసమర్థుకునగు
నామనుజుని గట్టుకొన్న, యతివయుధరలో
ఏమనియడుగక, కష్టము
లీమాడ్కిని యనుభవించు, నెప్పుడు విడకన్ 977

ఉ॥ వారధూటి పల్కులవి। బాణము పోలికవచ్చి నాటగా
జారుడు। కొన్ని వర్షములు। జారకమున్ననిదే సమస్యపై
వీరుడు। నొచుకత్తిగొని। వేగమచంపగబోయె। మాధవిన్
మీరినకోపమంది। నిటమించిన నిప్పులవోలె కన్నులన్ 978

గీ॥ మెరయచురచుర జూపుతో। తరుణిజూడ
పెడమొగంబుగ గూర్చుండి। పడతియున్న
అట్లు నిట్లును తచ్చాడి। యతివదరికి
నేనశక్తుడనంచని నెంచినావె 979

ఆ।వె। వీరుడైనవాని। కూరిమిభార్యకు
నురియుదీయునంచు। నురకదేల
అనగనిన్నునురిని గొనితీయువాడును
లేదుపిచ్చిభయము నేడదేల 980

గీ॥ పిచ్చియో రోగమో నోటవచ్చినట్లు
ననుడు। నేనునుచచ్చిన। యంతమీద
కన్నగిని గూడుహాయిగా మున్ననాడు
శక్తిలేమిని మాధవి। చావలేదు 981

వ॥ శరీరంబున ప్రకోపించిన రోగంబువలననే మరణించెనని పల్కుడు 982

గీ॥ లేనిచావును నూహించి। చాననన్న
యిరుకుననన్నెట్టె గోరియు। నిట్లునాడ
నాదుప్రాణాలపై యాశ। నాకులేమి
నీదుప్రాణాల కొరకునై। నేనునుంట 983

గీ॥ వదలినిట్టూర్పు మాధవి। వద్దులెండి
యూకదంపుడు మాటలనేకమార్లు
వినియుంటిని క్రొత్తగావినెడిదేమి
మనసునుండిన మార్గంబు। గనకయున్నె 984

కం॥ ప్రాణముల మీద మోహము
బూనియునిటనున్నవేగ। పూర్తిగ। మీరే
దేని। యుపాయము మదిలో
గొనకనిట నుండువారె। గ్రన్ననజెప్పుతీ 985

ఆ।వె। తెచ్చిపెట్టికొనిన। తేరయౌదుఃఖంబు
వెడలగొట్టనేను। వేగజేయు
నాయుపాయమింత। నడలకచెప్పుము
నీదుకొరకు నేను। చేతునద్ది 986

చం॥ నిశితముగాగ। కోవలుని నీతిమతిన్గని। మెల్ల మెల్లగా
విశదము చేయగా జనియు। పీడకహస్తము నాభుజంబునన్
కుశలముపొందనుంచియును। గూడెనుపాయమునద్దిజెప్పెదన్
విశదముగాగ యంచనగ। పీడక। కంఠము నాస్వరంబునున్
987

వ॥ ఆందోళన వలన స్వల్పంబుగా వణకె 988

సీ॥ ఏమియులేదిట। నిందువ నేనును
కొన్నిరోజుల కోరకిన్నిచెపులు
సోదరి కన్నగి- శుభ్రంపు కళ్యాణ
మంజీరములు తెచ్చి- మంచిగానె
నీదుభార్యనటంచు- నెరుగంగ నెల్లరు
గుర్తుగనవ్వియు- గూడియుండ
తెలసినరాజును- తిన్నగనన్నును
నేమిజేయంగ లేడునిద్ది నిజము

ఆ।వె। బాగుపడినస్థితియు। పదపడినవ్వియు
నిచ్చివేయవచ్చు। నీదునాజ్ఞ
వానిదాల్చుహక్కు। బాగుగనాయదె
యయినమీదుమాట యవనిదాల్తు 989

కం॥ ఏమియు పలుకని కోవలు
నామెయు నొకనిముసముంచి, యంతటయతనిన్
ఏమంది నేనుజెప్పిన
దేమియుమదికెక్కలేద, నింతయుననుచున్ 990

ఉ॥ లాలనతోడహస్తము, విలాసముతోడుత చేతగైకొనెన్
బేలయుడగ్గరజ్జరిగి, లేగముద్దిడి, యుత్సవంబునన్
కాలికియవ్విదాల్చియును కాదనకుండిక, మీదుప్రక్కనే
చాలగనేను రాగయిట, చక్కగమీదగు కీర్తిపొంగదే 991

ఆ. వె. ప్రేమయనగనేమొ, వివరంబుగానిందు
చెప్పుకొనెడు, వీడకప్పుడిందు
ఒక్కపనిని మీరుచక్కగ సాధింప
కున్న నేమియగునో మిన్నకుండె 992

కం॥ అనియును మాధవి మౌనము
గొనగను నదిగాంచివేగ, కోవలుడందున్
వనితను గనుగొనియిటులనె
గొనిరమ్మట పానపాత్ర, కోరికతీర్తున్ 993

గీ॥ బాగ త్రాగించు। నీదగు ప్రాణములను
నిలుప। కన్నగి ప్రాణము ల్దులుపుటకును
భయము లేకుండునట్లుగ బాగనన్ను
నిందు ప్రోత్సాపరుచుట। పొందగాను 994

గీ॥ నాకు ప్రాణంబులేలను। మీకు చెప్పు
నట్టి మణిమంజీరములవ్వే। యందజేయు
ఆమె ప్రాణముల్బోవంగ। నపుడెరాజు
నాదుజీవంబులుంచునె। యవనియందు 995

ఉ॥ ప్రాణములున్నదాక। మరిబాయదు తానధికార మింతయున్
తానన। యౌనునెందుకిట। తానును దీడును। శక్తిహీనుడన్
ఏనును। సోమర్పిరికి। నెందునుగానను సత్యమిందునన్
తానటనవ్వి। తిట్టిపియు। తథ్యమునన్నెగ త్రోయలేవుగా-
996

గీ॥ ఏనుజీవిత మంతయు। సిబ్లైతిట్ల
మయము మార్చివేసితి। మానినియిక
ఏమిసామర్థ్యమున్నది। యింకనాలొ
యయిన నొకసారి జూపింతునద్ది గనుము 997

ఉ॥ చాలగ త్రాగితూలుచును, చానయు కన్నగియున్న సత్రమున్
మేలనిపానపాత్రగొని, మెప్పును బొందగవేశ్య దగ్గరన్
చాలగజీర్ణమైనిలచు, సత్రపువాకిట మున్ను నెందరో
ఏలనుకుండ, పెట్టగను, నెంతయుతృప్తిని బొందిపోవగా
998

వ॥ ప్రసిద్ధింజెందు సత్రంబు మహాశ్రేష్ఠి నిర్యాణానంతరంబున
జీర్ణంబై శిధిలావస్థ జేరెనొక్క వృద్ధ సేవకుండు దానిఁ
వీడలేక కాచుకొనియుండె. 999

గీ॥ తప్పత్రాగియు, కోవలు, దప్పుడందు
మురుగుకల్లుతో గూడెడు, మురుగుబాన
వోలెనుండెడు, కోవలు డొప్పుగాను
నోటికింవచ్చినట్లుగ, పాటుపడుచు 1000

కం॥ వచ్చెడు యజమానినిగని
యచ్చోటనె నిలచిపోయె, యాశ్చర్యమునన్
అచ్చపలుడు మత్తులోపడి
యచ్చోటికివచ్చె వెంటపరిచారికలున్ 1001

గీ॥ వెంటనుండగ వచ్చియు। విసురుగాను
యెవడురా యిచ్చటనునిండు। శ్రేష్ఠియు
ఉన్న। దానిని వేగమే। యుండనీక
గెంటు। యెవరిట నీచోటునంబురాదు 1002

గీ॥ సత్రమిదినాది। నాతండ్రి। చక్కగాను
కట్టినాడిట। నొకడనే। కరముమీద
నుందునంచును। కేకలు। నూరుమ్రోగ
యడుగులేయుచు। ముందుకు। నడచెవేగ- 1003

ఆ।వె। భయముతోడ ముసలి। వణకుచు చేతులు
కట్టుకొనియు నిల్వ। నట్టెనతడు
మరల మరల యడుగ। మానిన చెప్పక
మునలివానిగొట్టి। ముందుకొచ్చె 1004

కం॥ ఎత్తినచేయియు దించక
నత్తరి చీడీలమీద లడచెడు దానిన్
క్రొత్తగ మునివసనంబులు
మొత్తము ధరియించిరాగ। మూర్ఖుడునందున్ 1005

కం॥ చేలను గాంచియు। చేతిని
చాలగనటుదించి యతడు। సంభ్రమమెసగన్
ఏలను వేశ్యలవీధికి
చాలన్నను దెచ్చినారు। చవటల్। ముండల్ 1006

ఆ।వె। ఇదియుతండ్రికట్టి। నెనసెడు సత్రంబు
కాదటంచు నతడు వాదుకడుగ
స।తశాల యిదియు। చక్కగ మీతండ్రి
కట్టజేసినాడు। పిట్టెమీతండ్రి 1007

సీ॥ పూజ్యుడుమీతండ్రి- పొందిన ప్రేరుకు। కీర్తికి
నెటుకళంకమురాదు- నిటులవినుము
పుణ్యాత్ములుండెడి- పుణ్యంపుఛాయలో
నిలచినపాపము- తొలగిపోవు
అదికారణంబుగ- వదలక నేనిందు
వచ్చిపోవుచునుందు నిచ్చతోట-
మిడిగ్రుడ్లతోడ- త్రాగుడువలననునందు
వ్యంగ్యంబుగానందు- పలుకుమాట

గీ॥ పిలుప ముసిముసి నవ్వులు। నెనయజేసి
వికటహాసంబు జేసెను। వీడకుండ
అంతులేకుండసాగెను। యతని నవ్వు
తూలదేహంబు పట్టగ। చాలనతడు 1008

చం॥ విదలిచి। నాడువారి। నట। వేసియునుండెడి పీటపైననున్
వదనగ సత్వమంతయును। బాగతనంతనదగ్గు। మించగా
ముదితలు సేవచేయగని।మూర్ఛతొరొప్పుచుపానపాత్రనున్
కుదురుగనింపితెమ్మనుచు। కోరగదాసియు। పర్వతీసియున్
1009

కం॥ దాసీ లిద్దరు పాత్రల
గాసియుపోవంగనందు కరముల చాపన్
దాసియు దేవంతియుమన
మే,సహాయిలుపలేక। నెంతయుత్వరతో 1010

గీ॥ జలముతెచ్చిన దేవంతి। వలదుజూచి
ముసలినొకరు। చేలమ మోము జూచి
బెదరుదృష్టిని తనవంక। వదలకుండ
నిలుపజలములతోడను। గళము తడుపు 1011

మ॥ తరువాతన్మధుపాత్ర గైకొనుము। వంతలీరునంచిప్పుడున్
త్వరమా అమ్మయి గోరెమిమ్మనెడు దేవంతి న్గనెన్మోటయున్
వదలన్జేయగ।పాత్రలాగుకొని। యున్భావంబునన్శంకయున్
దొరలన్జేయక। తృప్తిగా జలములన్దోసిళ్ళతో త్రాగియున్ 1012

కం॥ జలములు మిగిలినవాటిని।
తలపై బోర్లించుకొనుచు। తామును పాత్రన్
అలగియు పారగవైచెను
కలకలనవ్వుచును వారిగాంచియు బలికెన్ 1013

ఉ॥ చూచితె।యామ్మయునిప్పుడు। చోద్యము మేల్గొనుచుండె।దాపినే
జాచితిపాత్రమద్యమును।చాలగబోయుడు। బోయకున్నచో
ఓచెలి। నీటినిన్గొనగి। ఉత్తముజేయగజూడనేల। నా
కిచరితంబునచ్చెదిక। యింతకుచచ్చుటా చంపుటోయిక 1014

ఆ।వె। నన్ను మత్యపెట్టి। తిన్నగమీచేత
నౌనె యేదొయొకటి నెనుతేల్తు
అనుచు కోపలుండు। నాగదినిండంగ
నోటికొచ్చినట్లు। సూటివాగె 1015

కం॥ చేలమ యెదురుగగూర్చొని
ఏలను చచ్చుటయు, చంపు పేలను నిందున్
చాలగచెప్పగరాదొకొ
చేలమయన, కోపమెంతొ జేరెనుమదినిన్ 1016

కం॥ పరిచారిక చేతులలో
వరలెడు మధుపాత్రలాగి, పదపడియందున్
సరగున చేలమవైపుకు
గురిజేసియు చూపునందు, కోపలుడనియెన్ 1017

ఉ॥ వైరమునీకు మాధవికి, వచ్చెనె, యందుకె కన్నగీసతిన్
చేరియు మౌనివేసమున ఛీయిటు తార్పుడు వృత్తిబూనితే
నేరపుమీర సంచునటు, నిక్కము బల్కినరీతి, మద్యమున్
చేరిచెనోటికిన్నతడు, చేలమయిట్లనె బొగ్గుమాడియే 1018

గీ॥ వజ్రమౌనిని విజ్ఞులు, బలికెవరెట
నాదుతార్పుడు శాస్త్రమే, మీదుమిగిలి
ఇపుడువేదాంత శాస్త్రమై యెలసెశ్రేష్ఠి
యనుచు పలికిన వినియును ననియెశ్రేష్ఠి 1019

గీ॥ నీవుజెప్పిన దెల్లనునిక్కమిదియ
యట్టిశాస్త్రంబు నేర్చియే, తత్త్వమంత
జీవితములోన యెరిగితి, చేలమత్త
ననగవినియును చేలమ, ననియె నామె 1020

చం॥ ముసిముసిరవ్వులున్నగుచు, మున్నగమీమది, యేమితెల్పెనో
పసదగుతత్త్వమంత, నిటబాగుగనే వినగోరి తిందునన్
కొనరగలేను నేననగ, గూర్పునితీవిగ కోవలుందున్
కొనరగనేలయత్తనిట గూడిన, జాతిలొ స్త్రీలబేదముల్ 1021

చం॥ పురుషునినాశనంబునిట, బొందగజేయును, చంపునింకనున్
అరయగనెన్నియో యనుచు,నాపియుకన్నగిమెట్లనుండియున్
ధరనట, జేరుచుండగను, తద్ఘనమంజీరనాద మెంతయో
వరలగనందుగాంచెనట, వర్తకముఖ్యుడు, నామెనంతయున్ 1022

కం॥ గనుగొని దేవంతినియట
వివిపించగనేల, యింటి విషయములిందున్
అనఘుని లోపలకునిక
గొనిరమ్మిక నీవనియు కోమలవెడలన్ 1023

ఉ॥ కన్నగి వైషఁజూడగనె। కాంతుని గుండెయు లిప్తమాత్రమున్
అన్నెలవంక గన్నకలశాంబుధి వోలెను। పొంగె యెక్కడో
తిన్నగయాత్మ మేల్కొనగ। తీరికదానిని నొక్కిపెట్టియున్
కన్నగి। యింటిపేరుసిట। గట్టిగనాడియు పెట్టెదే 1024

గీ॥ వీధినడివీధి యిల్లుగా వేయుదేను
రమ్ము క్రిందకు దిగిరమ్ము। రమ్ముముందు
అనగయడుగును ముందుకు కదపలేక
నిలుఁబడిపోయె। నిశ్శబ్దమేఁము కోరియె 1025

గీ॥ విప్పుమంజీరముల నీవు। వేగయనుడు
యరచె కోవలుఁడందున। యరపులకును
బెదరి మంజీరధ్వనులట వినగరాక
నిలచిపోయెను కన్నగి। కలతజెంది 1026

గీ॥ తెమ్ముమద్యంబు। వేగమే। తెమ్మటంచు
ననగదాసియొకర్తుక వినియుదాని
నింపియివ్వగ కడుఁహంత నిండునటు
త్రాగె। కార్యవాహుఁడుగని। తానువణకె 1027

కం॥ తూలుచు లేచెడు కోవలు
నాలలనలుజూచి తాము వణకిరి, యందున్
రాలగకండ్లను నిప్పులు
తూలుచునుండంగదాసి, దోరమునతనిన్ 1028

ఆ, వె, గూరుచుండ పెట్టి, గూర్చున్న తావును
శీఘ్రమీడలేక, చేలముండె
తూగుకండ్లతోడ, వాగుచు
కన్నగి, గాంచిపల్కెనిట్లు, కర్కశముగ 1029

కం॥ పాలించుము నాయాజ్ఞను
నేలనునాలస్వమింక, యీవును సతివే
బేలావిడిచితి నిన్నును, చాలదె
గృహమందునుండి, చాలగనెడితిన్ 1030

గీ॥ అంతవిడువక, నిన్నును, వింతయేమి,
నీదుదరినున్న సౌభాగ్యనిబిడమైన
వాని, మణిమంజీరములను, బూని
కొనియు, వేరెవారికి నేనిత్తు విశదముగను 1031

మ॥ అనుమాటన్విని। కన్నగీసతియు। తానాశ్చర్యమున్పొందకే
గనియ్యెన్ కోవలుమోము। నాతడునుతాగాంచంగ।లేకుండగా
గొనియెన్ మారగుమోము।నద్దిగనియు।న్గూడంగశాంతస్వరం
బనియెన్।కన్నగిమామగారిడిన।సౌభాగ్యంబునంబాడియున్
1832

గీ॥ మరలనిట్లాడె। మీకును। మహిని
నిందు భార్యగానుండు యధికార। భాగ్యదాన
మదియు। వారునునాకిచ్చె। మరచినాడె
మాట పూర్తియుగాకుండ। మానినినట 1033

వ॥ వేగంబున కన్నగీసతిని ముఖంబుపైకొట్టె। మరలచేయెత్తు లోన చేలమ్మ వేగంబున పరువెత్తి యెత్తిన హస్తంబున బలంబున। చేలమ్మపట్టి। శ్రేష్ఠి। జాగ్రత్త సుమీ। నేను జోక్యంబు పుచ్చుకొన్న వదలివేసిన తార్పుడు తార్పుడు శాస్త్రంబును। సన్యాసంబు విడచి మరలబూను కోవలసి వచ్చును। నీ హీనగుణ కార్యంబుల జూచియు నూరకుండ నేను మహాశ్రేష్ఠిని గాను। కన్నగీ సతిని। యంత కంటె గాను। ముఖప్రీతి కొరకు మాట్లాడు దానను గాననీ నీకు

కూడా తెలుసు। మాధవి నాశిష్యురాలే యయిన యొకరికీ
యన్యాయంబు జరుగుచుండ నేను జూడజాల। మీకు శక్తి
వున్న చేయివదల్చు కొన్నజాలు। 1034

మ॥ అనుచేలమ్మనుగాంచి క్రోధమున। మోమంతన్నటన్రోధమున్
గొనిరక్తంరానుజిమ్మరొప్పచును। తాగూర్చుండియేవెంటన్
గనిదాసీలనుసైగజేసె। కరమునైకొన్న। చేలమ్మనున్
వనరజ్జూయు। కొట్టగాగనియు। నాభావంబు దేవంతియున్
1035

గీ॥ కార్యవాహుండువృద్ధుడు। గనుచుదాని
నాగరత్నయు పరుగుల। వేగవచ్చె
అతనిపైఖరి గాంచియు। నందుమీద
పెరిగె చేలమ్మ కోపంబు। త్వరగనామె 1036

గీ॥ నన్నుదాసీల చేతనే। మున్న
గొట్టజేయగ జూచితి వట్టులైన
పదమహాజనవాడకు। బాగగొట్టి।
వచ్చునచ్చట। రమ్మంచు బట్టిలాగె 1037

కం॥ అనుచును లాగగచేలమ
గొనిపోకుము వారినిపుడు। గొవిరిబు శ్రమనున్
గనుమది పీటయునిందున।
యని కన్నగి సఖినియందు। నరసియుబల్కెన్ 1038

గీ॥ విసురుచుండుము దేవంతి
వేగమిపుడ। నేనువచ్చెదనంచును। లోనికేగు
కన్నగిని గాంచినీరీతి।
గర్జనంబు జేసెకోవలుడందున। సిగ్గువీడి 1039

గీ॥ ఆగు కళ్యాణమంజీమవియునిచ్చి
పొమ్మటంచన కన్నగి। పోవునద్ది
తిరిగివచ్చియు బలికెను। త్వరగనంత
కులవధువు ప్రాణముండగ। కోరినవ్వి 1040

కం॥ ఇతరులకిచ్చుట। ధర్మము
పతనము జేయుటయుగాన। బాగుగనన్నన్
పితదరికిని పంపియుమరి
జతజేయగవచ్చు। వేరె।చానకునివియున్ 1041

వ॥ ఆదియంతయు విని చేలమ్మ నీరీతిబల్కె 1042

ఉ॥ పంతము వీడుమంచునట బాగుగమాధవికేను చెప్పితిన్
ఎంతయొతల్లియౌ పెరియ। నెత్తియు బాదుకొనంగలేదె। నా
వంతయుమారలేమి।హృదయంబునచేయియునుంచి శ్రేష్ఠిరో
అంతయు సమ్మతంబనుచు। నాడుముబోగము వాడసిద్ధియే 1043

ఆ। వె। నేర్చుకొన్నతత్వ। నిష్ఠయు నిదియేన
యనుచు చేలమాఖ్య నడుగనంత
మధ్యమంచునడిగి। మధ్యంబు కొరకునై
చేయిజాచె। కనులుజేరెమూత 1044

కం॥ పకపకనగుచును। కన్నగి
నికటంబుననుండునామె। నీవునునాకున్
యికతినుటకు నేదైనను
నొకటుండిన పెట్టుమంచు। నొనరగపలుకన్ 1045

కం॥ పదముల రెక్కలుంట్టుక
వదలక పరుగెత్తి సతియు। భవనముజేరన్
పదముల మంజీరంబులు
గదియంతధ్వనింప మ్రోగె। కమ్మనిధ్వనులున్ 1046

ఆ।వె। పానపాత్ర చెలియు। తానుసునందివ్వ
గాంచి చేలమనటు। గాంచుమనుచు
ఇదియెగొన్నసిద్ధియిదె భోజనంబుచు
భోగమిద్ది। తత్వపూర్ణమిద్దె- 1047

గీ।। మీకురెండును గలసియు। పోకనేమి।
నేర్పెనోశ్రేష్ఠి చెప్పుము। నేలవడవు
ఏమిలేదిట। వివశత్వమిందునేను।
యెండుగన్నను నిద్దియే యేవియుండు 1048

ఆ।వె। చక్రవ్యూహమందు। చక్కగ
కోర్కెలయొకటి కొకటిపెట్టియుంటినేను
దీనికేమియుండె। తెలిపినకారణ
మేమిచెపుమయనగ। నిట్టులనియె 1049

సీ।। ముఖమును చిట్లించి- ముదితరా
కారణములయందునేమియు-బొందియుండె
జరిగిపోయినదంత- జరిగియు
బోయిన- కానినేనుమదిని బూనిభయము

భయపడువాడను- భయమునుగెలువగ
బయలువెడలినేను- బడితిగోత
అంతరాత్మయెపుడు- నదిమేలుకొనియుండు
లాభంబునేమిట- చేపటునిట

ఆ।వె। దానిజేరలేను। దానిభరింపగ
రాదునాకునేను। బోదునింక
దానిమరచు కొరకె। దీనినిగనిపెట్టి
మరచుచుంటి నేను। సరిగనత్త 1050

ఆ।వె। నిలువకోవలుండు। నిలుచున్న దేవంతి
భోజనమ్ము తేగ। బోయెనమ్మ
అనగక్షణమునిలచి। యవియెనునీరీతి
జూచుచుండు మనుము। చోద్యమేమి 1051

గీ॥ జీవితంబదియుడిన। జేరత్త
నేనుతినగను। తప్పకనేనువత్తు
అనుచుధర్మశాలనుదాటి జనుచునతడు
వద్దు కళ్యాణమంజీర మద్దినిప్పు 1052

ఆ. వె. ధర్మశాలనుండి। తానును మాధవి।
యుండు చోట కరిగి। యందునతడు
చతికలబడగనియు। చానయు తెచ్చితే
యనగనవ్వియతడు ననియెనిట్లు 1053

ఉ॥ ఆశనిరాశలన్విడచి యాతడు నేనును తెచ్చియుండినన్
బాశిలపట్టువేసికొని। భామిని నేనిల గూరుచుందు నే
ఆశయు వీడుమంచనగ నయ్యది రెచ్చియు నైననీకునై
ఆశయు బెంచుకొంచుమదినంతయు। జీవిత మేను పూర్తిగా 1054

గీ॥ ధారవోసితినైనను। తగిన యటుల
యావగ్గింజంతయైనను। నవని సుఖము
బొందలేకుంటి। సతిగను। నిందు
జేయలేకపోయితి వీవును। లేకిబుద్ధి 1055

చం॥ సతిసిటుగాకపోతి। మఱసానిని నేనును పెళ్ళిపొందికన్
గతియిటలేక నేను నిను కట్టుగొనం గను లేదు నా గృహంబునన్
అతిత్వరవీడి బొమ్మనుచు। నాడగ వేశ్యయు। విస్మయంబునన్
అతడును మెల్లమెల్లగను నామెను గాంచె। శిరంబునెత్తియున్ 1056

ఉ॥ నమ్మశక్యమిందునను। నాకును గాకనుండె। సిద్ధియున్
సుమ్మమనంబునందునను। చోద్యమునందెడి దీనిమాటలన్
అమ్మకచెల్లకోపమున। నాడెడునద్దియు తగ్గినంతనే
సమ్మతిజెందునంచు। మదిచక్కగతల్చెను కానివేశ్యయున్
1057

గీ॥ మనమున యోచించె- మాధవియీరీతి
సుతతమణిమేఖల- శుభమునొంద
యొసిగూర్చుటయెనాకు- ముఖ్యంబటంచును
మోహములను నన్నిముడిచిద్రోచి
దానిముందున నన్ని బూనకుండనునద్ది
వీడిపైచియునిట్లు- నేడుసలుప.
వలయును నంచునుభామిచిమది
లోన కడునిశ్చయంబును। గాంచిమదిని

గీ॥ రాజదూతను నేరీతిరమ్మటంచు
పిలువబంపగ మాధవి సలుపనెంచి
అతనియాకర్షణంబును శ్రాంతజేతు
నంతకన్నను మించినయద్దిలేదు 1058

కం॥ మణిమేఖల రూపంబును
తనమది మెదలంగనద్ది। తానును గొంతున్
వినగనురానటు బెంచియు
ననె। మర్యాదగనునీవు। నరుగుము వేగన్ 1059

గీ॥ నీకుమర్యాదగనె నిందునేను
జెప్పియుంటి। పొమ్మిక్మట కానిచో। జూడునిన్ను
చీపురుంగొనిరత్నను చీదుదేను
వేగరమ్మని పంపంగ। వేగమిపుడు 1060

సీ॥ తనసుతనేకీతి- తానునురక్షించి
కాపాడుటేమది- గలిగియుండె
ప్రేమానురాగంబు- వీడియు వేశ్యయు
తమసుఖంబును గోరె తనదుమదిని
రాజధానినివీడి- రాజాజ్ఞతోడను
వచ్చివానికి నచ్చునటుల
నడచుచునుండుటే- విడువని
కర్తవ్యమంచును మదిలోన। నెంచితేను

గీ॥ అనగనీరీతి, నద్దియువినియునవ్వి
సత్కరించెదురీతియు చక్కనుండె
లక్షయెనిమిదివేలు నిర్లక్ష్యముగను
యిచ్చివరమాలగొంటినే, యింపుమీర 1061

గీ॥ అపుడెజేసిన సత్కారమంత
యద్దియెంతోయుచితంబుగా నుండునిందుననిన
అట్టిచాతుర్యమెంతొయోనందుకొనెదు
వేశ్యయెప్పుడు, చతురత, వీడకుండు 1062

గీ॥ కోరచూపులు, బరపియు
మీరకుండ, కొట్టుచీపురుతోడను, కొట్టరపుడు
అపుడునున్నట్టియర్థంబు, నిపుడులేదు
మాటలీడియు వేశ్యము, మాటలేల 1063

కం॥ పొమ్మన నీవవరపువన,
యిమ్మహినీయిల్లునాది, యింతిరోయనగన్
అమ్మా, యెప్పటిమాటిది
కొమ్మంచును సానిచేతగూర్చినయపుడే 1064

ఆ. వె. అంతదానిదగును. నదియంతయెందుకు
ముందులేచిపొమ్ము. నిందునుండి
అంచుచేయిపట్టి. నాతని విదలించ
చేయియెత్తి నేనుచిదిమివైతు 1065

కం॥ ఆమాటలవిని మాధవి
యోమాటిటు. నాగరత్న. యుండెదురీతిన్
నామాట వినియు దీనిని
మోహోటము విడిచి యీడ్చుముందుగనీవున్ 1066

చం॥ ఎపుడును వేశ్యగానెగనె. యీతడునన్నును. చంచలాత్ముడున్
చపలుడు. వేశ్యరీతిగను. చక్కయొనర్తును. చేయిపట్టుకో
ఇపుడును పూర్తి మారితిని. యీతనిబట్టియు. నీడ్చివేయగన్
ఇపుడు భయపడన్వలదు. నీతనినేను సహింపలేనికన్
1067

కం॥ అనుచునుకోపలు హస్తము
గొని యున్మాదియునువోలె క్రూరముగాగన్
జనుమని లాగగనతడును
మునుదొర్లియుపడియె భూమి. పురుషుడునయ్యెన్ 1068

ఆ॥వె॥ దొర్లిపడినవాని। తొలగగమాధవి
పిచ్చివానివోలె। విడువకుండ
బయటతలుపువరకు। బడబడయీడ్చెను।
దాసియదియుతోడు। దవిలియుండ 1069

కం॥ మణిమేఖల యాపనిగని
తనతండ్రిని యీడ్చుచుండ। తానటుగనియున్
గొనియును దుఃఖమునప్పా
యనిపిలుచుచుతాను వెంట యరిగెను వేగన్ 1070

ఆ॥వె॥ తనయమాటమదిని। దగులగనీకను
క్రూరవృత్తిబూని। క్రూరురాలు
ఈడ్చుచుండ। తనవుకెన్నియో
గాయముల్తగిలి రక్తమంత ధారలయ్యె 1071

గీ॥ పెదవివిప్పియు। కోవలుడనియునేమి
యనెడుమాటనునాడగ। యట్టెయుండె
అతని వెలుపలకీడ్చియు। నాలవెలది
గడియవేసెను సంశయపడక నదియు 1072

చం॥ తనగృహద్వారమందుననె। ధారుణిరాయియు వోలె। యాతడున్
గొనిబలహీనతన్ హృదయగోళము। నుబ్బుచునుండశ్వాసయున్
అనయమువీడుచున్నచట।కంఠమునెండియుపోవ। నాల్కపై
గొనిజలమింతపోయుటకు గూడదునొక్కడువానికందునన్ 1073

మ॥ తినయాహారములేక। త్రాగగనటస్తీర్థంబు లేకుండగా
గొనమద్యంబదిలేక। పండుగొనగా। గూడంగనే శయ్యనున్
గనలేక। న్నిటువంటిదుర్దినమును న్గాంతున్నిటన్నంచునున్
మనమందెన్నడునూహమాత్రమయిన మన్నించితానుండెనే 1074

ఆ॥ వె॥ పగలుగడచిపోయె। వదలనిదుఃఖంటు
నలముగొనియె। నిశియువలెనునల్లై
వేదనాభరంబు వీడక కుమిలెను
పడతిమధువు సుఖము బాసెనంచు 1075

గీ॥ తినగసుఖ శయ్యలేకున్న। తననుజూచి
వచ్చిపోయెడు దాసీలువదలుమాట
హేళనంబుల నెమియు। నింతగూడ
గొనకబ్రతికియుండితినంచు। గొనియెబాధ 1076

కం॥ మరణము, జీవింపగమది
సరగునతాగోరుచుండె, బావగధైర్యం
బరయగలేదయ్యెనుమరి,
ధరజీవింపగనులేక, తానునునుండెన్ 1077

గీ॥ వేదనాభరజలమంత
వేయిరెట్లు, పెరిగిముంచెత్తకొట్టుగ వేగబోయె
నిశిని చీకటులెంతయో
నిండుచుండ, యాభవంతిని చీకటుల్వ్రాలుచబారె 1078

కం॥ సేవకుడొక్కడు కొగడతా
వహాయించియునరాగ, తానునుగనియున్
ఏవిధినెరుగనిగతినట, కోవలుడును
కండ్లుమూసి, గూరుకయుండెన్ 1079

గీ॥ గృహమునుండియు పేటికల్గొంచువారు
బోవుశబ్దముల్వినవచ్చి, పోవువారి
తానుగమనించె, నిశిరాత్రి
తరుగువరకు, గొంచుబోవుచునుండిరి కోవలుండు 1080

గీ॥ బాధగలిగించుచున్నను
పట్టువదలి। సాహసింపగలేకుండె। చానదాసి
నాగరత్నయు మణినిట
వేగగొనుచు। పోవుచుంటిని। ననియుబూబోడిబలికె 1081

వ॥ రాజ్ప్రతిసిధి పల్లకివచ్చు వరకునిందే నిరీక్షించు
చుండుమనె। నాగరత్న వలుక। మాధవి యీరీతి
వక్కాణించె 1082

గీ॥ శిబికప పియు। స్వయముగ
చేరకున్న। నేనురానని పలుకుము। విక్కమిదియ
బిగ్గరగబల్కె। గర్వంబు వెలయుచుండ
తానుతగులబెట్టిన యిల్లు। తానుజేరె 1083

గీ॥ అచటకాగడా పట్టియు
నందునిల్చు। సేవకునిగాంచిపెదదాసి। జేరియుండి
అమ్మగారిని కనిపెట్టి యుందు
నుండుమనుజెప్పియు। బోయెను। నామెయంత 1084

ఉ॥ చప్పుడులేమియున్వినక। చయ్యనకోవలుడందునుండియున్
చప్పుడు సేయకుండజని। శబ్దములేకనునుండు గేహమున్
అప్పుడెజొచ్చి। సేవకుడుగాంచిన। త్రోసెదునంచుభీతియున్
గొప్పగనుండె.నెమ్మదిగ। కోరికతీరగ తొంగిచూచెతా-
1085

గీ॥ శబ్దమింతయులేకుండ। చక్కనుండ
తనగృహంబున। దొంగగాతానెజొచ్చి
తక్కితారుచు। చీకటి। తడుము
కొనుచు। మెట్లమీదుగ జేరెను నట్టితాను 1086

గీ॥ గృహమునందున। దీపంబు
గూడలేదు। శూన్యమైయుండు భవనంబుజొచ్చితాను-
ఏమిగాంచంగలేకను। నింతయైన
గదిని। గదివీడివెదకెను। వదలకుండ 1087

ఆ।వె। ఎంతవెదుక। నందు నింతయు
గానక। దీపమైనగాని దేనిగనక
లోనగదికివేసి। గానగవచ్చెను
తాళమందు గనియె। దానినతడు 1088

ఉ॥ పోవుటతానెరింగియును పోయెనునేవిధి శబ్దమెంతయున్
నేవినకుండ। బోయెనెటు। నిట్లనిమాధవి। యంచుపెద్దగా
కోవలుడందు బిల్వనటగూడి ప్రతిధ్వనివచ్చెమారుగా
ఏవిధిబోయెనంచు మదియేర్పడె శంకయునంతలోననే
1089

గీ అలరహస్యద్వారంబున
యందునుండి। బోయెనాయంచు యోచించిపూర్తిమదిని
ఎవుడు చెప్పగలేదిట
యేనువయిన। పోయిజూతునటంచున పోయెనటకు 1090

చం అనుకొనునట్టి ద్వారమును। నయ్యది పూర్తిగతీసిదానినే
అనుసరణంబుగై కొనియు।నావెలయాలును।నేగుగుర్తుగా
గనుపడెకాగడా యొకటి।గాలుచునుండియు। సన్నవెల్గునున్
బనుపుచు నుండగాగనియె। పాపము కోవలుడందువీడకన్
1091

కం॥ గనుగొన తానునుముందుగ
గొనువస్తు చయంబునంత గొనిపంపియుతా
జనె గుప్తపు మార్గముగొన
యనుకొనెనీరీతి యతడుబహువిధములుగా 1092

శా॥ ఎన్నోసార్లిటు, వంచనంబు సలిపెన్, నీసారియీ మోసమున్
మున్నెన్నండును, లేనిరీతిగొనియె, నూహించలేనట్లుగా
కన్నుల్గాంచ గృహంబునన్తిరిగి, నన్గాంచంగ, నేముండె, యె
న్నెన్నెన్నో ధనసంచయంబు నటనుండె నన్నినిశ్శేషమై 1093

కం॥ కళకళలాడెడి హర్మ్యము
వెలవెల బోవుచునుండె, పీడియులక్ష్మిన్
గొలిపెను భూతనివాసము
తలపుననుండెడు నటంచు, తనమదిలోనన్ 1094

గీ॥ కాగడచేతగొనియును, గలయతిరుగు
తానెభూతంబుగాగను గానుపించె
తిరిగితిరిగియు, నలసియు, తిరిగి
యతడు, గృహముముంగిలికేతెంచి, గూలబడియె 1095

గీ॥ చేతనుండెడికాగడా శీఘ్రముగను
నారిపోవగ, దానిని పాదపైచె
నాల్గుదిక్కుల చీకటియలముగెనియె
మరుదినంబున గృహమును, వదలియతడు 1096

ఆ.వె. వీధి వెంటనడువ, వీనినిజనులును
గాంచిముఖము మీద కలకబార
నవ్వుచుండవేగ, నాతడు మధు
శాల, జొచ్చియందు ముద్రికిచ్చిత్రాగె- 1097

కం॥ తినియు, త్రాగియు కోవలు
డనయముస్పృహ తప్పిబడియె, యువనినియందున్
జనమూడగు ఝాములునట, గని
స్పృహయింతయతడు, గాంచెను, నచటన్ 1098

సీ॥ పానశాలయందు- బడియుండెతానును
దానియందునులేక- తదసియుండు
నేలపై బడియుండె- నిండెను
దుర్గంధమంత లేచియతడు- నందుగనిన
పెంటకుప్పమీద- వివశత
బడియుండె యాభరణంబులు- నందులేక
పోయెదానిగనియు- పూర్తిగ
కోవలుడందు నవ్వుకొనియె- నద్దియెరిగి 1099

ఆ॥వె॥ నదియునంతపొంగి, వదలక
నగరంగునందురాజు కొరకు, నమరజేయు
వసతులన్ని యందువదలకు
ముంచెను బీదసాదలంత బిగ్గరేద్వ 1100

గీ॥ వారిరక్షింప గోరక, ప్రభువు కొరకు
వేరె వసతులు సేవకుల్వేగిరమున
చేయుచుండిరి బీదల చేరదీసి
జూచువారును లేకుండె, శోకముగాని- 1101

ఉ॥ ఆకలితో శరీరమదియంతయు నీరసమూన యెందునన్
తాకనదుమ్మునిండె, మరితప్పక మేగతి పట్టణంబునున్
తాకొన, కారణంబితడె, దారిలోగాంచిన కోమలాంగులన్
ఛీకన పాపమంచుగనిజేరక వారిడిప్రక్కప్రక్కలన్ 1102

గీ॥ సఖులు పరిచయ మూనెడిజనులు
వారు, మనలసాయంబునర్థించు, ననుచునెంచి
తొలగిపోవుచునుండిరి, గలువారు
తిరిగి తిరిగియు, నొకచెట్టుదరికినడిగి 1103

ఆ.వె. కాళ్ళుచచ్చుబడగ, కాళ్ళను తా
నుగానొక్కుకొనుచుబాధ, నుండకుండ
వేడియూర్పువదలి, వీడకనిద్రించి
దాగటంచుతలచె, బహువిధముల 1104

గీ|| మించపుద్బాధ, కదలకమెదలనీక,
యొక్కచోటను నిల్వక, చక్కనతడు
కదలితీరంబు కేసియు, బదలికయును
పోవునంచును నతడును బోయెనంత 1105

గీ|| కదలితీరంబువెంబడి, వెదలుజనము
వరదబాధితులందున వదలకుండ
అందుజేరుచునుండెడి, యట్టివారు
యన్నదానంబు జేసెదియన్నమాట 1106

కం|| వినియును కోవలుడద్దియు
జనగూడదటుంచు తలచి, జనియెనుతానుఁ
గొనిభిక్షాన్నము బ్రతుకుట
జనజీవితమిడి, మేలుచాలగగలుగున్ 1107

గీ॥ తలచుచుండెను మదిలోన। దాని
కవియె। గొంచుపోయెను। కావ్యమునెంచకతడు
సాగిపోయెను దూరాన। జనముజేరి
యన్నదానంబుగొనగను నందువారు 1108

కం॥ త్రొక్కిసలాడుచుపోవగ
నక్కడనటజేయువారు। నామాధవియే
ఇక్కడ బాధితులందరి
కొక్కటె యన్నంబువెట్టి। గూర్చెనుముదమున్ 1109

సీ॥ అన్నమాటనువిని- యసహాయుడౌచును
తుప్పగూలియుపోయె- కోవలుండు
ముందుకేగగమరి- పోవగముందుకు
శక్తియులేకుండ- చక్కబడియె
దక్షిణాపథమంత- తగువాడటంచును
కోటీశ్వరుడంచు మేటియంచు
పేరునుపొందిన- విశ్రుతుడిశ్రేష్ఠి
సంద్రంబుటిసుకలో- చక్కబడియె

గీ|| అనుచువ్యంగోక్తు లెన్నియో
నాడుచుండ వారిపల్కులుహృదయాన, వాడిబాకు
దిగినయటులను, బాధతోదిక్కు
లేక, కండ్లుమూయుచు తెరచుచు కటికనేల 1110

వ|| బడియున్న కోవలునకు పల్కులునీరీతి వినవచ్చె 1111

ఉ|| కోవలునీగతిన్వదలి, గూడెనుమాధవి వేరెయొక్కనిన్
కోవలుడిట్టిపాటుబడె, కూడెడువాడును రేపునీగతిన్
ఏవిధినొందకుండుట, నీగతివేశ్యల పాలెయైనచో
కావగవచ్చునేనరుని, ఖర్మము, వీడదుశిక్షవేయకన్ 1112

కం|| అనుచును పలుకుచునేగగ
వినియామాటలను, క్రోధవేగుడునగుచున్
గనగ కుతూహలమీర్ష్యయుగనె
జయమట నీరసంబు, కరమటుతగ్గెన్ 1113

సీ|| ఇంద్రోత్సవంబుల, నినుమిక్కిలిగ
జేయు- స్థలమునుజేరెను నరగనతడు
రాజురాకనుజేసి- రమణీయశిల్పము
లమరజేసిరి- యందునధికముగను

అస్త్రధారులునైన- సైనికులెందరో
ప్రజలను నదుపులో- వరుసనుంచ
జనములమధ్యను- జనుదెంచు కోవలు
గాంచియు జనములు కలవరమున
కోవలుడిక్కడ- కూడింతలేకను
నగబాట్లపాలాయె నద్దియేమొ
కులుకుచు తిరిగెను- గూడియు
వేరొక్కమానిషితోగూడి మాధవియును
వేశ్యపతివ్రత- విశ్వంబునందున
యేగతినగునిం౦ము- నెందుజూడ

గీ॥ అనెడిమాటల వినిని, యతడుశిలగ
నయ్యెమాధవి క్రొత్తగయండుకొనిన
జీవితంబది ద్వేషంబు, బెంపనతడు
సాగిపోయెనుముందుకు, సరభసమున 1114

గీ॥ రాజధానివీడియు, రాజునాజ్ఞ
వచ్చియుండెడివానికి, ప్రక్కగాను
నిలచియుండెను మాధవి వెలయులేని
శ్రేష్ఠిగారిచ్చు సంపద స్థిరముగాను 1115

ఆ॥వె॥ స్వీకరించి। యదియు। వేగమ(శేష్ఠిదౌ
కోశమందునందుకొనిన యదియు
ఇతడె యర్ధయంత। నేగతివచ్చెనో
తెలుపుపత్రమద్ది తీర్చిదిద్దు 1116

వ॥ నదిగూడ యీయుద్యోగియేగాన। నారాజ ప్రతినిధి మాధవి భుజంబులతన హస్తంబుల మాలగావైచి। యేమియో జూపుచు। ముచ్చటలాడువారింగాంచి। కోపంబున తనువు దహియింప। మాధవీ యని యొక్క పెనుకేకవైచి- 1117

కం॥ కట్టిన యడ్డముతన్నక
యట్టేపోవంగజూడ। యతనినిగనియున్
కట్టెనుయడ్డము పెట్టిరి।
తిట్టుచునట కావలుండు। ధీరతివిడియున్ 1118

ఆ॥వె॥ వినగరానితిట్లు। వెలువడుచు దగ।
వినెడుజనము। ముదముగొనియువారు
హస్తతాళములను। నందునజేయంగ
పిచ్చివానువోలె। రెచ్చిపోయె 1119

కం॥ పైకినివచ్చెదు కోవలు
తాకనెచిట్టిచిచూపు। తనపరిసరమం
దే। కనిపించెడు జనముల
తాకనిదండింప యాజ్ఞతదయకయిచ్చెన్ 1120

ఆ।వె। ఆజ్ఞయిచ్చెడువానిని। యతివనాపి
కోవలునిదగ్గరంగను। కోమలియును
వచ్చుచుండగ। శక్తియుపట్టిపొంది
యరగెదిగ్గరగాగను। నందునుండి 1121

కం॥ విషకన్యక వచ్చెడునట
విషయము నెఱుగంగలేని। పెద్దలునిందున్
విషవలయంబున, చిక్కి
నిముషమునను జీవితంబు।పూర్తిగబోవున్ 1122

గీ॥ నగరమందుననున్నట్టి।
సగటుధనిక। వరులనందర। నాశంబు। త్వరగజేయు
ముద్దులనునిచ్చి విషకన్య
హద్దుమీరు। కులట విశ్వాసఘాతకి। క్రూరురాలు 1123

ఆ. వె. సర్వనాశనంబు, నుర్వినని సన్నను
జేసెసిద్ధి, రేపుజేయు వీని
రెండుదినములేగ, దండిగమిమ్మను
పట్టిచంపునయ్య! ప్రజలు వినుడు 1124

గీ॥ పరమసత్యంబు గ్రహియించె
పాపమిపుడు, ననుచునరచెను యొక్కడు జనమునుండి
వేశ్యయనగనె, సంఘంబు
వీడలేని, నాశనంబును జేకూర్చు నద్దినిజము 1125

కం॥ కోవలుముందుకు వచ్చెను
నా వేశ్యయు, నందుజనము, లాడెడు మాటన్
తావినిభయమున నిటులనె
నేవినిచెదనెల్లవారు, నిక్కమువినుడీ- 1126

చం॥ కులటనె, వేశ్యనే నిజము, గూడెను, మానిసియన్న ద్వేషమున్
కులసతులన్మనంబునను గొంచును ద్వేషము, ద్వేషమందునన్
మెలగుచు వేశ్య, తన్నెనిల, మిన్నగద్వేషము పెంచుకొంచునన్
మెలగెడికారణంబు, నిల, మీరును మీరును మీరుగాదొకో
1127

చం॥ సతులను వోలినేను। ధరచక్కగ। భర్తయటంచుపుత్రులన్
వ్రతముల గై కొనన్తలచి। ఖానమునందున నుంచికొని। నే
మతిగొనునట్టిదానికిని। మన్నన లేకను కామవాంఛనున్
సతతము దీర్చుకో దగిన। చానగలోకముజేసె। నిక్కమో
1128

గీ॥ అందువలన సమాజంబు
నంతనాశ। మిందునీరీతి జేయుదునేనునుంటి
సంఘమంతను ద్వేషించ
చక్కనైనయట్టియధికారమెంతయో నేనుగొంటి- 1129

ఉ॥ ఛీనినుప్రేమనునొ్క్కలచి। జేసితిత్యాగము।లెన్నొనింకనున్
నేనిటదేవివోలుసతి। నిక్కమువీడితి నిన్నుగోరియె
తానన। నాదుపైసిఁ యిటు దాటగరానటుప్రేమలేదు। నీ
మానసమందునుందునల మానవికామము దీర్చుగొంటకే
1130

గీ॥ చేసినావిటుగానిచో। చిత్త
మందు। నలపతివ్రత కన్నగి గొలచుచున్న
మదితిప్రేమింపలేకను। మానితివిట
నన్నుప్రేమింపనిజచూౕనె। నెన్నదైన 1131

గీ॥ తొలగిపొమ్మిక్కను। యెదుటను
నిలువకుండ। యనెడు మాటను వినియును। గొనియుకోప
మంత। విశ్వాసఘాతకి। యిందు
నన్ను యిటులనవమాన పరతువే। యిప్పుడేను 1132

గీ॥ నిన్ను ఖండించెదనంచును। మున్ను
మదిని। నుండుకోపంబుదీరంగ। నువిదమెడను
పడిసిపట్టెను। వెంటనే
పరుగులెత్తి। వచ్చిరక్షకభటులును। పట్టిరతని 1133

కం॥ కోపముమించగ మాధని
నాపయిహస్తంబువేసి। నన్నిటునిచటన్
ఈపగిది జేయనూరక।
నేపడియుండంగనిందు। విధవనెచెపుమా? 1134

చం॥ అదియునుగాక,కోవలుండు।యంబుధులన్నియుదాటి। మించుచున్
మెదలెడికీర్తికాంతగొను। మిన్నగు కోవలుడిందుగాడుగా
వదలియుపొమ్మునన్నతియు। వర్తిల్లువేశ్యనుజూచితోషమున్
మదులను। నొందిగేలియటు। మానకజేసిరి। కోవలుండునున్ 1135

గీ॥ నీరసించియుతనశక్తి। చేరదీసి
పట్టువిడిపించుకొన। పెనుగట్టులాడె
పచ్చిబూతులెన్నియో। పలుకుచుండె
భటుల విదిలించతంనయు బాగగాంచి 1136

గీ॥ అచటియధికారినైగను। నందుకొనియు
భటులు లాఠీలతోగొట్టె। వదలకుండ
తనవునందునరక్తంబు। ధారలూన
యతని స్థితిజూచి మాధవి। యందెకలత 1137

వ॥ అంతనాయధికారి। హస్తంబునుంగొని। యాప్రదేశంబు
నుండి నిష్క్రమించె। దెబ్బలవలన। స్పృహకోల్పోయిన
యాకోవలుని। యధికారియాజ్ఞాప్రకారంబున భటుల దూ
రంబున యిసుకతిన్నెలపై బడవైచిరి- 1138

ఉ॥ కన్నగియున్నశాలకడ। గల్గెపుసందడి। కాళ్ళసవ్వడుల్
మున్నుగయెన్నోతావినగ। పూర్తిగవచ్చినశయ్యవీడియున్
కన్నగిలేచి। దేవతిని గట్టిగలేపెను। ముందురోజునున్
తిన్నది। యేమిలేకయట। తీరెనుపూర్తిగ యేమిలేకనున్
1139

గీ॥ నూనెగొనలేక, దీపంబుగానిలేక
యుండె।సాయంబు జేయుచు। నున్నవాడు
శాలయధికారి। పెండిలిచక్కవచ్చె
యనుచు నరిగియుండెను। నపుడులేక- 1140

కం॥ యలజడి దగ్గరయైనను
చెలిగని యిదియేమియనుచు। చెలినడుగగాతా
అలయాత్రికులునువచ్చిరో
యలజడి గలిగుండునన్న। యామెయుననియెన్ 1141

ఆ।వె। యాత్రికులను। నిందుపై జేర్చరు
క్రిందగదులు నెన్నో। నందుగలవు
చేలమాఖ్యగొంతు జేరెనునింతలో
కోవలుండువచ్చె। గూడగాను 1142

గీ॥ దీపమిందునగొంచును। నీవుత్వరగ
రమ్మటంచును। చేలమ్మ నెమ్మదిగను
తడుముకొంచును పైకికి। తానువచ్చె
తలుపుతెలచియు దేవంతి పలికెనిటుల 113

కం॥ అక్కడవుండుము దీపము
నక్కడకేతెత్తునేను। ననుచునుపరుగున్
చక్కగగొన దేవంతియు
నిక్కడకేత్వరగరమ్మ। నెంతయొత్వరగా 1144

ఉ॥ వేగిరమిందురమ్మ। నిలపెద్దగగాయములయ్యె శ్రేష్ఠికిన్
తాగొనడిందుసన్నిహయు తాననుమాటలువించు। వారునున్
ఏగతియంచుభీతిగొని। యద్దరుడగ్గర। యందుకోవలుం
డీగతి, నందియుండగని, యెంతయుపెద్దగకేక వేసినన్
1145

కం॥ కన్నగికేకను వినియు
మున్ననెదేవంతిమీరు పొందకుదిగులున్
తిన్నగశ్రేష్ఠినిపైకిని,
యెన్నెనను తెతుమమ్మ। యెందుకునేలన్ 1146

మ॥ మరునాడెప్పుడొ। తెల్లవారుతరిలో। మత్తంతయుస్వీదగా
తెరచెన్కండ్లను। ప్రాణముల్కుదురుగా। తీతెన్త్వరవైద్యులున్
పరుపక్కన్నగి దేవతి చెలిని। నవ్వారల్సకాలంబునన్
త్వరగావచ్చియు వైద్యమున్నెరపినంతన్తేరియున్నాతడున్
1147

ఆ. వె. తెల్లవారువరకు, తెచ్చిన
యోషధుల్వాడి వైద్యవరుడు, పద్దశ్రమకు
వైద్యువైపుజూచి, పరుపగ
దండంబు, చేయియెత్తులోన, జేరియున్న 1148

కం॥ ఆలదేవంతినిగనియెను
చెలగుచునటనున్న యట్టిచేలమగనియున్
చెలియగు కన్నగియచటను
మెలగుటుగనరాక యతడు, మించగత్వరయున్ 1149

సీ॥ కన్నగి కొరకునై - గాంచియుప్రక్కల
గాంచలేకసునందు- కొంచెమతడు
మధ్యాహ్న వేళకు- మణియంతసరిపడ
వైద్యునిచేతిని- పట్టెయతడు
చేలమ్మ దేవంతి- చేరగకన్నీరు
విడుచుచు క్షమియింప- వేగగోరె
ధైర్యంబుబూనుము- తగువైనరీతుల
పోఋునదంతయు పొందవచ్చు

గీ॥ అనుచు చెప్పంగ పలుకులు। నవ్వి వినియు
జీవితంబున యాశయు। చివురుజూపె
మేలుగాంచియు రాత్రియు చాలనుంట
యలసిపోయిరి నెల్లరు। యచటివారు 1150

గీ॥ వైద్యులంతట పథ్యంబుబాగజెప్పి
శిష్యులంగూడిబోవంగ। జేలమయును
కన్నగియు దేవ .తియునట కాళ్ళలేళ్ళ
బడియు (బతిమాల। సాయంత్ర। మగుచునుండ 1151

వ॥ మరలివత్తుసని పోయిరంత 1152

మ॥ దారిదాపున్గనలేని రీతిగను। నాదారిద్ర్యపుంబాధయున్
పరికి, పన్నెట దారిదోపకయ। నెళ్ళంగిన్నిటనై వ్వదమున్
నెరవేర్తున్నని కన్నగీ సతియు తానెంచెన్మది న్నంతటన్
దరిజేరన్నిటురమ్మటంచు పిలచెన్నవ్వంగి దేవంతినిన్
1153

కం॥ అరికాళ్ళమర్దనంబును
దరిజేయుచుండు। తన్వని చేలినిన్
సరగున బిలువగకోవలు
డరసియు నాముఖముజూడ। డాయుదుబోలున్ 1154

చం॥ అనవిని కన్నగీసతియు। నప్పుడె। వచ్చియు భర్తృపాదముల్
మనమున। ప్రేమనిండగను। మానినిహస్తముజేర్చి। రుద్దగా
కణకణమందు పాదములు। గాలిని సోకినయట్లు చల్లనై
కనవినరాని శాంతినటు। చల్లగజేసిన। కొద్దిసేపటన్ 1155

ఆ వె। కనులుమూసికొంచు। గడువగ
క్షణమటు। తానులేచివేగ। తరుణిచేయి
గొనియు వేగతాను। కౌగలిజేర్చగ।
తనదుపైవులాగె। తానునంత 1156

చం॥ కనులను నశ్రుపూరమయి। కన్నగిగుబ్బలపైన జారియున్
అనిశయము తాపదగ్ధదగు। నాతని। పాదములెల్లనిండగా
గనియటకోవలుండు। తనకన్నులు నీరును గార్చుచుండగా
గనియది దేవతీచెలియు। గ్రక్కునతానటునుండి పోయెగా- 1157

గీ॥ మదిని మంకోచమెందుకు। మాననీయ
నీదుపాదములంటియు। నేనునిన్ను
నన్ను క్షమియించుమంచును। మున్నెవేడ
గోర్కెగలిగియునుంటివి గూర్చొనుమిట- 1158

చం॥ శిరమునునెత్తి తిర్తగనె। చేడియ। యిద్దరిజూపు లొక్కపై
వరలగ।శాంతినొందు।హృదయంబుల సంతసమంతనిండగా
దొరకనిదేదొ గొన్నపుడు। తోచెడుతృప్తియు నద్దిగూడె। వా
రిరువురు।సిగ్గుముంచగను।నింతియుకోవలుహృత్ఫలంబునన్ 1159

గీ॥ వ్రాలిపోవంగచుబుకంబు। వనితశిరము
పైననుంచియు। రుద్దుచు। వదలకుండ
పొదివికౌగిలిజేర్చియు। పొందెసుఖము
కనులునరమోడ్పులై యటగ్రాలుచుండ- 1160

చం॥ గడచినజీవితంబుహృది। గారియపెట్టెను। నేనునిప్పుడున్
గడుపుచునుంటి। సంతసము। గల్గెడుచిత్తముతోడగూడి। నే
బడలితి। నీకుభారమయి। వర్తిలునంచని। నేనునామదిన్
విడకనుబాధజెందితిని। వింటివెకన్నగి యంచుబల్కగా 1161

కం॥ శిరమెత్తిమరలపతినటు
నరయుచునిట్లాడెనామె। యంతయునేలా
దొరికితిరి మీరునాకిట
సరియగు। భారంబుదీరె చాలికనాకున్ 1162

గీ॥ ఏదినా మనంబుననంట వింకనెందు
ననగదేహంబు విషయమై। యనుచునుంటి
మనసు విషయంబునేనును।
మాటలాడ। తనువునకునేదొ। వ్యాపారమనదగిన 1163

గీ॥ అదియునుండంగవలెగద। యదియె
ధనము। పలుకుబడియేమిలేనట్టి। బ్రతుకునిలను
వ్యర్థమౌగద। యనగను। వనిత
యనియె। బాధమీకేల। సరిపడుబాధవలదు 1164

కం॥ మరియొక వ్యాపారంబును
తిరిగియు మొదలిడగవచ్చు। దేనికిమీకీ
తిరుగుడు। కాలముమారుట
సరుగుననిట కెంతొపట్టజాలదు గనుడీ 1165

చం॥ అదియెటుతాను। యేపనికైనను। ద్రవ్యమె పెట్టిజేయగా
కుదురునుగాని। లేకయెటు। కోమలిజేయగవచ్చు నంచనన్
ముదితయుసిగ్గుతోదవిలి। ముచ్చటనౌ చిరునవ్వు నవ్వుచున్
వదలకమామగారిచట। పాదములందువ। లక్ష్మినుంచియున్
1166

గీ॥ స్వర్గధామంబు జేరిరి, చక్కనైన
నవ్వి మణిమంజీరములన, నెందు నేని
అమ్మి వ్యాపారమెంతయో సమ్మ
దమున, జేయవచ్చును, కోమలిచిత్రమైన 1167

కం॥ పలుకులు వించును విస్మయ
మలముగ కన్నగిని జూచి, యనియెను నతడున్
తలయునువంచుక కన్నగి
సలలిత, తొమ్మిదియు లక్షలయ్యెను నపుడున్ 1168

గీ॥ ఇపుడు దౌర్భాగ్యవశతను, నెందు
నమ్మ నాల్గులక్షలు వచ్చును, నమ్మిదిదియు
అనగవతడును, యెన్నియో కష్ట
ములను, నందిదాటితివీనాడు, నమ్మమనుచు 1169

ఉ॥ ఉంటివినద్భుతంబు నగుచుండెను నీమది, నేనెరుంగలే
కుంటిని, యంచనంగ, నదియుంచుడు, మీరు విలాసలాస్యముల్
కుంటెనకత్తెతోడ, నటగూడుచునుండగ నేను నడ్డమా
చుంటిని, విప్రగౌరము, నున్నతిజేయగ, మార్గమిచ్చెదిన్
1170

గీ॥ అంతియేగాని। యేనెటునద్భు
తంపునైనదానినిగానిట। నంచుననియు
త్వరగయమ్మి। ప్రతిష్టనుబాగ
బెంచు। మార్గమన్వేషణంబును। మహినిజేయు 1171

కం॥ అనుచును కన్నగియనగను
వినికోవలుడద్దియనియె। వేగమనిటులన్
జనిస్వర్గంబుననుండెడు।
ఘనుడాతంద్రికిని ముఖముగా నగజేయు 1172

వ॥ ఏవిధంబుననగుననని కోవలుందు పలుక- 1173

ఉ॥ సంశయమింతనేల। మదిసంశయమీడుడు। నేనునిక్కమౌ
వంశపుకీర్తివెల్గునటు। బాయకమంజిరముల్ దాననున్
భ్రంశమునందుదాక। మహిబాయవు।వర్తకమెంతొవృద్ధినిన్
సంశయమీడిజేయుమిక। చక్కగచేకొనవచ్చు పిమ్మటన్ 1174

కం॥ వానిసమానముగాగను।
బూనికకొనలేకమీరు। పోయినపోసీ
దేనికి। మంగళకరమగు
వానికి విలువనుచుకట్టు। వరమగుపనియే- 1175

ఆ.వె. మామగారికైన యేమేనియడ్డును
నుండబోడు మనమునుండునద్ది
వారిదయతొగాదె వారియభీ
ష్టము నిద్దియుంచుతలతు నిందునేను 1176

గీ॥ పువ్వులమ్మినచోటనే పూవు
బోడి కట్టెలమ్మంగ నౌనాకోగాననేను
ఇంమినుండియు చేయగలేను
ననగ యిచటినుండియు నెందేనియేగుదమన 1177

కం॥ ఎక్కడికేగెద మిమ్మహి
యెక్కడజననౌను నన్న యింతియుననియెన్
చక్కగ యోచించియుమది
యక్కలికియు బల్కెనిట్లు నాతడువినగ 1178

చం॥ మధురనుజేరబోదుమొకొ మన్ననయందగసాలిచేత నీ
మధురతరంపు మంజిరము మామయుజేయగనిచ్చెయాజ్ఞనున్
మధురనుజేరిపీనిని సమంపు క్రయంబును వచ్చునట్లు నా
విధమునయమ్మవచ్చు నదివీడకమార్గముజూపు నిక్కమౌ
1179

ఉ॥ నూతనజీవితంబున వినూత్న సుఖంబుల। కార్యధారణన్
చేతముతృప్తినందగను। జేయగవచ్చని। దానిబుద్ధినిన్
ఆతడుతల్పుచుండెనట। యామెయులేచియు నిల్వచేయినిన్
ఆతరిపట్టిగూర్చొనగ। యందుఃజేయగ। యామెయిట్లనెన్ 1180

గీ॥ మీదువైద్యంబునకునేను। నెందుగొని
కాసునైననులేకుండ। గడుచునెటుల
నంచు। చింతించుచుంటిని। నపుడునాకు
జ్ఞప్తికొచ్చెను గృహమున జరుగునదియు 1181

కం॥ పడమరగృహమున। ద్వా
రమునిడియుండెడి దానిప్రక్క। నింపగుసొరుగున్
ఇడియుంటిమిదానిలోనే
బడవేసితి స్వర్ణముద్రల వియునునిపుడే 1182

గీ॥ తెమ్మటంచును నేనును దేవతినట
బంపుదానను దారిలో భత్యమునకు
వచ్చునంచును దేవంతిబంపివచ్చి
కోవలునకెదురుగ నామెగూరుచుండె 1183

గీ॥ ఒకరికెదురుగానొకరును గూరుచుంటి
యెవరియాలోచనంబులునెట్లునుండె
అటులయోచించుచుండిరి। యందు
వారు। మిట్టమధ్యాహ్నమామెను। నట్టికాని 1184

కం॥ దేవంతియురాకుండెను నావిధి
గడువంగ। బైటనయ్యేడు శబ్దం
చెవినిజూచిన చేలమ। తా
విసురుగవచ్చెనద్ది। దంపతులుగనన్ 1185

గీ॥ వారుముదమున నుండగ వనిత
జూచి। జంకెకొంచెము। ద్వారంబుజూచిపట్టి
పలికెనీరీతి కోవలువలనుజూచి
నిన్ను నిన్నుజూచియు। మదమిన్నయైన 1186

ఆ॥వె। ధైర్యమూనియుండె। దానినిజూడరు
నిప్పుడైన। ధైర్యమెంతయుండె
అదియుగనగవచ్చు। నమ్మరో
నీకును। దుఃఖవార్తతెస్తి। దోయిలొగ్గు 1187

మ॥ అనిచేలమ్మయనంగయద్ది వినియున్నా యిద్దరున్నట్లనే
మనగాస్తంభములోలె, చేలమయెతామాట్లాడె, నీరీతిగా
వినుడీదేవతి మీభవంతిలోనట న్వీడంగప్రాణంబులన్
గొనియెన్దుష్టుడు, నన్నమాటవినియుస్గాడంగ దుఃఖంబునన్ 1188

ఆ॥ వె॥ పెద్దకేకవైచి, పీడియుపలుకులు
క్షణమునుండె, చేలమాఖ్యయంత
తలుపులన్నిబార్ల, తామునుదీసియు
నిర్జనంబునొచు, నెనయునింట 1189

కం॥ హంతకుడెవడును దూఁయు
పంతఁబుననుండెనేమొ, భామినిశవమున్
చెంతనునుఁడియె, ముద్రలు
నంతట విరజిమ్మియుఁడె, ననుచుండిరిగా 1190

గీ॥ స్వర్ణముద్రల కొరకునై, చానచంపె
నంచునందరు ననుకొనిరద్దిపిల్ల
లాడుకొనుటకు పోయియు, నద్ది
జూచి, కేకలేయుచురాగను, కీడుతెలసె 1191

గీ॥ జనము గూడ గరక్షక జనపునేత,
యందుజనుదెంచి, శవమును నగ్ని జేర్ప
ఆజ్ఞయివ్వగ గైకొని, జనిరియనగ
ఇద్దిమాధవి కృత్యంబెయింతయేల 1192

ఉ॥ కాదిది శ్రేష్ఠిగారు, మరికామిని మాధవి యిట్టిచేతయున్
వాదిదిజేయబోరు, నిదివట్టిది, కన్నగినైనచంపగా
వాదిడిబూనునేమొ, మరిబంపదు దేవతిచంపగాయనన్
వేదనతోడకోవలుడు పీడకబల్కెను నాకుజూడగా 1193

ఆ.వె. నన్నుతెచ్చునపుడె, నావెను వెంటనే
గుప్తచరులువచ్చి గూఢముగను
దాగియుండి, యీమెతానటు పో
వంగ వెంటదగిలి చంపివేసియుండె 1194

గీ॥ ఆమెచేయుటనిజమైన యర్ధరాత్రి
నిన్నవైద్యుల కొరకునై నేనుబంప
చంపకుందురె, సోదరిచంపదిందు
ననుచుపైమాట రాకను, నశ్రుజలము 1195

గీ॥ గార్చుచుండెనుకన్నగి, కదలకుండ
యేదియేమైనకానిమ్ము, నింకమీరు
పురము వెల్వడిపోవుట, పూర్తి మేలు
యొక్కక్షణమిట నుండక, చక్కవేగ 1196

వ॥ మాధవి యెంతటి యీర్ష్యాసూయా సహితురాలై యున్నం
దున, యెప్పుడెట్టి క్రూరకార్యంబొన గూర్చునో? కావున
కన్నగినింతీసుకొని పురంబువీడి, పోవ నీకు సహాయంబే
నొనర్తు కళ్యాణమంజీరంబులు తనకుగూర్పలేదన్న క్రో
ధంబున నద్దికన్నగానక పోయియుండె యీర్ష్యాద్వేషం
బులు యెంతభయంకరంబో నేనెరుగుదు- 1197

గీ॥ నూపురంబులపైనను, నొందియున్న
యాశపోవంగలేదిట, యతివకేను
పన్న శ్రేష్ఠియునిచ్చిన, బహుళ
ధనము, చాలలేదెకొయింకను, చాలదనుచు 1198

గీ॥ రాజవంశంబునందున ప్రాపకంబు
బొందె, దానికియింకను, నిందునున్న
ఇవ్విమంజీరములునన, యెంత
విలువ, గల్గు, నింకేల యీకీతిగలుగజేయ 1199

శా॥ ఈమంజీరముల స్వనంబులతో। నెట్టిరీతి। మూల్యంబునన్
ఏమాత్రంబును గట్టరాదు। ధనమున్నివ్వంగలేనట్టిదౌ
ఆమూల్యంబును। బొంద। మాధవియు తానయ్యెన్నిటుల్లామెయున్
ఏమాత్రంబదినీచురాలు। కులటై। యిందుండదేదెప్పుడున్
1200

గీ॥ పట్టుబట్టియు బ్రతికెడు। పట్టుదలకు
ప్రాణములవీడు। కన్నగిప్రాణములను
తానుగైకొను। నీమీదదానికెపుడు
పగయులేదిందు। మిమ్ములపట్టుదలతో 1201

కం॥ మరినురి బాధలపెట్టెడి। దరిజే
రియుక్షమను గోరుదంచును తలపే
జరుగుటయసంభంవగు దరిజేరుట
క్షమయు గోరిదనుపుట। యగునే 1202

ఉ॥ కన్నగికిందుకీడుఁ గ। గల్గునటంచును నేనునామదిన్
గొన్నదిగాదసత్యమట। గూడినసత్తువనీకు। నీదిసం
బున్నను। నెట్టునట్టులను। నూరునువీడియు। మీరఁబోవుడీ
కన్నగిబిడ్డలాగునను। గాంచుచునుంటిని నిన్నుగావునన్
1203

గీ॥ నీదు మాంగల్యమును భగవంతు
డెపుడు। గాచుచుండెడి। గావున। కాదనకను
ఊరు వీడియు బోవుడు। సున్న
యట్లు। యంచు చేలమ్మ బల్కియు। నంపెవారి 1204

గీ॥ మదిన సూయయు। ద్వేషంబు। మరు
గుచున్న। కోవలు నిమీద దెబ్బలు। గూడిబడగ
మదిసహింపగలేకుండె। మాధవి
యట। యతని గర్వంబు బాసెను। ననుచు తలచి 1205

సీ॥ పైజాత్యాహంకార- మెంతయు నిండుగ
కత్తిదూసెను నొక- కాలమందు
జలధులు దాటియు- జనుకీర్తి కాంతయు
నదివీధి దొర్లాడ- పడతిగనియు
ఆనందమందెను- నా మాధవియునందు
ఘోరనిరాశను- గూర్చినట్టి
అతనిపై కోపంబు- నావహిల్లగ
నద్దిదండించు పేనిట- దగునటంచు

గీ॥ తలచెమదిలోన కానియు। గలిగినట్టి
నద్దివిచారంబునై। యటయామెమదిలో
సహజమైనట్టి। కోమలజ్ఞానమంత
మేలుకొని విజృంభించెను। మిక్కుటముగ 1206

సీ॥ అదిగనితనువును- నందెనువివశత
గజగజవణకుచు కాంతయంత
అధికారిహస్తంబు- నామెయుగైకొని
బలవంతముగలాగి- పరుగునంట
రథమునచూర్చుండ- రథమదిసాగెను
మాధవిమనసది- మసలుచుండె
కోవలుడందున గూడియు రక్తంబు
గాయములనుగూడి- హేయముగను

గీ॥ విలవిలాడెడి దృశ్యంబు। వీడకుండె
మాధవిన్గనియధికారి। మాటలాడ
నవ్వితేనెలో ముంచినయట్టియీ౹ాఙె
బోలితాకెను హృదయంబు పూర్తిగాను 1207

చం॥ చతురతగల్గు వేశ్యలను। చాలగజూచితినేను। గాని। నీ
గతిచతురత్వమూను। వెలకాంతను। జూడగలేదు। నమ్మజీ
వితగతిశాశ్వతంబునగు। వీడనిదానితొ గూడువంశమున్
అతికినయట్లునుండుచును। వంశములుండెడు కొన్నివానినిన్
1208

గీ॥ ఆమహాశ్రేష్ఠిమరచెడు నట్టులీవు
జేసినావిట। మరియును। జీవితమున
గల్గుతాత్కాలికంబైన। కార్యములును
వేరు శాశ్వత కార్యముల్వేరునుండు 1209

గీ॥ మదినితాత్కాలికంబౌచు। వదలనట్టి
క్షణిక సుఖములె పూర్తిగ। సత్యమనుచు
వానిశాశ్వతమంచును। వదలకుండు
కోవలునివంటి మూర్ఖుడుగూడియున్న 1210

కం॥ కోవలున కొదవుదుర్గతి।
యీావహిపట్టకబోదు। నెందునువినుమా
భావమునందున భోగము తా
విడకను నుండునపుడు। తప్పకవానిన్ 1211

గీ॥ నీవు ప్రేమించి యుందువు। నింతయైన
సర్వమును దోవ దెబ్బలు చాలదినుచు
నుండువానిని జూచిన। నిందుమదిని
యేమితలచితివో సుంత। జెప్పుమీవు 1212

ఉ॥ ధర్మము బాయకుండగను। ధారుణి నిల్చిన వేశ్య వంశపుం
ధర్మము జేయుచుంట। యదితప్పక నీకును జెల్లు। నెంతయుఁ
ధర్మము వీడు కోవలుని దాకగ జేసిన వన్నినీవు। నా
కర్మములన్ని నాపఖున। కాదనకుండగ జేయుమాధవీ-
1213

కం॥ నాదగు చాతుర్యంబును।
కాదనకను జూడగలవు। కామిని నీవున్
ఏదరిగానని దానిని నాదరి
నేర్వంగగలవు। నమ్ముము నీవున్ 1214

గీ॥ అతని మాటల వింటును। నతివమదిని
కుమిలిపోవుచునున్నను। గూడివాని
మౌనమూనియు గూర్చుండె। ముదిత
యుంత। నిర్జనంబగు చోటుకు నేగరథము 1215

కం॥ ఆమెను రొమ్మున హత్తుక,
యా మహితలగడను వోలె, నామాధవినిన్
కోమలియని తలచక మది,
యా మనుజుడు నలిపివైచి యనియెను నిటునన్ 1216

కం॥ నాతోగూడియు నీవును,
నాతిరొ సౌధంబుజేర నరుగుదుముగదే
నాతని చేకొని మరలను,
నాతడు దమితీర, నలిపియందెను ముద్దున్ 1217

సీ॥ తనువును స్పృహవీడె- తానంత
రాత్మయుయున్నదంచును మతి యందుమరచె
వేశ్యయైననుతాను- విచ్చలవిడిగను
పరపూరుషుని బారి, బడకనుండ
అధికారి తనమదియందుల నుండెడి,
భయమును నాపద- పణము వెట్టి
తననటు వేశ్యగా కొనగనుజేసియు
ననుభవింపగమది- యతడు గోరె.

గీ॥ అతనికాదని రథమును, నందుపీడి
దుమికిపోయిననేనిట, దుస్సహంపు
కార్యమిటువచ్చెచేయగ కార్యమేమి
యున్నదయ్యయోయంచును నతివయేడ్చె 1218

కం॥ తనసౌధము జేరగరథమును
గొనిపొమ్మనియుతాను, ముదములనునిచ్చెన్
తనశక్తిగూడదీసియు,
వనితయువద్దనుచు వానివారించెను తా- 1219

ఉ॥ అంతకుపైన, మాధవియు, నాడకనారథవేగ వేగమే
ఎంతయుమించువేగమున, యేగెను,నాదగుపుత్రిప్రాణముల్
చెంతనెనుందునొక్క॥ మరిజేరునెనాదగుప్రాణమంతయున్
ఇంతకునామెకోర్కెనిట,దీరకపోవుట కొప్పకామెయున్ 1220

మ॥ తనవాంఛల్సకలంబుదీరగను, నాతండేగదామూలమౌ
తనసర్వస్వముబోవ, యాకలితొ, యంతన్నెన్నియోదెబ్బలన్
గొనుచున్రక్తమునోడు దేహమున, నాకున్మొఖ్యదౌనాతడున్
గొనగా విస్మృతి, నేననేవిధివి, కోర్కెన్నిటన్దీర్తునే 1221

కం॥ వదలుము నేటికి నన్నును
సదయతమరియొక్కరోజు। చక్కగదీర్తున్
వదలుమటంచని యనకను
మదినాకీరోజుహాయి। మానివిగల్గెన్ 1222

కం॥ అనువుగనుండెదు। నీదినమును
నదిపీడియును రేపు। మోదమునొందన్
గననగునే రాజును। విటకున
రేపింరునకుజేరు। గూడునేనాకున్ 1223

సీ॥ అధికారిమాటలనా మెయువించును-
భయముతో రక్తంబు సరుగువదలి
గడ్డయుగట్టంగ- గజగజవణకెదు
నామెనుక్రీగంట యతడుగాంచి
రాజదండననిక- రాకుండ జేసియు
కాపాడినందుకు నీపగిదివి
లంచంబునేనును- నెంచితినంచును
తలపకు మీవును తలపునందు

గీ॥ ధనముచేతనుమరినాడు। తనువు
చేతయెంతతృప్తినినందింతు నదియునీవు
తెలియగలదానవిల। కను। కలుగు
హృదయమందునీనీధసోకదు। నతివ తెలియు 1224

చం॥ తెలిసెనెనాదుతత్వమని। తిన్నగబల్కుచు దేహమంతయున్
వలపడిమించ హస్తములు ప్రాకగవాని దొలంగజేయుచున్
పలికెను వేశ్యభామయది। బాగుగనాస్థితిమీమనంబునన్
తెలియుసమర్థులున్దయయు। ధీగుణయుక్తులు। నేనునెప్పుడున్ 1225

గీ॥ ఎవరితోడను। నుండకయింతకాల
మనగ। తాగప్పుడు విద్యలఘనులునైన
వేశ్యకాంతలనెరుగుదు। విషమ
స్థితిని। సృష్టిజేయంగ నేర్పునుజూపువారు 1226

ఆ।వె। పాత్ర ప్రేమికుండు। బడయ
దివాలాయు। కరుణరసముగురియ। సరిగ క్రొత్త
ప్రియునిమీద। నతడుపీడక
శృంగారరసము। లోనమునగ। రంజువేల 1227

కం॥ ఇటులయధికారి వాక్కులు
కటువుగానుండిననుగాని, కాంతయు నోరుకా
దిలవుగకదుపగ లేకను,
యిటులనెధైర్యంబుజేర్చి, యేనునునిజమున్ 1228

గీ॥ చెప్పుచుంటిని వేశ్యలుజేరియుండు,
వాడలోననుతెరిగిన, పట్టువిడక
సతిగనుంటిని, యనగనతడునవ్వి
నిప్పుడైనను నాలాగె, నిందునుండు 1229

గీ॥ భద్రవేశ్యలు విటులను, ప్రక్కమీద
యున్న మరియొక విటువంక కన్నులెత్తి
జూడజాలరు, వారికిగూడియున్న
యాపతివ్రతాతత్వంబు, నంతవరకె 1230

చం॥ సతియనుదానికిన్నెటుల, చక్కగక్రొత్తగనిచ్చువ్యాఖ్యనున్
మతియటునుంచి భీతిగొని, మానినియుండగనంత, హస్తముల్
కుతుకముమీరదేహమును, గొంకక, తాకకనెక్కడెక్కడో
గతియికయేమిలేక, యదిగడ్డయు రక్తము గడ్డనందునన్
1131

ఆ। వె। స్పృహను వీడిబడియె। జూడగ
నామెయు। నద్దియా మెనందు నతనినుండి
తప్పునటుల జేయ। దారియుజూపెను
గృహముజేరికొంత। గోలుకొనియె 1232

ఆ। వె। పిలచినాగరత్న వేగంబ కూతును
గూర్చియడిగె। యంతకోవలుందు
ఎట్లునుండెనంచు। నేమైన తెలసెనా
యనుచునడిగె। మరలనామెయందు 1233

కం॥ లేదనిజెప్పగయామెయు
నేదియు తెలియకయనున్న మేలనిమదినిన్
తాదలచియు। నేమగునని। తా
దెలియగతలచియామె। త్వరగనుబలికెన్ 1234

గీ॥ ఎవరినైనను బంపియు నెట్టులుండె
యద్దితెప్పింపు మనియును। నమితముగను
దెబ్బలుంతగిలెనటంచు। దెలియవచ్చె
ననియబద్ధంబులాడెను। నందునదియు 1235

చం॥ వెలుపలకంపిరత్నసటు। వేగమకూతురునున్నచోటికిన్
వెలదియువచ్చె। నందుననుపీడియు నిద్రనుకూతురుండగా
వెలుపలగర్జనల్సలుపు। భీకరసంద్రముపైన దృష్టియున్
నిలిపినకూతుజేరిత్వర। నిల్వగలేకను కౌగలించియున్ 1236

కం॥ హత్తుకహృదయంబునకును
మెత్తనిమాటలనువీవు। మేల్కొనియుంటే
ఇత్తరియన। మణిమేఖల
బొత్తిగనిదురయునురాదు। పొందగతల్లీ 1237

గీ॥ బాధయేమైననున్నదాపలుకు మనగ
యేమిలేదనె నిదురయునేలరాదు
ననగ యోచనజేయుచు గనుచునుంటి
యేమియోచనజేసెదు। నేమియనగ 1238

మ॥ గురుదేవుండిపుడేజనెన్నిచటనే। గూర్చుండి। వారిచ్చు। నా
గురుతత్వార్థము। యోజచేయగను।తాగూడెన్నముద్రంబునున్
గురుమొఖంబది। మేఘసంఘములతో। గూడెన్గదేదుఃఖమున్
సరిగాజూచినదుఃఖమూనుజనులే। చాలంగగన్పట్టుగా 1239

గీ॥ భిక్షుబుద్ధుఁడు దుఃఖంబునొందలేదు
యాతథాగతుడే గురుఁడైనవాఁడు
అంచుగుపదేవులును। జెప్పినాఁడునాకు
ననియునామెను జూచియు। నమ్మనీవు 1240

ఆ।వె। శోఁ మేలనొందనీకుసునంచును
కూతుచేతిస్పర్శ। నాతివొంద
కనులుధారలూన। గొనియును
కోవలు। రూపమిందునిలచె। రూపుదీర్చి 1241

ఆ।వె। నాదుపైనపగయు। వాదుగతీర్పగ
నుఁడునంచుతలచె। యువిదయపుడు
నాగరత్నవచ్చె। వేగంబయంతయు
తెలసికొంచుఁద్ది తెలియజేయ 1242

శా। ఎన్నోగాయములూను కోవలుడు। నందేసంజ్ఞయున్వీడగా
గన్నారగ్గనిచేలమాఖ్య త్వరతో గాయాలు తామాన్పగా
ఎన్నోమార్గములూని కన్నగికడన్జేర్చంగ। వైద్యుండునున్
కన్నమ్మాయక జేసెవైద్యమును। చక్కన్వింటినేనంతయున్
1243

గీ॥ వినిసమాచారమంతయు। వేశ్యయద్ది
కొయ్యబారెనునిలు(గుడ్లుగూడె। దాని
చెడ్డపనిజేసినావిట। ఛీయనంగ।'
యనుచుతావిన్నదంతయు। ననియెనిట్లు 1244

చం॥ నగరములోన వ్యాప్తిగొను। నన్నిటిపీనుల విన్నయిందునన్
సెగలుగొనెన్శరీరమది। జేరె। (ప్రమాదము। నిందువీడకన్
నగరముముంచునోయనగ। నాగరికుల్భయమంద। నేరునున్
ఎగువకుబారెరాజునిట। రేపునువచ్చెడు। దారియేమిట॥ 1245

గీ॥ ఉన్నపాటున పోవంగయనియెటుల
గూడునంచన। కాకున్న। గూడునెటుల
(ప్రభువువచ్చెడు సమయంబు। వలన
యన్నిమార్గముల మూసివేతురు। మానుఊన్న 1246

వ॥ ఒక్కమార్గంబు। కూడ రక్షణ లేకుండ నుండబోదు।
తక్కిన మార్గంబుల కావేరీనది యెన్నడో (మింగి
వైచె. యన 1247

కం॥ భయమది యేలనునీకును
స్వయముగ చేయూతనివ్వ జాలినదానిన్
రయమున గొందు సహాయము।
భయపడకిరీతియనుచు। పల్కెనుగానీ 1248

గీ॥ ఏదొయా వేశమందియు। నిటుతాను
వేశ్యయౌటకు నొప్పెను। వినియునద్ది
కోవలుండును నీర్ష్యతోకుములననుచు
తలచెవేశ్యగా జీవింప। తలపలేదు- 1249

కం॥ పతితనుగానిట నేనును
వ్రతమును వదలంగబోను। పరపురుషునితో
వ్రతమునువీడియు ధర్మము
క్షితిమంటను గలుపునట్లు జేయను నేనున్ 1250

కం॥ మణిమేఖల ప్రాణంబుల
ననయముజేయు నద్దియునందున్
గునపము గ్రుచ్చినరీతిని
గనుపడె। కక్కుర్తిబూని। గ్రన్ననతనువున్ 1251

గీ॥ ఇటులగాపాడ। సుతపైన జీవితంబు
గాలిమేడలు। నన్నియు। గాలిగలసి
పోవునంచును। మరియునుబోవునపుడు
పెరియ। చేలమ్మ చెప్పిన వీడరాని 1252

గీ॥ తానిసంసారియై। యెటజరుగుచుంట
కానిపనియంచు జెప్పిరి। సానినౌచు
బ్రతుకుసాగింపవలయునా? క్షితిని నేను
ననుచుచింతించెనామెయు। ననుక్షణంబు 1253

చం॥ తుదికది। నిక్కమైతనరు। దుఃఖమువీడగ యాత్మహత్యయే
యదిమెరుగైనకార్యమని। యాత్మకుతోచెడునాదుకూతునున్
వదలకకన్నగీసతియు। బాగుగపెంచియు। పెండ్లిజేసియున్
కుదురుగనాదునాశయము। గూర్చెడుపూర్తిగవృద్ధినొందెడున్
1254

చం॥ తనసుతబాగునున్ననగ। తానెటులుండును। కూతురడ్డమై
మనుచునునుండ। మోహమది। మానకపొంగు। నదీసమంబునై
గొనియటమూడుదిక్కులను। కొంచెముమార్గములేకమూసె। తా
నును। యధికారితక్కుదకు। నుత్తమమార్గము। మూసినిల్చెగా
1255

కం॥ తనకామాగ్నికి యామెను
గొనయాహుతివేచియుండె, క్రూరుడునగుచున్
అనయము జరిగినయ్యది,
గొనెదననేవేశ్యనను చు, గూడెదు పేరున్ 1256

కం॥ అనియమాధవి నిలువగొని
దిక్కులు, గృహమునందు, కోమలితిరిగెన్
జనియేను రాతిరియట్టులె
తెలవారగనూ గృహము, ముంగిటనిలచెన్ 1257

గీ॥ సేవకుండట్లునిలచియు, చిత్తమ
నుచుదేవిగారినిరమ్మనె, దేవిడివిడి
ప్రభువునాజ్ఞనురథమది, వచ్చియుండె
రమ్మటంచును జెప్పంగ, రమణినియు 1258

మ॥ వినియాదేశము, బిక్కుబిక్కుమనుచున్వెన్నంతజేయంగ, నా
జ్ఞను, పీడంగనులేక, మాధవియు, నజ్ఞానంబునన్ద్రాత్రియున్
గొనునాక్షోభయుమించుచుండగను, తాకూతున్నటన్దాసినిన్
గనుచున్నుండుమటంచు, జెప్పియును, వేగన్పోయిగూర్చుండగా
1259

ఆ।వె। వెదలెరథమునంత। వీడక
వర్షంబు। తుంపరలట। భూమినింపుచుండె
వేగరథముబోయి। విడువక
చిత్రపు। శాలయందుజేర్చె। జాణనంన 1260

గీ॥ మిట్టమధ్యాహ్నమగు వరకట్టెయామె
దిక్కుదిక్కుమటంచును। నొక్కతెయును
గూరుచుండెను। త్రాగంగనీరునేని
యిచ్చువారనులేకుండె। యచ్చటెవరు 1261

ఉ॥ ఆకసమంతమూనుకొనె. యాకొసనుండి మెఱుంగులీకొసన్
రాకలపోకలన్నలిపె. రానునురాను భయంబుగొల్పచుజా
ఆకడకుంభవృష్టి। గురియన్నట। గాలులనుద్ధృతంబునై
ఏకడగాంగమించె। కనుటెంతయొ విభ్రమమొందుచుండగా 1262

గీ॥ స్వాగతంబునుప్రభువుకు। చక్కనివ్వ
పలయుసన్నాహములనన్ని। బాగగూర్చి
వర్షమందునతడయుచు। వచ్చెవేగ
వచ్చియామెతో నీరీతిబల్కెనంత 1263

చం॥ జలనిధితీరమందుననుం చాలగగల్గినయట్టికార్యమున్
కులమునపెద్దవారు। నటగూడియు। కోపముపట్టలేకనే
నిలువక।నంతరాజునకు। నిక్కముతెల్పగనిశ్చయించియున్
సలుపుచునున్నవారుగద। చక్కగమంతసముత్తలోదరీ
1264

మ॥ వినినిశ్చేష్టతనిల్చిపోయెనట। తావిన్నంతనాతండునున్
వినిపించెన్నటు। కానినాదియగుచు న్వీడంగలేనట్టి। యా
ఘనతంత్రంబున। వారుకొంచమటపక్కాణిపగా వెన్కకున్
జనునంచెంచుచునుంటి యేదియయిన న్చాలన్నిటన్తెల్పగా
1265

కం॥ చాలకనుంటినినేననె। చాలగ
వర్షంబుహెచ్చు। సమయమునందున్
కాలము సాయంసమయము
మేలుగనటుకాకమున్నె। మించెనునిశియున్ 1266

గీ॥ చలికి,భయమున,వణకెడు। చానగనియు
భయపడంగనువలదిట। ప్రభువునాకు
బంధువగుటను। నీమీద। ప్రబలినట్టి
వైరమంతయు పోవంగవలయునంచు 1267

గీ॥ హావభావాభినయములనంతజూపి
నీదువాక్చతురత్వంబు, నిక్కమందు
అలరజేసిన, వేశ్యవు, నందువలన
క్షమయులభియింపవచ్చును, సత్యమిదియ 1268

కం॥ క్షణమును నిలువగలేకను
గొనిశ్రద్ధయును నేనునిట్లు, గూడియుజేతున్
గను మికవ్యర్థముజేయకు
గొను మామధుపాత్రయింక, కోమలినీవున్ 1269

ఆ.వె. ఆడిపాడి, నన్ను నలరింపుమాధవీ
యనుచు, మొలకనున్న, యసినినతడు
తీసిగోడకందు తిన్నగతగిలించి
తనువువిరచియతడు, గనియునామె 1270

గీ॥ వాసవుండునువచ్చియు, వలయుపనులు
నన్నిస్వయముగజూచె నాయనుచునుండె
అర్థరాత్రియెరాజునువచ్చు, దినము
భయంకరంబగు వర్షంబు ప్రబలిగురిసె 1271

సీ॥ ఒకవైపు కావేరీ- యుద్ధృతంబుగపొంగె
పట్టణంబునుముంచె- పట్టుబట్టి
కరితొండములబోలి- గురిసెడువర్షంబు
జడిగొట్టెలోపల- జాలవరకు
రాజ్యాధికారియు- రవ్వయుకిటికీల
జూచుచునిల్చుండె- చోద్యపడుచు
వర్షంపుధారలు- బహుళమై, మెర
పులు మెరయుచుగన్పట్టె- మించినటుల

గీ॥ వణకుచేతితో, మధుపాత్రపట్టి మగువ
వానిముందుకు జాపంగదానినంది
రెండుగుటకలు త్రాగియు, నిండ
ముదము, నామె పెదవులకదించె నద్దివేగ 1272

కం॥ కనులను మూసుకయామెయు
గొనెనొకగ్రుక్కయునునంత, కూరిమిమీదన్
వనితను కౌగిలిజేర్చెను,
ఘనమగుప్రేమయునునిండి, గ్రాలెమనసగా 1273

కం॥ క్షణమునపాత్రను త్రాగియు
గొనిమరియొకసారిత్రాగి, కోమలిచేతన్
తనెత్రాగించెను నదియును
మనమునవిసమనుచుత్రాగె, మాధవియందున్ 1274

ఆ. వె. సురలమరలత్రాగి, మదమున
యాతడు, కౌగలించెవనిత, కొంకులేక
తలనునెత్తి, యతని, తానునుగనలేక
కనులుమూయ ముద్దుగొనియెనతడు 1275

మ॥ బిగియారన్నటు కౌగలించియును, నాబింబాధరత్రావెలితో
వగలేకింతగవాక్షమార్గమును, నావక్రాలకల్నూపుచున్
బిగియారన్నటు నాకసంబుభువినిన్వీడంగ లేనట్లుగా
తగతాకౌగలిజేర్చియున్నలిపె, కొంతాజూడుమా నీవునున్
1276

కం॥ అనుచుననతడును చనులను
గొనినలుపుచు తానుండ, కోమలినవ్వెన్
మనసదిలేకున్నననట, గొను
నధికారినటుముదము, గూర్పగవచ్చెన్ 1277

గీ॥ అన్నపానాదులన్నియు। నన్నిమందు
రీతిమొదలయ్యె తనువును। నాతితనదు
ఆధిపత్యంబువీడెను। విధియులేక
వర్షమెంతయో హెచ్చెను। వదలకుండ 1278

మ॥ ప్రళయాంతంబుగగర్జనల్సలిపెగా। వర్షంబుహెచ్చయ్యె।నా
లలనన్గైకొని। రాజ్యపాలకుడు। లీలన్మయ్యపైజేర్చినన్
తొలగన్జేయంగలేక ప్రాణములనందున్విగ్గునన్వీడియున్
బలవంతంబుగ పాన్పుపైనబడియున్వర్తిల్లుచున్నుండెతా- 1279

గీ॥ మణులనురిమెను। నాకాశమందు
చిత్రశాలకాంతితోనిండెను। చానకండ్లు
మూసుకొంచును పడియుండె ముఖము
దరికిపానపాత్రను తెచ్చియు। వడిగనతడు 1280

కం॥ తలనటుపైకిని నెత్తియు
వలపన్నినరీతి। మధువుబాగుగత్రాపన్
కలగెడు మనసునచేదును
మెలగెడు విసమంచుమింగె। మించగలేకన్ 1281

గీ॥ హృదయనాళంబులన్నియు చీల్చికొ
నుచునొక్కటొక్కటి జారెను। చిక్కనైన
బిందువులు। చిత్రవధజేసె। వేగమందు
నాతిజీవితమంతయు। భ్రాంతియాయె 1282

గీ॥ నీయహంకారమునకిట్లు। నేడుచాస్తి
జరిగె। కళ్యాణమంజీర భరితమైన
కోర్కెచచ్చెను। నింకను। గూడి
యున్నయాపతివ్రతాత్వంబుది। యంతజచ్చె 1283

ఉ॥ మైకములోననున్నదిని। మాధవితానునుగాంచె। పూర్వమున్
తాకొను పెండ్లిలగ్నమును। తత్కృతహోమము। కోవళుండునున్
చికొనిహస్తమున్త్రిరుగ। సీఘ్రమభూసురమంత్రఘోషలన్
ప్రాకుచునుండెకర్ణముల। భామభయంపడినట్టి హోమమున్
1284

ఆ।వె। నీరుజల్లియార్పె। నింగినిపీడియు
పిడుగుబడియె। నద్దివడిగవచ్చి
పైనబడ్డయట్లు। భూమినికన్నుల
మూసుకొనియె। దుఃఖమొందియామె 1285

ఉ॥ ఘోరునవర్షమున్గురిసె। ఘోవక పెచ్చునేస్గభొందముల్
జారినరీతిగన్పడియె। సర్వము లోలి మెఱుంగుతీవెలున్
పారెను నాకసంబునను। పట్నము పుట్టినదాది। యింతయున్
నేరరునిట్టిగర్జనల।నెవ్వరునెప్పుడు।దిక్కులన్నియున్ 1286

గీ॥ బ్రద్దలయ్యెడునంచును। వసుధయంత
యెగిరిపోవునోయంచును। నెంతొదోచె
మెరపులకుగర్జనలకును। తెరపిలేక
దిక్కులన్నియు। ఘూర్ణిల్ల। నక్కడుండె 1287

గీ॥ పదును బెట్టిన యాటేలపగిది
ధారభూమినిన్ముత్రిమ్మె గాలియుఘోరుమంచు
వీచెచలిగాలి। గుండెలదూసుకొంచు
పోవుచుండెను। ప్రళయంబుపొందుమాడ్కి 1288

చం॥ పనిసవరించిపాలకుడు। భూమిసిదుస్తులన్నిచక్కగా
బనరిచి।దాసినిన్పిలచి। యొక్కడనాజ్ఞయునీయ। దాసియున్
గోనియును।దండము।త్వరగ।గూర్చియు।నన్నము।పానపాత్రలన్
జన। నొకదాసిపైడివగు। చక్కనిముద్రలసంచితెచ్చియున్
1289

గీ॥ ప్రక్కనుంచియు దండంబువరలజేసి
యాజ్ఞగొనియును, నగరాధికారియిందు
వేచియున్నాడు, ననగను, వేగనతని
బంపుమంచును, నాజ్ఞను, బరుపనంత 1290

కం॥ దండము బెట్టియు నిలచిన
నిండగువార్తలు నునిశు, నేమియుజేరెన్
కొండికయేలను జెప్పుము
దండిగయననతడుజెప్పె, దడయుచునందున్ 1291

సీ॥ ఏమనిచెప్పుదు- నిందఱిదు ప్రజలవౌ
కష్టజాలంబుల గాంచినేను
పురమునునుండెడు- పూర్వపుగృహములు
నేలమట్టంబులై - నీరునిండె
ప్రభువులకొరకునై- బహుళంబుగా
జేయు, శోభలునన్నియు- చూర్ణమయ్యె
ప్రజలునువరదల- పట్టినవారలు
నెందరోతెలియంగరాదునిందు

గీ॥ జలధిపొంగియు ముందుకు
చాలవచ్చె యిట్టి పెనుగాలివర్షంబు నింతవరకు
ఎరుగమంచునువృద్ధులునిట్టులాడె
వురుములును మెరుపులుపుట్టి। పెరిగెననగ 1292

గీ॥ నగరపాలకప్రకృతియే। యగణితముగ
జేయుభీభత్సమేనాకు। చిత్తమలరు
మన్మదోత్సవమౌచును। మాకునమరె
మీనగరవేశ్యలెంతయో। మించువారు 1293

కం॥ నెరజాణలంచు వింటిని
పురమునవిటుజూచినాడ। పూర్తిగవీరుꣳ
ధరయసమర్థులకును। గొను
వరమృత్యుసమానులౌచు। బరగెడునెపుడున్ 1294

గీ॥ కడుసమర్థులతాపంబు గడకుద్రోచి
యలసటను తాపమంతయునవలబోవు
నట్లు। సంతోషమొందగ। నవని
జేయు। వీరుశాంతులువేదాంత సారములన 1295

మ॥ తమశోకంబులనింతగైకొనక। కాంతల్చాతురీయుక్తలై
భ్రమలోముగ్గి। పరుల్సుఖంబుల। నపారంబైగొనంజేతురే
సమయంబందుననైన। దిక్కిదియా। చానాయనన్వించునున్
అమరస్త్రియ్యనితాపు। మాధవియు। నయ్యారేనిలగ్గంగినే- 1296

ఆ।వె। నేనుమునిగిపోవ। నిక్కంబుముద
మును నొందునంచుతలచు। సుందరికడ
పైడిముద్రలున్న పట్టుదౌసంచియు
పాన్పుమీదబడియె। పడతివద్ద- 1297

ఆ।వె। పాలనాధికారి। పటుకటుస్వరమటు
వీనులందుబడియె। విడువకుండ
వర్షమంతబోవ। వారకాంతనునీవు
యామెయిల్లుజేర్పుమంచు నతడు 1298

గీ॥ నృత్యమంజీరములుతెచ్చి। నృత్యమాడి
సంతసంబును గూర్చును నింతియింక
నృత్యమంజీరములెతాను। నింతిదాల్చు
నలఘుకళ్యాణమంజీర మంచుతలప- 1299

కం॥ జరుగదు నికపై యించును
వరలునెపరకాంత మెడను। వరలెడుదానిన్
వరమంగళ। సూత్రంబును। ధరి
యించగ। మదినినీకు। తగదికతలపన్ 1300

గీ॥ అతిభయంకరమైనట్టి। యద్భుతంపు
సర్పమేది యొకాటును జరిపినట్లు
వెలవెలంబోయిమూర్ఛిల్లె। వేశ్యయంత
మరలవినిపించి యధికారమాటలిట్లు 1301

కం॥ ఏవేశ్యయు నికమీదట
యీవిధికులవధువులనిక। యింతయుపీడన్
తావొనరింపగరాదెట। యీ
విధినికజరుగ నేను। యింతినివిడకన్ 1302

గీ॥ నట్టనడవీధి। పాటకననగరజనుల
ముందుగజ్జెగట్టి చి। నేనిందునాట్య
మాడచేతును। యెరుగుము మాధవి
యని। నగరమేనును జూడజనగతలంచు 1303

చం॥ ఇదిసమయంబుగాదు। ధరమీదను పాదములానబోవు। కా
నిదిపిడుగుల్విశేషముగ। యిందునరాలుచునుండె। మేడలన్
విదలిచినట్లుగూలెయిక। భీకరమయ్యెను మార్గమంతయున్
పదమిడిబోవరాదు।నన। ప్రాణముబోయిన రాచకార్యముల్ 1304

కం॥ వదలగరాదని తెలిపిన।
పదములకెగిరియును నతడు। పనులను జేయగ
కదలియు నరిగినయంతట
వదలకనిటుబల్కె ప్రభువు। పనిచెడుదానిన్ 1305

చం॥ తెలిపెదనీకుస్వప్నము। తిన్నగబుద్ధినినుంచిపీడకే
మెలగుము రాజునాజ్ఞయిది। మేదిని। యేకులనాతికీర్తినిన్
ఇలనిటు।గావ। వేశ్యకులమిందున। నుండియు వారిధర్మముల్
చెలగగ, పీడకుండునటు చేయుము। వారునెరుంగ సిద్ధియున్ 1306

కం॥ అనిప్రాక్రుచ్చెను రాజును
ననితర ధర్మానువర్తియగుచును నతడున్
అనగను తలయునువంచుక
వినిమెచ్చుచును పలికెనటు। వేగమనదియున్ 1307

ఉ॥ నాదొకవిన్నపంబునిట। నాదగుకూతురు। దీనిమీరునున్
ఏదరిలేనిదాని। యికయిప్పుడు। కన్నగినొద్దకంపుడీ
మీదయనింతజాలునన మేలని। పంపెదనంచునాతడున్
ఆదరిలేనివాననటు। నాతడుభీతిని వీడిపోయె తా- 1308

గీ॥ అతడునేగగంగ। వానలో। యతివ
తాను। జరుగుబీభత్సమంతయు చాననందు
భయమునంతయుపోవంగ। మణిని నేను
కన్నగింజేర్చి మాతృత్వ। కార్యమంత 1309

వ॥ నెరవేర్చితి। నేనింతవరకు సతిప్రయత్నంబున। కాపాడు
కొన్న సతీత్వంబంతయు నేటితో హరించె। యిక నేనొక
వెలయాలినిగా ప్రవర్తిల్ల నేలభయంబు- 1310

సీ॥ ఏవిధమైనట్టి- యేరీతిభయమును
తటపటాయింపులు- దగులవింక
సతిగానునేనింక- పతితను। వేశ్యను
చావగోరకనేమి- చక్కగల్లు

అందచందంబులు- దండిగానుంచెడు
తనువుపొంకంబును దాల్చియుం
కోరికల్వ్యామోహ- భారంబు
నెంతయోకలిగియుంటిని నేనుగాననిందు

గీ॥ పరపతీనీవు చావింక। పట్టియుండు
వంచకీ చచ్చిపొమ్మిక। మణినిగన్న
తల్లి నశియించు। దేహమానెల్లవారు
గాంచినంతనమోహంబు। గాంచువారు 1311

చం॥ తనియగజేయసుస్థిరత।దాల్చియునందముచందమంతయున్
గొనియును। వేశ్యనాయకికి।గూర్పుముతోషము।మాధవీయకన్
ఆనుకొనుచుండె। వర్షమది। యప్లై పెరిగియు।పట్టణంబునన్
గనగభవంతులన్నియును।గానగారాకనుమృగ్యమౌచునున్
1312

ఆ।వె। కొట్టుకొనియుపోయె। కూలెనుతరువులు
పశువులన్ని నీటిపాలునయ్యె
కరులు, హరులు, జనము. తురుములై
పోయిన భవనములనుదాకి। ప్రయ్యలయ్యె 1313

గీ॥ ఎచటజూచినజనముల। నేడ్పుపెరిగె
నొరిగెభూకంపమందున నొదవగానె
గిరులవోలెడిభవనముల్సొరిగిపడియె
త్రాగువానినివోలియు। ధరణియందు 1314

గీ॥ మరలిభూకంపమొకసారి। వరలనందు
నగరమందున శిధిలంబునట్టిగాని
దేదిగన్పించదాయెను। నెందుజూడ
వినగనేడ్పులే। మించియు వినగవచ్చె 1315

గీ॥ రాజభవనంబు ద్వారము। ప్రాజవీధి
యెందుగన్పడకుండగ। నిలనశించె
చిత్రశాలయుగూలెను। శీఘ్రమగను
కప్పుగూలియుపోయెను। కడకునందు 1316

ఆ।వె। వరలుపట్టెమంచమరుదైనదద్ధియు
కొట్టుకొనియుపోయిగూడెనేట
స్తంభమొక్కదాని। చానయుమాధవి
పట్టుకొనియునుండె। నట్టెతడిసి 1317

కం॥ కూలియుపోయినదాదిని।
జాలన్జలమట్లుపొంగి। చక్కగముంచెన్
ఆలలనమాధవియునట।
బేలై వణకుచునునుండె। వీక్షించియుతా 1318

ఆ।వె। పెరిగి పెరిగిపోయె। విడువక
పర్షంబు। పదనుయీ పెవోలె। వర్ష ధార
వచ్చిదగిలెతనువు। వనితకుమరణంబు
భయముజారిపోయె। వదలినామె 1319

చం॥ కనులనునశ్రువుల్వరల। కామిని దేహమునీటమున్గగా
ఘనమగుఘర్షణన్పదియు।క్రమ్మరనోడియుబోయె।మృత్యువా
వినియునురమ్మనన్నగొను।పీడకుమన్నను।నేత్రయుగ్మమం
దునసుతగానుపించె నటదూరినకొట్టినదెబ్బలెన్నియో 1320

క॥ తినియును నాయాసంబున
తనువునరక్తంబు। విడువకధారలుగట్టన్
కనులకు కోవలుదండున
గనుపించెను। నందునింక కన్నగిమాటన్ 1321

మ॥ తొలిరేయిన్నట కన్నగీసతిని। నెంతోధిరిక్కృతిన్జేయగా
లలనారత్నము। సోదరీయెపుడు। నుల్లంబందునన్గోపమున్
వెలయన్నేరదు।నంచుపల్కులవియున్వేన్నంటి।గన్పించినన్
వెలయాలున్నటస్తంభమున్కరము లన్వేగన్నటన్బట్టియున్ 1322

కం॥ కోపము మోహము మమ
తయునాపయిశోకంబు। నేమినంటవునామెన్
ఆపగిదిగుండెచప్పుడు। పై
పైకినివినగవచ్చె। పడతిభంగున్ 1323

కం॥ ఉరుములు మెరుములు నన్నియు
వరలెడు తనగుండెకొట్టు। పటుధ్వనివోలెన్
సరగునవనంతయు నిండియు
వరలువిధంబందుదోచె। వనితకునందున్ 1324

మ॥ జలరూపంబునమృత్యువద్ది విడకన్నామీప్యమున్జేరియున్
అలపాదంబులదాకెనీరు। మదియెన్నండో మునింగెన్నటన్
ఇలదేహంబది। మున్గిపోదొడగె। నింకేరీతిమార్గంబునున్
తెలియన్లేక జలంబులందుమునిగె స్త్రీరంబునున్లేకనే 1325

ఉ॥ కన్నగికోవలుండునట। గాంచగానామధురాపులంబునున్
తిన్నగజేరబోవగను। ధీగుణయుక్తుకు। వైశ్యకీర్తికిన్
ఎన్నగరానిశోభనటు। నెంతయుగూర్చెదు। నామెకందునన్
సన్నజ్వరంబురాగనట। చక్కగవైద్యుడు। మందునిచ్చినన్ 1326

గీ। జ్వరముతీవ్రతదగ్గెను। జ్వరమువలన
వచ్చుబలహీనతయుసుంత। వదలకుండె
ప్రొద్దుగూకెడులేళను క్రొత్తవారు। వచ్చి
సత్రంబునందున। బసయుజేసి 1327

ఆ।వె। ఒకరికొకరువారు తగపరిచయ
ములుజేసుకొనెడువేళ। జేరువారు
వెచ్చములుగొనగ। నెచ్చటదొరునును
గ్రామమందుమాకు। కరముచెపుడు 1328

కం॥ గ్రామీణులునిట మనలను
నేమియునాపదలపాలుజేయక సుఖమున్
ప్రామగజేయుమిరేయిట।
యీమలదస్సుల భయంబునేమియులేదే 1329

కం॥ ఇంతకునెక్కడ నుండియు
చెంతలజేరితిరిమీరు। జెప్పుడియనుచున్
ఇంతకు కావేరీపురిచెంతల
నుండియును వచ్చి చేరితిరవునా। 1330

వ॥ అయిన నాకావేరీ పురంబు నెటులనున్నయది
ప్రజలందరు సుఖంబున నుండిరాయని ప్రశ్నింప
వారిట్లనిరి- 1331

శా॥ కావేరీపురియింకనెక్కడిది। నింకన్దానిని న్వృద్ధినిన్
నీవున్వీడగవచ్చు। సంద్రముననే నిక్కంబుగాజేరె తా
ఏవీధుల్జనసాంద్రమై వెలయుగాందేని। వ్యాపారముల్
ప్రావీణ్యంబునవెల్గుచుండె నవియున్పాడయ్యెసంద్రంబులో 1332

కం॥ ఏడంతస్తుల మేడలు।
పాడయిసంద్రంబునందు। పరువడికలసెన్
నేడట ప్రళయము గల్గిన
గూడినజనులంత జలధిగూడియుకలసెన్ 1333

గీ॥ బౌద్ధభిక్షులదృష్టిలోనను। పోకపడిన
వారి। పడతులపిల్లల। వారువిడక
నరగరక్షించినారట। జాలవకు
తక్కువారలు। కడలిలో సొక్కిపడిరి 1334

గీ॥ వారిమాటలలోనను। వదలకుండ
కన్నగీసతి కోవలు। దన్నియెడల
మాధవీయనుపల్కులు। మాటిమాటి
కందువినవచ్చె కోవలుదద్దివినియు 1335

కం॥ మణిమేఖల నేటినిలబడి।
జనుచును నుండంగ బౌద్ధసంయమెనామెన్
గనిరక్షించెను। మాధవి
జనుజాడయులేదునెందు। చక్కగననునున్ 1336

గీ॥ వారిమాటలవించును। భూరిదుఃఖ
వకొండునొచును। నాతడువశముతప్పి
ఏమివింటిని దేవుడా। యిందుననుచు
గూలబడిపోయెనందున కోవలుందు 1337

ఉ॥ వచ్చెడునాడు కన్నగియు। బల్కినపల్కుల।సంస్మరించె తా
నిచ్చట।వైభవంబుగొని।యెంతొసమున్నతినొందు।నిపురిన్
ముచ్చటదీరగాంచగను। పూర్తిగనాఖరుసారి। యంచునున్
అచ్చటబల్కెకన్నులను। నశ్రులుగారగ। నామెయింకినున్ 1338

గీ॥ జన్మభూమికినాకును। సరిగనిందు
తీరిపోయెను। ఋణమది। తీరెన ‘చు
నేడ్వ। మాటలిట్లాడంగ। నేలనీకు
తిరిగిరామొకో। దుఃఖంబు। తీరదేమి? 1339

గీ॥ ఇంతలోపలనీరీతి। యిట్లువచ్చు
నంచుతలచితిమేమది। యంచునతడు
పలికెకన్నగితోడుత। వదలకుండె
శోకమంతయుమదిలోన। జొచ్చియుండ 1340

శా॥ వెంటన్తెచ్చినరొఖ్ఖమంతయును। నవ్వీటజ్వరంబూనగా
వెంటన్నుండెడి। కన్నగిసతికినై। వెచ్చించగా। దారినిన్
గొంటన్దర్చురకేవి। లేకనటులన్గూడంగ। యాలోచనన్
వెంటన్నుండెండు। కన్నగిసతియును।న్వీడంగ।నాశోకమున్
1341

కం॥ చల్లనిచిరునవ్వులతో। నుల్లము
రంజిల్లజేసి। నువిదయుతానున్
మెల్లగసంతోషంబును।
కొల్లలుగా గూర్చుచుండె। కోవలుకందున్ 1342

ఆ।వె। పోవునపుడువారు। పొందక
రథమటు। ధనములేనికతన। దారినడచి
ఊరునుండి। నూరుచేరుచుపోయిరి
మధురజేరెవారు। మానకుండ 1343

ఆ।వె। ధర్మశాలలోన। తామునుబసజేసి
బడలికంతదీర। వారువేగ
కన్నగియునుపతియు। కామాక్షి
దేవిని। దర్శనంబుజేయ। తగునటంచు 1344

కం॥ పతినటుతొందరపెట్టగ।
సతితోగూడియునుతాను జలములస్నానం
బతిరయమున। జేసియునట
నతిజేసిరిగౌరికందు। నతితమభక్తిన్ 1345

గీ॥ మధురరాణికి కళ్యాణమంజీ
రముల, జేసియిచ్చు, కుప్పుస్వామి, జేరి, చరిత్ర
మంతవివరంబుగాగను, నందు పెలుప
మరుదినంబున కోవలుందరిగె, తెలుప 1346

కం॥ కోవలుదైన్యస్థితినటు,
తావినియంతయునునతడు తగువిధమున, తా
పోవగచీదరయంతయు,
నీవిధిమాట్లాడెనతడు, నెంతయొ ప్రేమన్ 1347

గీ॥ స్వర్ణకారుడు దక్షిణభారతంబు
నందు పేర్గాంచు, బంగారునగలుజేయు
వాడు, గొప్పదౌతప్పను, వవరజేసి
యుండె, రాణియుతనదైన, యున్నతమగు 1348

కం॥ మణిమంజీరమ్ములనటుగని
చెడిపోవంగ, తానుగ్రక్కునవానిన్
పనివానకి బాగుజేయను,
పంపించగనుసద్ది యపహారణంబున్ 1349

ఆ. వె. తానుజేసియద్ది తగువై నయట్టుల
మరలరాణికివ్వ మార్గమింత
లేకయుండెతాను. వేగతిగానగ
యందెతెచ్చియివ్వ. నందులేక 1350

ఆ. వె. అపహరించుపనిలొ యధికారు
లెందరో., ధనవిలోభమూని. తగలిదాని
కరగబెట్టియమ్మి. కడమదిగై కొని
రాణిజేరియిట్లు, తానుబలికె 1351

గీ॥ ముష్కరుండెవ్వడోగొంచు. పోయెనద్ది
యంచునేడ్చుచు గడుపిండునమ్మ నెలకు
దొంగనువ్పట్టితెచ్చియు. దోస
మేమి లేదటంచునత్యంబు. కాదటంచు 1352

కం॥ అనిశము బుజువునుచేతుము
నని మొరపెట్టియును. నెట్లో. నవనివిహారల్
గొని ప్రాణంబులు. వెలుపల
జనిరట. వ్యపధియినువచ్చె. చయ్యనింకన్ 1853

మ॥ మణిమంజీరము మాకునివ్వకయ। నీమాడ్కిన్నిటనున్న।నీ
వును। శిక్షన్గొని। ప్రాణమీదెదపుగా। పోలేవునీ వెందునన్
అనిభీతిల్లగ।చెప్పెరాణి। నిదియెట్లాయంచు। నాలోచనన్
గొనియుండ।న్సమయంబుచక్కగొసిరాగూడెన్నటన్విద్దియే
1354

గీ॥ నగరపాలకులెల్లరు। నందువచ్చి
త్వరగనటువంటిమంజీర। వరమునీవు
జేసియివ్వుము లేకున్న జేతుమిందు
విన్నుదోషిగయంచును। మున్నువలుక 1355

ఉ॥ దానినియమ్మినప్పుడును। మునుభాగములూనయెందరో
బూనివచ్చినారు। మరిపొందినకష్టము ।నట్టివేళలో
దానిలోభాగమూనగను। తక్కినవారు రారుదాననున్
బూనియుచిక్కి।దోషియయి।పొందెనుదుఃఖము।స్వర్ణకారుడున్
1356

గీ॥ క్రొత్తదానినిజేసియు। నిత్తుమనగ
యేడాయెనిమిది లక్షలు। నెందుతేను
ఉండునదియంత వెచ్చింప। దండుగనుచు
మరియు చావంగనొప్పక। మరుగుచుండె 1357

గీ చావుబ్రతుకులమధ్యను। చాలగలిగి
పోవుసమయంబునందున। కోవలుండు
మచ్చిమంజీరమమ్మగ। వానిగలువ
పోవుప్రాణంబు। లేచెను। పూర్తిగాను 1358

ఉ॥ దానినిజూచినప్పుడును। తామదియోజనజేసెనిట్లు। నే
డీరనిగొంచుపోయినిక। దేలికిరాణికిజూపిభీతినిన్
గావలత్రోలవాడనని। ఘట్టిగ। నిర్ణయమూని। రాణినిన్
గానగబోవ। కోవలుని। గాంచుచునుందుము। వత్తునిప్పుడే 1359

ఉ॥ కన్నగి। భర్తపోయియును। కాలముచాలగనయ్యె। నేలనో
తిన్నగ రాడటంచుమది। తీరికగూర్చొనలేక। యామెయున్
సన్నగదేహమున్వణక। చానయుభీతినిబూని। లోనికిన్
గ్రన్ననబైటకున్తిరుగు। కన్నులనూరకనిండె నశ్రువుల్ 1360

గీ॥ మధురమీనాక్షి। భారంబు। వదలినీదు
పైననుంటినియంచును। పదతియందు
ధ్యానమొనరించె। మనసార
తడయకుండ। సంధ్యజారియుచీకటి। చక్కవచ్చె 1361

చం॥ జనయటసంధ్య, చీకటులు, చాలగచిక్కనగాగ, భీతియున్
గనుగొనరె గ్రలన్విసరి, కాలమునంతయు గ్రమింగియు, పర్వగా
మనమున, కన్నగిసతికి, మానసమంతయు భీతినిండియున్
జనియెదురాత్రి, కన్నులను, చక్కగనిల్చెనుగుండెలందునన్
1362

కం॥ తెలవారురయామునందున,
మెలకువరానందునామె, మేల్కొనిజనులున్
పలువిధములనాడెడునవి,
పలుకులువినియామెనందు, బరువెత్తియుతో 1363

చం॥ వినియెను, రాణిమంజిరము, పీడకదొంగయుగొంచుపోవగా
నొనరుపయత్నము, న్నపుడునుండిన నాయగసాలి, వానిసిన్
గనుగొనిపట్టుకొంచునట, గ్రక్కునరాణికి విన్నవించగా
విని, యురిశిక్ష వేసిరట పీడకవానికియన్న మాటయున్ 1364

చం॥ వినియును కేకవేసియట, వీడియు ధైర్యము, సిగ్గుయెగ్గునున్
గొనితనయొద్దయున్ననగ, గొంచును, వేగమవీధిలోనికిన్
జని, పరువెత్తెదండనము, చక్కగజేసెది, ప్రాంతభూమినిన్
గనగను, చెప్పుదానినిజ, కారణముల్తెలియంగ నామెయున్
1365

చ॥ నిలిపినను గొట్టుచున్నననున్ నిక్కముగా జీవిమంటిరంబునున్
వెలగనిదానిదొంగలివె। పీతనిచీలనియాంలుచెప్పగా
నిలచినవెళ్లవారుగాటి। నిక్కమటంమినునమ్మిగేలినిన్
తొలగనిచేసిచప్పటులు। తోరముగొట్టియు। ఛీయటంచుమనున్
1366

చ॥ పశువును వోలెయీడ్చుకొని। వారును ముందుకుసాగనాతడున్
విశదమునయ్యె మౌనమును। వీడియు నేమియుపల్కకుండగా
అశనము లేక। రాయియెటు నాభువి నుండెమునట్లునుండె। నా
యశమును బోయికోవలుడు। నందనమౌనముబూని యోగియై
1367

శా॥ ఎన్నో దుఃఖముల న్సహించియును। తానేకష్టముల్పొందియున్
అన్నింటిన్గొని। వాటిపైని। మదినిన్నత్యంత। నిష్ఠామతన్
గొన్న నబ్బద్ధియు। నెంతొ వేగముగనే। గూడెన్నటన్యోచనల్
ఎన్నో దెబ్బలు గొట్టుచుండనట నున్నెన్నెన్నొ యాలోచనల్
1368

శా॥ ఎన్నో బోయిన బోవుగాక। నిక। నాకిందున్మహాసాధ్వియౌ
అన్నింటన్నిట కన్నగీసతియె నాకందెన్న దేవాలుగా
మున్నెన్నెనియు రాభనష్టములను నొప్పించగనా కేల। నం
చేన్నో యోచనలందు జేసి।యును: తానీరీతిన్ న్పూనెగా 1369

ఉ॥ ఎంతటిగౌరవలబుగొని, యెన్నొధనాదులగూడి కీర్తియున్
ఎంతయొగొంచు, దొంగనయి, యీగతిదెబ్బలదించు, నెల్లరున్
చింతయుచెందునట్లుగను, ఛీయనినాడుచునుండ నేనునున్
ఇంతభరించి, నేబ్రతుక, నేలనుచచ్చుట మేలెయంచునున్
1370

గీ॥ పుణ్యవ్రతములజేసెడి, పుణ్యవరుల
పాపితాకంగ వారిదౌఫలితమంత
పీడి, పాపులనౌచును, వెలయు
నేమొ, నాదుసాంగత్యదోషంబు, మీదుమిగిలి 1371

కం॥ కానగసత్పురుషునివలె
గానగవచ్చెదునునితడు, కాంచన మేలన్
తామనుదొంగిలె, ఛీయన,
వీనులవీనుచుండె, నందు, వివశుడునగుచున్ 1372

కం॥ చావునుడగ్గరపడినను, నేవిధి
యాశయును జావదెందును దానన్
కోవలుడప్పుడు తలనటు,
నావైపుకునెత్తి జూచి, యనియెనునతడున్ 1373

గీ॥ ఇందునాధార్యయున్నది। యెందు
నైన। చివరిసారిగాజూతుడు చెప్పుదన్న
ముందమోనెడి। కబురది। మున్ను
గానె। జెప్పిగావలె। నేలనుజెప్పుమిందు 1374

గీ॥ దండధారునిమాటలు। తానువినియు
ధైర్యమూనియుతానును। తలచెనిటుల
చచ్చుటెంతయు తధ్యమే। చాయగనిన
చచ్చిపోయినవెన్కను। నిచ్చటుండు 1375

ఉ॥ వారలు నెల్లరున్నిచట। బాయకచెప్పు కొనంగజేతు। న
న్నారసి। నవ్వవారలను। నందరు క్రుళ్ళియునేచ్చునట్లుగా
చేరగజేసి చచ్చెనను। చిత్తమునందున నాదుగాధయున్
చేరగ నెల్లకాలమును।జేసెదనంచు తలంచి యాతడున్ 1376

కం॥ ధీరుడునౌచును కోవలు
దారయనట నుండికదలియావురిత్రాటిన్
చేరగజనియును। నందుల
జేరెను పరశివుని। చెంత। చింతలుబాయన్ 1377

చం॥ వెదకియునన్ని చోటులను। వీడకకోమలి। భర్తయెచ్చటన్
వదలెన్ జీవితమ్ము। నటవచ్చియు గాంచియు దుఃఖచిత్తయై
వదలిన బాణమే విధిని। చారునొనాగతి। సాధ్వివేగమే
పదములు।తొట్రుపాటుగన।పాయనిక్రోధముమించనామెయిన్
1378

కం॥ సర్వమునెరిగియు నక్కడ
నుర్వీపతిసభనుజేర। యున్నతగతినిన్
శర్వాణినిపోలియునట।
గర్వంబుననుండురాజు। గాంచగవెడలెన్ 1379

సీ॥ ప్రళయార్కబింబంబు- పగిదినిమోమంత
విస్ఫులింగంబులు- వెడలుచుండ
మధురమీనాక్షియే యధములశిక్షింప
యవతరించెనొయని- యందరనగ
పదముల భువిపైన- పడుచుండవసుధయు
క్రుంగునేమొకొయంచు- కొంకువడగ
మహిషాసురునిజంప- మహిమాన్వితయుగౌరి
వచ్చెనేమొకొయని- పజలుననగ

గీ॥ భర్తృమరణంపుశోకంబు- ప్రజ్వరిల్ల
దావదవవహ్నివోలెను। తాను వేగ
వచ్చిరాజసభనుజొచ్చి। భర్తచంపు
కారణంబును తెలుపంగ। కాంతగోర 1380

కం॥ చోరునకుశిక్షతప్పదు।
నారయమంజీరమిందు। నతడు నుదొంగై
కోరికగైనటోవగ। యా
రసిదండించినాము నదితప్పగునే 1381

ఉ॥ చేరిచినొక్కనిచట. జేసెనుదొంగతనంబటంచునున్
కూరుప। సేవకాధములు। కొల్వుననుండెడివారు। చెప్పగా
నేరనిరాజు. ధర్మమును నిక్కమెరుంగగలేక। సుంతయున్
చేరవకాలు। ధర్మమది। చేకురునేయెట ధర్మమార్గమే 1382

సీ. అధికారనిచయంబు- నందియుదుర్బుద్ధి
నేరంబుజేసిన నేరగాని
వీడియు- చేయనిపివశునిదొంగగా
ప్రకటింపరాజును- వల్లెయనుచు

గంగిరెద్దునువోలె- కడదాక నేరంబు
చూడకశిక్షింప- చోద్యముగద
అపరాధిపలనను- నావంతవిషయంబు
నెరిగితివేయిందు- నింతయేని

ఆ।వె। ఏమికారణంబు। ఏనుది
సాక్ష్యంబు। నాదుభర్త శిక్షనొందజేయ
అనుచునామెసభను। నాక్రోశమొనరింప
పతియుధర్మభీతి। పఢుడునగుచున్ 1383

శా॥ అమ్మాయెవ్వతెవీవు। నేమిజరిగెన్నంత న్వినన్జెప్పుమా
ఎమ్మాడ్కిన్నిటునీకనర్థమొదలె। న్నేలాటిదుష్కార్యమున్
అమ్మాపొందిన।వాడెవండు।విపులంబై యుండగా।నంతయున్
కొమ్మాధైర్యము।జెప్పుమాయనగ।తాగూడెన్మనోధైర్యమున్
1384

ఉ॥ నాపతిసత్యవర్తనుడు। నన్నునుగొంచును జీవితార్థమై
నీపురిజేరె। తండ్రియడు। నిర్మలమంజిరమమ్మవచ్చి। తా
నీపురిలోననుండుచును। నిందునస్వర్ణమయంపు వస్తువుల్
తాపరిశుద్ధవర్తనను। తానునుజేసెడువాడునంచునున్ 1385

కం॥ నమ్మిరయునాపతి యిప్పుడు
సొమ్మునునమ్మంగజేరె। చోద్యముగాదే
సొమ్మదిదొంగదియంచును
నమ్మియును। నపరాధిగాని। నాపతినిందున్ 1386

ఆ।వె। ఉరినితీసిమీరు తీరనియవచార
మిందుజేసినారు। నేమటంచు
న్యాయమిందునేను। నర్థించుచుంటిని
ప్రభువులుమీరుగాన। వనరజేయ 1387

చం॥ అనియునుకన్నగీసతియు నట్టులనాడగ। రాజువిస్మయం
బునుగొని।మంత్రిగాంచియును।పొందెననర్థమటంచునీమెయున్
కొనియునువచ్చె న్యాయమును।గూడగగావుననీవునిక్కమున్
గనుమునటంచు బల్కగను। కార్యముదీర్చగ స్వర్ణకారునిన్ 1388

కం॥ పిలువగబంచియు సభలో
తెలుపుము నిందేమిజరిగే। తెలియకపనియా
నిలుపుము న్యాయంబునిట
గలుగదు భయమింతవీకు। గావునజెపుమా 1389

చం॥ అనియని న్యాయనిర్ణయము। నందునతల్పగ ప్రశ్న వేసినన్
మనసునదాచియున్నియును। మానెనుసత్యముజెప్పనద్దియున్
వినియునుకన్నగిసతియు। వీడియుశాంతము। నిర్భలుండునై
మనియెదురాజు। రాజ్యమును। మన్ననగల్గునె। సత్యవాదికిన్ 1390

గీ॥ నోరులేనట్టిగోవది త్వరగనరిగి
న్యాయనిర్ణయమడుగంగ। న్యాయమొప్ప
జేసినట్టిదౌభూమిని జేరిపుట్టి
యుంటి నిట్టిదియెరుగను। నుర్వియందు 1391

మ॥ ఇదిగోసాక్ష్యమునీకు। రాజగనుమా। నీదైనమంజీరమున్
మది। నేజూపినదానినిన్గనియునిమ్మా। తీర్పునన్నీపనున్
వదలన్నేనిక నిన్నుదుర్భదమునన్పావింపకే న్యాయమున్
ఇదినీరీతిగజేసినాడవిట। గొమ్మవిందుమచ్చాపమున్ 1392

సీ॥ కన్నగిమంజీరమున్నతిగా నెత్తి
సభికులు ప్రభువును- చక్క జూడ
విసురుగాచేయెత్తి- వినుడుమీరంత
మణిరత్నసహితమై- నైనయుననుచు

భూమికేసియుగొట్టి- పూర్తిగానయ్యెది
ప్రయ్యలౌచుననటు వసుధయంత
అగ్నికణంబులు- నంతయువిరజిమ్మ
నేరీతినుండెనో- నిక్కమటుల

గీ॥ జిమ్మరత్నంబులనుచట। జేరి
జూచువారలెల్లరు విస్మయభావములను
మాటలురాకయు బొమ్మలు మహినినిల్పు
నట్లునిలుచుండిపోయిరి। నందరచట 1393

ఉ॥ ఒక్కొకరత్నమే యిచట। నుండియు నగ్నికణ బుపోలియున్
ప్రక్కలబోక రాజగృహవర్యము దగ్ధముజేయుగాక। నే
నొక్కెడభర్తృపాదముల। నుంచియునామనమందువీడకన్
చక్కగనున్న। శాపమునచయ్యనగాల్చెడు। నాదువాక్కుపై
1394

చం॥ అనియనికన్నగీసతియు। నక్కడనెల్లరుజూచుచుండగా
మనమునభర్తృపాదముల। మానకనిల్పియు। గొకితల్చియున్
ఘనమగునగ్నిహోత్రమున।గాల్చెనునామె। శరీరమందునన్
గొనియునుదుఃఖమెల్లరును। గూడియువిస్మయమందుజూడగా
1395

మ॥ ధరపైజిమ్మిన రత్నజాలమదియు న్తాన్వంగియున్నగ్నిలో
త్వరగాలన్నపుడవ్వి। నన్నియును। నెవ్వారున్నటన్నిల్పగా
ధరశక్యంబును గానియట్టులను। తద్వాక్యంబును న్గొంటచే
పరగన్నగ్నికణంబులోలె। యెగెనెన్నాహాయనన్నా జనున్
1396

కం॥ ధరవీడియు నెగసినయవి
ధరనాయకుగృహముమీద। దాడియుజేసెన్
త్వరగగాల్చియు వేసెను।
వరలునెనన్యాయమెంమి। వసుధనునెపుడున్ 1397

శా॥ శాపాగ్నిన్పడి। దివ్యమౌభవనము న్సంక్షేమమున్వీడగా
ఆపాటున్గని యెల్లవారుభాయమున్నొందంగ। నవ్వీటిలో
తాపొందెన్నట కన్నగీసతియును న్దైవస్వరూంబునున్
ఏపౌరుండును వీడకుండ సలుపన్నెంతెని సద్భక్తినిన్ 1398

చం॥ నిలచెను। దైవరూపమున। నిష్ఠురభర్తృపదాశ్రితంబునై
మెలగెడి దివ్యచిత్తమును। మిక్కిలిగైకొనియుంట। నామెయున్
ఇలనిటనుండువారలును। నెప్పుడువీడక భక్తియుక్తులై
తలపుననుంచ కన్నగియు। తానును ధన్యతజెంది నిత్యమున్
1399